


ఎదురుచూపులు

—చిత్రం : వీరిశెట్టి అచ్యుతరావు.

# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

మిమ్మల్ని రోజంతా హాయిగా
మరియు సువాసన వెదజల్లుతూ
ఉంచుటలో సాటిలేనిది




నవోత్సాహమునిచ్చే, పరిమళముగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరు వాడితే తీక్షణమైన ఎండతో చికాకు కలిగించే వాతావరణములో కూడ మీకు చల్లగా, హాయిగా ఉంటుంది. ఈ మెత్తని పౌడరును ఒళ్లంతా రాసుకొంటే చెమట వలన కలిగే చికాకు లేకుండా మీరు రోజంతా ఉత్సాహముగా మరియు హాయిగా ఉంటారు. రోజంతా హాయిగా ఉండుటకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ పౌడరునే వాడండి.

చీజ్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో. యు.ఎస్. అమెరికాలో సంస్థాపితము)

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 53
సంచిక 26
25-3-59

**Founder : K. NAGESWARA RAO**

విలంబి ఫాల్గుణ బహుళ ప్రథమ బుధవారం




## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
'ఏక్ షోలే' చిత్రంలో
ప్రదీప్‌కుమార్, మాలాసిన్హా

# రాజధాని కబుర్లు

# సమర్థుడు సంజీవరెడ్డి

**"వాన కురిసింది, ఆకాశం వెలిసింది" అంటూ కవిత్వం పలికారు సభాపతి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు. ఫిబ్రవరి 28 వ తేదీ శనివారం ఉదయం ఆంధ్రప్రదేశ్ శాసన సభామందిరంలో. వర్షం కురిపించిన మేఘం శ్రీ నీలం సంజీవరెడ్డి; వర్షం ఆయన ఉపన్యాసం వెలిసిన ఆకాశం నిశ్శబ్దమైపోయిన శాసనసభామందిర.**

అయ్యదేవరవారిని మనం రాజకీయ వేత్తగా ఎరుగుదుం. శాసనసభ్యుడుగా, శాసన సభాపతిగా ఆయన మనకు పరిచితులు. చారిత్రకుసిగా బహుశః కొద్ది కాలంలో చూస్తాం. కాని కవిగా కాళేశ్వరరావుగారు మనకింత వరకు పరిచయం లేరు. ఆయన గుండెల్లో అణగిమణగిన కవితాకోకిల మొన్న శనివారం పలికింది.



మంత్రులకు, ఉపమంత్రులకు; ప్రధాన మంత్రులకు, ముఖ్య మంత్రులకు ఉపన్యాసాలు చేయడానికి అవకాశాలకొదవ ఉండదు. కాఫీ హోటళ్ల వద్దనుంచి కాలువలపై వంతెనలవరకు ఎన్నో ప్రారంభోత్సవాలు చేస్తూంటారు మంత్రులు. సమాచార శాఖ ప్రచురించే మాసపత్రిక 'ఆంధ్రప్రదేశ్' పుటలు తిరగెయ్యండి; ముఖ్యమంత్రి ఎన్ని సంస్థలకి, సభలకి ప్రారంభోత్సవాలు చేస్తూంటారో తెలుస్తుంది.

మంత్రులు నెలకి వందలాది ఉపన్యాసాలు చేస్తారు. వందలాది చేసినా, ఆ ఉపన్యాసాలలో ప్రత్యేకత కనుపించదు. వందలాది ఉపన్యాసాలు చేయడమే దీనికి కారణం కావచ్చు. ప్రతీ ఉపన్యాసం ప్రణాళికవద్ద ప్రారంభించి పంచాయితీ ఎన్నికలవద్ద తేలవలసిందే. ఒక్క విద్యామంత్రి ఉపన్యాసాలలో మాత్రమే ప్రత్యేకత కనిపిస్తుంది. మరి—అది ఆయన ప్రత్యేకత !

* * * *

గతశనివారం శాసనసభలో ముఖ్యమంత్రి దాదాపు తొంభై నిముషాలు ప్రసంగించారు; ప్రసంగించిన తరువాత, సభ్యులు, చూడవచ్చినవారు అనుకున్నారు: "వానకురిసింది; ఆకాశం వెలిసింది" అని నూర్లకొలదిమంది మనస్సుల్లో భావాలను సభాపతి మాటలలో పాదిగారు.

పే కమిటీ ధర్మమా అని నెల్లాళ్లు తలపట్టుకున్నా, అదిచేసిన సూచనలేమిటో ఎవరికీ అర్థం కాలేదు. పేకమిటీ సూచనలు అమలు జరిపితే, సంవత్సరానికి నాలుగుకోట్లరూపాయల వ్యయం ఔతుంది అంది ప్రభుత్వం. కాదు, మూడుకోట్ల పై చిలుకు వ్యయం ఔతుంది అంది కొంతకాలం తర్వాత. మూడుకోట్ల పై చిలుకు కాదు; రెండు కోట్లకుపైగా మాత్రం ఖర్చౌతుందని ఈమధ్య తెలిసింది. రాష్ట్రంలో రెండు లక్షలమంది ఎన్. జీ. ఓ. లు ఉన్నారు. సగటున ఒక్కొక్కరికి నెలకి రూ 17 లు జీతం పెరిగితే ప్రభుత్వానికి సంవత్సరానికి నాలుగుకోట్లు వ్యయం ఔతుంది. చిన్న ఉద్యోగస్థులను ఎవరిని ప్రశ్నించినా, పేకమిటీ సూచనల వల్ల నష్టమో, కొద్దిగా లాభమో వచ్చేనారే కాని పదిహేడురూపాయల లాభం సంపాదించుకొన్నవారే కనపడలేదు. మరి—ఏ అంకెల తికమకలపై అధారపడి, పేకమిటీ ఈ సూచనలు చేసిందో తెలియదు.

ఆ మధ్య రాజధానీనగరంలో ఎన్. జి. ఓ. లు, ఉపాధ్యాయులు చేసిన 'సమ్మె' విజయవంతంగా సాగింది. సచివాలయంలో, కొన్ని కొన్ని కార్యాలయాలలో గదులకు తలుపులు తీయవలసిన అవసరం కలుగలేదు. కొన్ని కొన్ని కార్యాలయాలలో ఉన్నతోద్యోగులు ఉదయం గేటువెలుపలికి వచ్చి, లోనికివచ్చి పని చేయమని క్రింది ఉద్యోగులను బతిమాలుకొన్నారట. పన్నెండుగంటలకు ఎన్. జీ. ఓ. ల సంఘాలు 'సమ్మె' విరమణ ప్రకటించాయి. అటుపిమ్మట ఆ ఉన్నతోద్యోగులే—'ఎందుకు లోపలికి రావడం? మీ సెలవు దరఖాస్తులు మంజూరయ్యాయి. పోపాండి.' అని కట్టడిచేశారట!

రాజధాని నగరంలో నివసించే—నివసించవలసివచ్చిన—క్రింది ఉద్యోగుల బాధలను గురించి ఎలుగెత్తి పాడగలిగిన కవి ఇంకా ఉద్భవించలేదు. డెభ్భై రూపాయల జీతంలో ఆఫీసులకు అరగంట ఆలస్యంగా చేరవేసే బస్సులకే ఐపోతుంది పదిహేను రూపాయలవరకు. రెండుపూటలా తిండి తినడం ఉద్యోగి, అతని భార్య ఐనా మానుకోవాలి. లేకుంటే—మూడు పూటలా తిండి తినడం, అతని పిల్లలైనా మానుకోవాలి. బయటికి వెళ్ళేటప్పుడు పేంటు, షర్టు వేసుకెళ్ళి, ఇంటికి రాగానే బట్టలు విడిచి పెళ్ళాం

 "ప్రవీణ్" 

# ★ రాజధాని కబుర్లు ★

చీర కట్టుకోనే ఉద్యోగులు లేకపోలేదు రాజధానీనగరంలో.

*          *          *          *

సమ్మె చేయడానికి ఉద్యోగులకి చట్టబద్ధమైన హక్కు ఉంది. కాని ఇతర ఉద్యోగులు వేరు, ప్రభుత్వోద్యోగులు వేరు. ఏ బాధ్యతాయుతప్రభుత్వం తన ఉద్యోగులను సమ్మె చేయడానికి ప్రోత్సహించ జాలదు; సమ్మెను క్షమించలేదు. పరిపాలనా యంత్రాంగం పనిచేయడం మానిననాడు దేశానికే ముప్పు.

ఫిబ్రవరి 27 వ తేదీనాడు ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి శాసన సభలో ఈ పరిస్థితిని గురించి ప్రకటన చేస్తారని తెలిసింది. కాని ప్రశ్నోత్తరాల సమయం ముగియగానే, ప్రతిపక్షనాయకు లీ సమ్మె ప్రస్తావన తెచ్చారు. క్రింది ఉద్యోగుల సమ్మెపట్ల తమ సానుభూతి ప్రకటించారు. నిరసనగా శాసనసభామందిరం నుంచి నిష్క్రమించారు. తాము చేస్తామన్న ప్రకటన ముఖ్యమంత్రి చేయ లేదు.

ఇరవై రెండవ తేదీన చేయవలసిన ఉపన్యాసం ఇరవై ఎనిమిదిన చేశారు ముఖ్యమంత్రి.

జూలియస్ సీజర్ నిరంకుశుడు. బ్రూటస్ వ్యక్తిగతంగా ఉదారుడు. ఈ విషయాలు మార్కు ఏంటనీకి తెలియకపోలేదు. తెలిసి, ఆ విషయాలను ఉపయోగించుకొని ఏంటనీ చేసిన ఉప న్యాసం, విలియం షేక్స్పియర్ కృపవల్ల చరిత్రలో నిలిచి పోయింది. పేకమిటీ సూచనలలో లోపాలు ముఖ్యమంత్రికి తెలి యక పోలేదు. ఎన్. జి. ఓ. ల పరిస్థితి ఆయనకు అర్థంకాకపోలేదు. తెలిసి, అవి ఉపయోగించుకొని, ఆయన చేసిన ఉపన్యాసం ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ చరిత్రలో నిలిచిపోతుంది.

ఉపన్యాసం మెల్లిగా కంఠం ఎత్తకుండా ప్రారంభిం చారు ముఖ్యమంత్రి. వెళ్ళినకొద్దీ ఉద్రేకంగా ప్రసంగించారు. ఆ ఉద్రేకం అదుపులో ఉన్న ఉద్రేకం; తాను చెప్పదలచుకున్న విషయాలను మరచిపోని, మరచిపోనీని, ఉద్రేకం. ప్రతిపక్షాల సహ కారం పొందాలని మూడేండ్లుగా తాముచేస్తున్న యత్నాలను వివరించారు. ఆ యత్నవైఫల్యాన్ని గురించి విచారంతో ప్రస్తావిం చారు. ఉద్యోగులు రాజకీయపత్తులౌతున్నారని ఆవేదన, ఈ పరి స్థితి సాగనిస్తే 'అయూబ్ ఖానే మందు'అన్న శోస్యం—ఆనాటి ఉపన్యాసంలో ఉన్నాయి. కాంగ్రెసువాళ్లు పరిపాలనలో సౌక్యం కలిగించుకుంటున్నారన్న ఆరోపణ పరిశీలించి, ప్రతిపక్ష సభ్యుల విమర్శలకి భయపడి ఉద్యోగులు ప్రవర్తిస్తున్నారన్న నిర్ణయానికి వచ్చారు.

సముద్రంహోరుతో సాగిన ఆనాటి ఉపన్యాసం ప్రతిపక్ష సభ్యుల్నికూడా నిస్తబ్దులుగా చేసింది. గత సంవత్సరం నూట పద హారుగురు శాసనసభ్యులు వరంగల్ లో ఇంజనీరింగు కళాశాల స్థాపించ బడాలని నివేదిక ఇచ్చినప్పుడు ముఖ్యమంత్రి దాదాపు ఇటువంటి ప్రసంగమే చేశారు. వందలాది ఉపన్యాసాలు ఆయనచేసినా ఈ రెండూ మరచిపోలేరు సభ్యులు.

ఆ ఉపన్యాసం విన్నతరువాత కొంతసేపటివరకూ 'వాన కురిసింది; ఆకాశం వెలిసింది' అన్నభావం పోలేదు. చాలాసేపటి వరకూ 'సంజీవరెడ్డి ఎంతసమర్థుడు!' అన్న అభిప్రాయం పోలేదు.



మార్చి 10వ తేదీన మద్రాసు, అన్నామలై మందిరంలో సోవియట్ కళాకారులు కీలుబొమ్మలాట ప్రదర్శించారు. ప్రేక్షకులను 90 నిముషాలసేపు సంభ్రమ చకితులనుచేసిన ఆ ప్రదర్శనంలో బొమ్మలనుఆడించిన నటులు శ్రీ వ్లాదిమిర్ మైజెల్, శ్రీమతి ఈవ్ సెసెల్నికోవా..మాస్కో సెంట్రల్ పపెట్ థియేటర్ బృందం శ్రీ సెర్గీ అబ్రాట్సోవ్ నాయకత్వాన మన దేశంవచ్చి ఈ ప్రదర్శనలు ఇస్తోంది.



## "కరి మ్రింగిన వెలగపండు"

**ఆర్థికమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రవేశపెట్టిన బడ్జెటుపై ప్రసంగిస్తూ శాసనమండలి సభ్యుడు శ్రీ గుట్టా రాజారావు బడ్జెటును 'కరి మ్రింగిన వెలగపండు'గా వర్ణించారు. లోపల గుజ్జు ఉన్నా లేకపోయినా వెలగపండు గుండ్రంగా నిరాక్షేపణీయంగానే కనిపిస్తుంది శ్రీ రాజారావు వర్ణన ఉచితంగానే కనిపిస్తుంది. కాని వెలగపండును మ్రింగిన 'కరి' ఎవ్వరో స్పష్టం చేయలేదాయన.**

సాధారణంగా మంత్రులందరూ 'పనుల'మంత్రులు; ఆర్థికమంత్రి మాత్రం 'పన్నుల'మంత్రి కాని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో మంత్రులందరూ 'పన్నుల' మంత్రులే అయ్యారు. తెలంగాణాలోను, ఆంధ్రలోను ఉన్న చట్టాల సమన్వయంపేరిట తక్కువున్న రేట్లను హెచ్చుచేశారు. నయాపైసలలోకి మార్చి కొంత లాభంచేశారు. జీతాల సమన్వయంపేరిట హెచ్చున్నవి తగ్గించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాధించిన కార్యాలను, సాధించనున్న కార్యాలను తెలిపి, పన్నులేవీ వేయకుండా ఉన్నది ఆర్థికమంత్రి మాత్రమే. అందువల్ల ఉన్న మంత్రుల్లో ఈయనే పనుల మంత్రేమో, కొంచెం 'హార్దిక' మంత్రేమో అనిపించారు.

బడ్జెటు వచ్చినప్పుడు పన్నులు పడతాయేమోనని ప్రజలు శంకిస్తారు. ఎక్కువపన్నులు పడకపోతే సంతోషిస్తారు. పన్నులసలే పడకపోవడంవల్ల, సంవత్సరంపొడుగునా విధింపబడ్డ పన్నులుకాక పన్నులు గుర్తుకొచ్చాయి ప్రజలకు. ప్రభుత్వానికి కూడా ఇంత ఆదాయం వస్తుందని స్పష్టంగా తెలియని పరిస్థితి. ఎవరికీ ప్రయోజనకరంకాని పరిస్థితి.

## రేషనలిస్టుల ఫోరమ్

**ఇటీవల ముప్పైమంది ఆలోచనాపరులు సికిందరాబాదు కలాసీగూడ పాఠశాలలో సమావేశమై ప్రజల్లో ఆలోచన రేకెత్తించేందుకు తీసుకోవలసిన చర్యలనుగురించి ఆలోచించడం ప్రారంభించారు. 'జంటనగరాల రేషనలిస్ట్ ఫోరమ్' ఒకటి స్థాపించాలని నిశ్చయించారు**

రాజకీయపక్షాల బంధాలలో పడని వ్యక్తులున్నారు ఈ ముప్ఫైమందిలో. శాసనమండలి సభ్యులు శ్రీయుతులు ములుకోట్ల వెంకటశాస్త్రి, కాళోజీ నారాయణరావు, అతావుర్ రహ్మాన్‌ఖాన్, తదితరులు శ్రీయుతులు ఆవుల సాంబశివరావు, కె. వెంకట్రామయ్య, ఏ. ఎల్. నరసింహారావు, కోదాటి నారాయణరావు, ఎస్. వి. కొండపి, జి. సురమౌళి, డి. హనుమంతరావు, జి దక్షిణామూర్తి ప్రభృతులున్నారు.

ఆలోచన మంచిది కాదనటానికి నేనెవణ్ణి? కాని ఆలోచించకపోవడంకంటె, ఆలోచిస్తున్నామనుకొని భ్రాంతిపడి ఇతరులపై విరుచుకుపడే వ్యక్తులవల్ల సంఘానికి హాని ఎక్కువుంటుంది. అంతర్వర్ణ వివాహాలు మంచివే. అవి ప్రోత్సహించబడనంతవరకు మన సమాజానికి విముక్తిలేదు. కాని అవి రాజ్యాంగబద్ధం చేయబడాలని, అంతర్వర్ణ వివాహాలు కాని వివాహాలు నిషేధించబడాలన్న ఆలోచనను ఏమనాలి మనం

ఆలోచన మంచిదే! ఆలోచించదలుచుకుంటే ఆలోచించండి. కాని ఆలోచిస్తున్నామనుకొని భ్రమపడి, చుట్టూ గోడలు కట్టుకొని కూచోకండి

* * * *

## విందులు: భోజనాలు

**'నిన్నుచూస్తే దేశంలో కరవొచ్చిందేమో అనిపిస్తోంది' అన్నాట్ట జి కె చెస్టర్టన్ షాతో 'నిన్నుచూస్తే నీమూలానే వచ్చిఉండా లనిపిస్తోంది' అన్నాట్ట షా చెస్టర్టన్‌తో. రాజధానినగరంలో ఇప్పుడు జరుగుతున్న విందులు చూస్తే, ధాన్యంధరలు హెచ్చులేవని తిమ్మారెడ్డిగారితో అంగీకరించవలసివస్తుంది**

ఫిబ్రవరి 27వ తేదీన ముఖ్యమంత్రి పత్రికాప్రతినిధులకు విందుచేశారు. ముఖ్యమంత్రి చేసినవిందు ఆహ్లాదకరంగా లేకుండా ఎలా ఉంటుంది? మార్చి ఒకటవతేదీన రాత్రి లాఅఫీసర్ల విందు ఖైరతాబాదులోని ఇంజనీర్సు ఇన్‌స్టిట్యూట్‌లో జరిగింది. మార్చి రెండవతేదీ రాత్రి అసెంబ్లీ ఆవరణలో శ్రీ గడ్డం నారాయణరెడ్డి (ఎమ్. ఎల్. ఏ) అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి శ్రీ సాదిక్ అలీ గౌరవార్థం విందుచేశారు.

శాసనసభా కాంగ్రెసు పక్షం సభ్యులు అందరూ చందాలు చెల్లించకపోవడంవల్ల ఒకసభ్యుడు ఈవిందును ఏర్పాటు చేశారట. కాని లాఆఫీసర్ల విందు విషయంలో ఏం జరిగిందో తెలియదు. ఆహ్వానపత్రికలు కార్యదర్శిగారి పేరిట వెలువడ్డాయి. విందుకూడా వ్యక్తిగతంగా ఏర్పాటు చేయబడిందేమో తెలియదు. కాని ప్రవేశద్వారంవద్ద లాఆఫీసర్ల సంఘంతో సంబంధంలేని వ్యక్తులు అతిథులను ఆహ్వానించడం జరిగింది. వ్యక్తులే యీవిందుల నేర్పాటుచేస్తే అందులో ప్రభుత్వోద్యోగులు—మంత్రులు, న్యాయమూర్తులు

(62-వ పేజీ చూడండి)




# సాంఘిక న్యాయం పేరిట అన్యాయం

ఢిల్లీలోనూ, ఇతరత్రా సమావేశాలపై సమావేశాలు జరిగాయి. ఈనెల 6వ తేదీ శుక్రవారంనాడు ప్రధానమంత్రి పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రసంగించారు. శనివారం ఉదయం భారత వాణిజ్యసంఘాల ఫెడరేషన్ వార్షిక సమావేశాన్ని ప్రారంభించారు; ఆదివారంనాడు రాజస్థాన్‌లో భారత సేవక సమాజ్ వార్షిక సమావేశంలో ఉపన్యసించారు. సోమవారంనాడు (మార్చి 9) బొంబాయిలో ఒక బహిరంగ సమావేశంలో ప్రసంగించారు. ఈ సమావేశాలన్నింటిలోనూ ప్రధానమంత్రి ఉద్ఘాటించిన ప్రధానాంశం ఒక్కటే: నాగపూర్ కాంగ్రెసు తీర్మానం గూర్చి—ముఖ్యంగా "సహకార సంస్థలు గూర్చి".

భూవసతికి పరిమితి, సహకార సంస్థలు, ఆహార ధాన్యాల అమ్మకాన్ని జాతీయం చెయ్యటం—నాగపూర్ కాంగ్రెసుసభలో చేసిన ఈ మూడు ముఖ్య నిర్ణయాలను ప్రజలకు నచ్చచెప్పి ఒప్పించాలని ఎంతగా ప్రయత్నిస్తున్నారో, అంతగా వాటిపై కాంగ్రెసుపార్టీ సభ్యులలో తీవ్ర ప్రాతికూల్యం కాకపోయినా గాఢమైన సందేహాలు ప్రబలాయి. శనివారం సాయంత్రం పార్టీ సభ్యులు సమావేశమైనప్పుడు, నాగపూర్ తీర్మానాన్ని అమలుచేయగలంత సమర్థత ప్రభుత్వానికున్నదా అని సభ్యులు సందేహం వెలిబుచ్చారు.

భూవసతికి గరిష్ఠపరిమితి నిర్ణయించే విషయమైకూడా వారు ఆందోళన ప్రకటించారు. ప్రధానమంత్రి అదంతా వింటూ కూర్చున్నారు. ఆయన ఒక తెరవెనుక కూర్చుని, తన పార్టీ సభ్యులు-ముఖ్యంగా తన రాష్ట్రంనుంచి వచ్చిన సభ్యులు ఏం మాట్లాడుకుంటున్నారో చాటుగా విని వుంటే—మరికొన్ని కొత్తరకం విమర్శలు ఆయనచెవిన పడివుండేవి. మౌలానా ఆజాద్ రాసిన విషయాలు చూడరాదూ! ప్రధానమంత్రి సిద్ధాంతాలమీద నుంచుని ఊహాగానంచేసే మనిషనీ, ఎటుపోయి ఎటు వసుందో అనే ఆలోచనైనా లేకుండా తనకు తోచినదాన్ని అందరినెత్తినా రుద్దే మనిషనీ మౌలానా అభిప్రాయపడ్డారు. ఉదాహరణకి: స్వయం నిర్ణయాధికారం అనేది సిద్ధాంతరీత్యా భేషైనదే; అంతకంటె ఆదర్శప్రాయమైన మార్గం లేదన్నమాట నిజమే. కాని ఈ సిద్ధాంతాన్ని కాశ్మీర్ సమస్యకు వర్తింపజేసేసరికి, ఏకు మేకై కూచ్చుంది. అలాగే సిద్ధాంతరీత్యా, భూవసతి నెత్తిపై మేకు కొట్టటం అనేది చాలా మంచి ఊహ; సాంఘిక న్యాయం అంటారే, దాన్ని చేకూర్చేందుకు ఉత్తమమైన మార్గం. కాని ఆచరణలో కొచ్చేసరికి ఈ ఆదర్శం పేరు మార్చుకుని రు. 700 కోట్ల నష్టపరిహారం వేషంలో బయటికొస్తుంది. అలాగే:—భూమిలేనివాళ్ళకి న్యాయం చెయ్యాలంటే హిందూ, ముస్లిం వారసత్వ చట్టంప్రకారం భూమిపై అధికారం గలిగిన ఆసాములకు అన్యాయం చెయ్యటమే అవుతుంది.

ఇంకో చిక్కు ఉన్నది: రైతూ మనిషే గనక — తన భూమిలో కొంతభాగాన్ని ప్రభుత్వం లాగేసుకుంటుందని ఎప్పుడైతే గ్రహించాడో, అప్పుడు పొలాన్ని బాగు చెయ్యాలి, ఎక్కువ పంట పండించాలి, దానికిగాను ఎక్కువ పెట్టుబడి పెట్టాలి అనే మంచి ఆలోచనలు తెంచివేసుకుంటాడు.

పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ప్రధానమంత్రి కొన్ని జాగ్రత్తగా గమనించవలసిన ముక్కలన్నారు. "మన ఆలోచనలను ఒక పద్ధతిలో మలచుకోవటం నేర్చుకోవాలి," అన్నారు. "మనం తీసుకోదలచిన చర్య సరైనదీ, సమంజసమైనదీ అయితే—దానికి వ్యతిరేకించేవారు తప్పకుని వెనక ఉండిపోతారు. మిగతావారే ముందుకుపోతారు" అనికూడా ఆయన అన్నారు. వ్యతిరేకించేవారు తప్పుకుంటారో లేదో, అసలు ఆ వెనకబడిపోయేది ఎవరెవరో మరికొన్ని నెలల్లో తేలుంది.

భారతీయ వాణిజ్యసంఘాల ఫెడరేషన్ "విందుసభలు" అంటూ ఒక మంచి పద్ధతి ప్రవేశపెట్టింది. క్రితంఏడు సభలో వక్త ఆర్థికమంత్రి శ్రీ మురార్జీ దేశాయి. ఈ ఏడు రెండు విందుసభలు జరిగాయి. వీటిలో హోమ్‌మంత్రి శ్రీ గోవిందవల్లభ పంత్, సర్ రామస్వామిముదలియార్ వక్తలు.

సర్ రామస్వామిగారు "వ్యాపారస్తులు: నాడు, నేడు" అనే విషయంమీద ఉపన్యసించారు. "నాడు" అంటే స్వాతంత్ర్యానికి ముందన్నమాట. ఆయన మొదలు పెట్టటం బాగానే మొదలెట్టారు. 'స్వాతంత్ర్యానికి ముందురోజుల్లో వ్యాపారస్తులు అద్భుతం మీద అద్భుతం సాధించారు. స్వేచ్ఛావ్యాపారపుపోటీ ఒకమూల తమను పీటీచేస్తున్నా, తట్టుకున్నారు. పరాయి ప్రభుత్వం అడుగడుక్కీ వారిని నిరుత్సాహ పరిచింది. అయినా దేశంలో కొన్ని పకడ్బందీసంస్థలు స్థాపించారు. ఇవి ఈనాడు 'మనవి' అని గర్వంగా చెప్పుకోదగినవిగా ఉన్నాయి. ఫెడరేషన్‌చేసే తీర్మానాలను ఆరోజుల్లో ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలించేది. బ్రిటిష్ గవర్నర్ జనరల్ తాలూకు కార్యవర్గం

వాటిని సానుభూతితో గమనించేది. ఇప్పుడు పరిస్థితి ఎందుకు మారిపోయింది?" అని శ్రీ ముదలియార్ ప్రశ్న వేశారు. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఆయన కప్పదాట్లు వేశారు. దీనికొకటే సమాధానం: వ్యాపారస్తులు తమ కాళ్ల మీద తాము నిలబడటం మానేశారు. ఇతరుల కాళ్ళ మీద నిలబడటం అలవాటు చేసుకొన్నారు. మచ్చుకి:—భారతీయ పరిశ్రమలకు రక్షణ కల్పించటానికి ఒకటే మార్గం కనిపిస్తోంది మనవాళ్ళకి. ఏమి ఉంటే — దిగుమతులను పూర్తిగా నిషేధిస్తే మన పరిశ్రమలు వృద్ధి అయిపోతాయని. నిజానికి దేశీయ పరిశ్రమకు ముఖ్యరక్షకులు దేశీయులే. వీరిని నిర్లక్ష్యించి చేయగలిగిందేమీ లేదు. అలా నిర్లక్ష్యించటం వల్లనే మన పరిశ్రమలు ఇలా అఘోరిస్తున్నాయి.

*   *   *

కాంగ్రెసుపార్టీ అనే సురక్షితమైన సరస్సులో ప్రయాణం చేస్తూకూడా, శ్రీ మురార్జీ దేశాయిగారి మొదటి బడ్జెట్ అనే పడవ తుపాను దెబ్బ తినేసింది. శ్రీ ఫిరోజ్ గాంధీ సుడిగాలిలా తగులుకున్నారు. ప్రణాళిక కోసం కొత్త పన్నులువేసి డబ్బు వసూలుచేయటమూ, ఆ డబ్బు కాస్తా సచివాలయంలో కూర్చున్న పూజార్లు గుట కాయస్వాహా చెయ్యటమూ—ఏమిటి మహాప్రభూ ఇదంతా? అని ఆయన నిగ్గదీసి అడిగారు. "ఉత్పత్తి కోసం ఉద్యోగాలు" అని శివరెడ్డి సూత్రీకరించారు. దాన్ని "ఉద్యోగాలకోసం ఉద్యోగాలు" అని భారతప్రభుత్వం అపార్థం చేసుకున్నట్లు కనబడుతుంది.

'రెండవ పంచవర్ష ప్రణాళిక కొంచెం భారీగా ఉందండీ' అని ఎవరైనా విమర్శిస్తే "అబ్బే. మనదేశపు అవసరాలతో పోలిస్తే అసలు ఈ ప్రణాళిక కంటికే ఆనదు," అని సమాధానం వస్తోంది.

కేంద్రప్రభుత్వం డబ్బు ఖర్చుపెడుతున్న దేశపు అవసరాలు కొన్ని మచ్చుకి చూపిస్తాను:—

ఆసియా, ఆఫ్రికా, ఇతర కామన్వెల్తు దేశాలలోని విద్యార్థులకు, ఆయా దేశాల్లో స్థిరపడిపోయిన భారతీయ విద్యార్థులకు భారతదేశంలో చదువుకునే నిమిత్తం ప్రభుత్వం కొన్ని స్కాలర్ షిప్పులిస్తోంది. ట్యూషను ఖర్చు, పరీక్షలఖర్చు మొదలైనవి కాక, వీరికిచ్చే స్కాలర్ షిప్పు డబ్బు నెలకు రెండువందలు. ఈపద్దు క్రింద 1959–60 సం॥ బడ్జెట్‌లో రూ. 18.68 లక్షలు కేటాయించారు.

మెట్రిక్యులేషన్‌లో గాని, దానితో సమానమైన ఇతర పరీక్షలలో గాని వచ్చిన ఫలితాలనుబట్టి ఏటా 200 మందికి స్కాలర్ షిప్పులిచ్చే ఏర్పాటు వుంది. స్కాలర్ షిప్పు పరిమితి ఒక ఏడాది. విద్యార్థి బుద్ధిగా చదువుకుని అభివృద్ధి చూపిస్తే, చదువు అయిపోయేదాకా స్కాలర్ షిప్ పొడిగిస్తారు. దీనికిగాను 7.7 లక్షల రూ. కేటాయించారు.

ఆటల్ని ప్రోత్సహించే స్కీములను అమలు చేసేందుకూ, రాజకుమారి అమృతకౌర్ ఆటల తర్ఫీదు స్కీముకు గ్రాంటులిచ్చేందుకూ 1959-60 సంవత్సరానికి 25.75 లక్షల రూ. కేటాయించారు.

యువజన సంక్షేమ కార్యక్రమం క్రిందికి వచ్చే రకరకాల స్కీములకుగాను 8 లక్షల రూ. కేటాయించారు.

కార్మిక, సాంఘిక సేవాకార్యక్రమం అని ఒకటుంది. దీన్ని రెండు స్కీములుగా విడదీశారు. ఒకటి: నడుంవంచి పనిచెయ్యటంలో తప్పేమీ లేదనే శ్రమ గౌరవభావం విద్యార్థులలోను, ఇతర యువకులలోనూ కలిగించటానికి, గ్రామ జీవితం, గ్రామ పరిస్థితులు వారికి పరిచయంచేసి వాటిని అభివృద్ధిచేయటానికి శ్రమదానచేసే అవకాశాలు కలిగించటానికి కార్మిక, సాంఘిక సేవా శిబిరాలు ఏర్పాటుచేయటం.—రెండు: విశ్వవిద్యాలయాలు, ఇతర విద్యాలయాల్లో అత్యవసరమైన సౌకర్యాలు కలిగించేందుకు కొన్ని ప్రాజెక్టులు ఏర్పాటు చేయటం. ఈ కార్యక్రమంక్రింద గ్రాంటులు కావాలని దరఖాస్తు పెట్టుకున్న విద్యార్థులు, ఉపాధ్యాయులూ ఆ ప్రాజెక్టులలో చేరితముకు చేతనైనపని తాము ఉపతాభక్తిగా చేస్తూఉండాలనిఒక షరతు ఉన్నది. ఏమైతేనేం, ఈ కార్యక్రమానికి కొత్తబడ్జెట్‌లో 53 లక్షలు కేటాయించారు.

"స్వచ్ఛంధ విద్యాకార్యక్రమం" అనేది ఒకటుంది. పరిగణన పొందిన స్వచ్ఛంద విద్యాసంస్థలు తమ సెకండరీ విద్యాకార్యక్రమాన్ని అభివృద్ధి చేసుకునేందుకుగాను వాటికి ధనసహాయం చేయటం ఈ స్కీము లక్ష్యం. దీనికి రూ. 16 లక్షలు కేటాయించారు.

గ్రామ విద్యాసంస్థలకు గ్రాంట్లు ఇవ్వటానికి రూ. 3౪.౨8 లక్షలు కేటాయించారు.

జాతీయ క్రమశిక్షణ స్కీము 1954 జూన్‌లో ప్రారంభించారు. మొదట్లో ఈ స్కీము ఢిల్లీ, పంజాబు ఉత్తర ప్రదేశ్, జమ్మూ, కాశ్మీర్, పశ్చిమ బెంగాల్ ప్రాంతాలలో నిర్వాసితులైన బాలబాలికల పాఠశాలకే పరిమితమై ఉంది. ఇప్పుడు దానిని ఆ ప్రాంతాలలోని ఇతరపాఠశాలలకు కూడా వర్తింప చేశారు. దీనికి 59-60 సం॥ బడ్జెట్‌లో రూ. 20 లక్షలు కేటాయించారు.

కేంద్ర సాంఘిక సంక్షేమసంస్థ స్త్రీలకు పిల్లలకు, వికలాంగులైనవారికి, బాలనేరస్తులకు సహాయంచేస్తోంది; ఆయా రకాలవారికి సహాయంచేసే ఉద్దేశంతో పనిచేస్తున్న స్వచ్ఛంద సేవా సంస్థలను ప్రోత్సహిస్తోంది. దానికి రూ. 2 కోట్లు కేటాయించారు.

ఇప్పుడు కొన్ని ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి. విద్యా బాధ్యత రాష్ట్రాలది. ప్రాథమిక విద్యాబాధ్యత రాష్ట్రప్రభుత్వాలదికూడా కాదు. స్థానిక సంస్థలది. తరవాత—దేశంలోని వాళ్ల తక్షణావసరాలకే తగినంత డబ్బు లేకపోతే, పై దేశాలవారి విద్యాసౌకర్యాలకు రూ. 18 లక్షల 68 వేలు కేటాయించటం సబబుగా లేదు.

భారత సైనా సరిహద్దులలో వెయ్యిమంది ఖానిసలున్నారు. భారతప్రభుత్వం వీరిని విడిపించాలని సంకల్పించింది. అయితే డబ్బు కొరతమూలంగా ఏడాదికి వంద మంది కంటె ఎక్కువగా విడుదలకావటం లేదు.

విదేశాలవారికి స్కాలర్ షిప్పులివ్వటానికి డబ్బు ఉందిగాని, ఖానిసల్ని విడిపించటానికి డబ్బు లేదు.

అసలు సంగతికివద్దాం. పైన కొన్ని కొన్ని కార్యక్రమాలను, వాటికి అట్టేపెట్టిన మొత్తాలు పేర్కొన్నాను. ఆ డబ్బంతా భారత ప్రజల నిజమైన అవసరాలను తీర్చటానికేనా అని సందేహం. "పాడుపు పాగుపు" అని చేసే నినాదాలకు ఆఖర్చు అనుగుణంగా ఉందా అనుమానం. యువజనోత్సవాలు, కార్మిక శిబిరాలు, సాంస్కృతిక ప్రతినిధి వర్గాలూ లేకుండా ఈ దేశం కనీసం వంద సంవత్సరాలు మనగలిగింది. ఇంకో ఏడేళ్లలో భారతదేశం ఆర్థికంగా, పారిశ్రామికంగా, వ్యావసాయికంగా ఎలాగూ స్వయంపోషకం అవుతుందని ప్రధానమంత్రి అంటున్నారు కదా—ఆ ఏడేళ్ల పాటూ వీటిని వాయిదా వేయగూడదా? వేస్తే దేశం భ్రష్టమై పోతుందా? ఇలాంటి చెత్తాకానీ ఖర్చంతా మానేసే బడ్జెట్ లోటు భర్తీ చేసుకోవచ్చునే?

*   *   *

ప్రముఖ స్విస్ జర్నలిస్టు డా॥ రోజర్ బెర్న్‌హీం ఈమధ్య వివాహం చేసుకున్నారు. ఆయన భార్య బ్రిటిష్ యువతి. ఆవిడ ఆయన్ను వివాహమాడటానికి ఈ దేశం వచ్చింది. వివాహ సందర్భంలో పెద్ద విందు జరిగింది. విందుకు స్విస్ రాయబారి డా॥ క్లిమెంట్ రెజోనికో, స్విస్ వాణిజ్య సలహాదారు ఎరిక్ మెంతా, అసోసియేటెడ్ ప్రెస్ ఆఫ్ అమెరికా తాలూకు మిస్టర్ వాట్సన్, లండన్ టైమ్స్ ప్రతినిధి రోజర్ టూల్మన్ మొదలైన ప్రముఖులు హాజరయ్యారు. ❖

# వికారాలా మమకారాలా

'తల్లి పుట్టినిల్లు మేనమామకు తెలియదా' అన్న లోకోక్తి ఒకటి వుంది. నిజమే! ఎందుకు తెలియదు? తెలియదని పనిగట్టుకుని చెప్పినా నమ్మేవాళ్ళెవరున్నారు? కానీ ఏమాటకామాటే చెప్పుకోడం మంచిది—ఆ వూరికి ఈ ఊరు ఎంత దూరమో, ఈ వూరికి ఆ ఊరూ అంతేదూరం గనుక తల్లి పుట్టినిల్లు మేనమామకు తెలిసినప్పుడు మేనమామ పుట్టినిల్లు తల్లికి మాత్రం తెలియకపోతుందా? తల్లికి తెలిసిన తర్వాత అదంతటితో ఆగిపోతుందని హామీ ఏముంది? ఆమెద్వారా సంతానానికి గూడా తేటతెల్లం గాకపోతుందా?—అందులోనూ నా విషయంలో ఒక్క తల్లికి మాత్రమేగాక అటు వెనుకటితరంలో మా నాన్నమ్మకు, ఇటు ఈ తరంలో మా ఆవిడకూ కూడా అదే పుట్టినిల్లూ, ఇదే మెట్టినిల్లూ కావడంచేత మా మామయ్యగారి కుటుంబాన్ని గురించి నాకు తెలియని విషయమంటూ ఒకటీ వుండకపోవడంలో ఆశ్చర్యానికి ఆస్కారంలేదు. వరుసగా మూడుతరాలు ఇచ్చి తీసుకుంటే మూడు యజ్ఞాలు చేసినంత పుణ్యమని చెబుతారు. పుణ్యం సంగతి నాకు తెలియదుగానీ, ఇందుమూలంగా మా ఇంట్లో అత్తా కోడళ్ళ మధ్య పొరపొచ్చాలు తక్కువని మాత్రం ఒప్పుకోక తప్పదు. అలాగని మా నాన్నమ్మ మా అమ్మనీ, మా అమ్మ మా ఆవిడనీ సాధించరనీ, నాలుగు మాటలు విసిరి, ఒక్కదులుపు దులిపి మూతి బిగించరనీ అపోహ పడగూడదు! వాళ్ళల్లో వాళ్ళకు వెయ్యి విభేదాభిప్రాయాలున్నమాట నిజమే! కానీ ఒక్కవిషయంలో వాళ్ళది ఏకాభిప్రాయం. పుట్టింటిని గురించిన ప్రసక్తి గాలివాటుగా వచ్చి చెవిలో బడినాసరే వాళ్ళు ఏకోన్ముఖంగా లేచేస్తారు. తమ పుట్టింటిపైన ఈగ వ్రాలడానికి వీల్లేదంటే లేదంటారు!

బంధుత్వమేగాక మామయ్యగారి వూరికీ మా వూరికీ మధ్య దూరంగూడా తక్కువే. నాలుగణాలు మనవి కావనుకుంటే పదిహేను నిమిషాల బస్సుప్రయాణం. అక్కడ వాళ్ళు పొయిమీద పెనంపెట్టి కబురు పంపితే మనం వెళ్ళి దిగేసరికి వేడివేడి గారెలు తయారై వుంటాయన్నమాట!

ఈ సమీప సంబంధబాంధవ్యాల్ని పురస్కరించుకుని మా మామయ్యగారి కుటుంబవృత్తాంతాలు ఆధారంగా ఓ కథ వ్రాయాలన్న కోరికతే చాలాకాలంగా వుంది. కానీ ఏవేవో సంఘటనలు కలగాపులగంగా స్ఫురిస్తాయిగానీ, వాటితో కథ గట్టడానికి వీలయిందిగాదు. ఎలాగైతేనేం, యిన్నాళ్ళకు మా చిన్నమామయ్యగారి

## మధురాంతకం రాజారాం

కుమార్తె చి॥ సౌ॥ కుం॥ రాజేశ్వరి పుణ్యమా అని కథ కన్నులకు గట్టింది!

కాళ్లు గడిగి కన్యాదాన మిచ్చారుగదా అని నాకు మా పెద్దమామయ్యగారిపట్ల పక్షపాత మనుకోకపోతే యిక్కడోమాట చెప్పాలి. మా చిన్నమామయ్యని గురించి నాకు తెలిసింది చాలా తక్కువ. పెద్దమామయ్యా, చిన్నమామయ్యా ఒకే తల్లి బిడ్డలని మాత్రం ఖచ్చితంగా తెలుసు. లేదంటే ఒక కడుపులో పుట్టినవాళ్లు సైతం ఉత్తర, దక్షిణ ధ్రువాల్లా ప్రవర్తించవచ్చుననిగూడా రూఢిగా తెలుసు.

ఓకు ఓడని కుండంతా ఓడనగూడదు. ఆదిలో మా చిన్నమామయ్య చాలా మంచివాడు. ముక్తసరిగా చెప్పాలంటే డాక్టర్ జెకిల్‌లాంటి మనిషి. కానీ ఏంచేద్దాం! విధివిధానం తప్పించరానిది గదా! కాలప్రభావాన మా చిన్నమామయ్య మిస్టర్ హైడ్‌లా తయారై కూచున్నాడు.

ఈ పరిణామానికి కారణాలూ వున్నాయి. కారకులూ వున్నారు. కారణాల్లో ముఖ్యమైంది ఉన్నతోద్యోగం. కారకుల్లో ముఖ్యరాలు మా సుందరమ్మత్త!

కానీ యిక్కడ కాసేపాగి ఆత్మపరిశీలన చేసుకోడం అవసరమేమోనన్న అనుమానం సైతం నాకు లేకపోలేదు. రంగుటద్దాలకు లోకమంతా రంగుగానే కనిపిస్తుంది కానీ రంగున్నది అద్దాల్లోనేగానీ, లోకంలో గాదు. మా చిన్నమామయ్యగారి ఉద్యోగప్రాభవం, సిరిసంపదలూ మా స్వార్థానికి వుపకరించలేదన్న అక్కసులో—నాకు సుందరమ్మత్తపట్ల యిలాటి దురభిప్రాయం కలిగిందేమో! కావచ్చుననుకోడానికి అవకాశమున్నమాట వాస్తవమే! కానీ బొత్తిగా ఈ కలియుగంలో—ఎముకలువిరిచి, అష్టకష్టాలుపడి చదివిస్తే పట్టా చేతికి వచ్చి ఉద్యోగం దొరకగానే పట్టపుటేనుగ నెక్కినట్టు సంబరపడి కుమారుడు తల్లిదండ్రులనే విస్మరించే ఈరోజుల్లో మేము రక్తసంబంధాన్ని ఆసరాగా వుంచుకుని మా చిన్నమామయ్యనుంచీ ఆశించగలిగిందేముంటుంది చెప్పండి! లేదంటే ఆడబిడ్డలకు పుట్టింటిపట్ల మమకారం త్రెంపినా తెగదు గనుక వాళ్లు ఏడాదికో చీర, యింత పసుపూ కుంకుమా ఆశించేమాట నిజమే! ఐతే మాత్రం? ఆచీరకూ, పసుపుకుంకుమకూ పదిరెట్లెక్కువగా ప్రచారం చేసిపెట్టి తమ పుట్టింటి ఘనతను అందలంలోపెట్టి ఊరేగించేది వాళ్ళేగదా! బుద్ధిసూక్ష్మతకు కాణాచి అయిన మా సుందరమ్మత్త యింత చిన్న విషయాన్ని గురించి ఆలోచించకపోవడం విచారకరం! ఆమె దాసీ పన్నా రాకుమారుణ్ణి తీసుకెళ్ళిపోయినట్టు మా చిన్నమామయ్యను మానుంచి దూరంగా తీసుకెళ్ళిపోయింది. ఆ తరువాత ఆయన మాకు ఏ ఒకటి రెండుసార్లుమాత్రమే కనిపించాడు. కానీ అదేం కనిపించడం! అల్లావుద్దీనుకు పద్మిని అద్దంలో అలా కనిపించి, అంతలో మాయమైవుంటుంది!

మా చిన్నమామయ్య అలా తెరవెనక్కు వెళ్లిపోయి పదిహేనేళ్లయింది. ఈ ఒకటిన్నర దశాబ్దాల్లో ఆయన సువిశాల ఆంధ్రప్రదేశంలో ఎప్పుడెప్పుడు ఏయే వూళ్ళలో నివసించారో మాకు తెలియదు. ఒకసారి పెద్దమామయ్యగారికి చిన్నమామయ్యతో అత్యవసరంగా ఓపని పడింది. ఈయన 'లోను' కోసం అప్లయిచేశారు. వాళ్ళ తమ్ముడి సంతకంలేనిదే అప్పివ్వడం సాధ్యంకాదన్నారు. ఏ వ్రేళ్ళతోనైతే పలకమీద ఓనామాలు దిద్దబెట్టించారో, ఆ వ్రేళ్ళతో మా పెద్దమామయ్యగారికి ఓ చేవ్రాలు కావలసి వచ్చింది.

ఈయన చిన్న మామయ్యగారి డిపార్టుమెంటులో తనకు తెలిసినవాళ్ళకందరికీ వుత్తరాలు వ్రాశారు.

అసలు మా చిన్నమామయ్య వుద్యోగంలో చేరింది అనంతపురంలో! అక్కడినుంచీ కడపకు ట్రాన్స్ఫరు వచ్చింది. కడపనుంచి ఆయన గూడూరుద్వారా కుటుంబసమేతంగా సామానులన్నింటినీ పాక్ చేయించుకుని గుంటూరికి వెళ్తూ రైల్లో కనబడినట్లు ఓ మిత్రుడిద్వారా వర్తమానం తెలిసింది. పెద్దమామయ్య గుంటూరికి ఉత్తరంవ్రాసి చూచారు. ఆ వుత్తరం గుంటూరునుంచీ విజయవాడ, ఏలూరు, విశాఖ అలా అలా ఉత్తరాంధ్రదేశమంతా ఓ చుట్టువేసుకుని కడకు సురక్షితంగా ఫ్రమ్ అడ్రసుకే వచ్చి చేరింది.

అప్పట్లో కొందరు పెద్దమనుషులు 'తప్పిపోయినాడు' అన్న శీర్షికక్రింద పత్రికల్లో ఓ ప్రకటన వేయించగూడదా అని సలహా గూడా యిచ్చారు.

కానీ మా పెద్దమామయ్యగారివన్నీ భగీరథ ప్రయత్నాలు. ఆయన అంత సులభంగా ఆశ వదిలిపెట్టే రకంగాదు. చివరికాయన రాష్ట్ర ముఖ్యపట్టణానికే జాబువ్రాసి డెడ్ లెటర్ ఆఫీసులో చిరునామాను పోల్చుకున్నట్టుగా చిన్నమామయ్య ఆచూకీ కనిపెట్టేశారు.

అప్పుడు మా చిన్న మామయ్య ఆదోనిలో వున్నాడు.

ఆదెబ్బతో మా పెద్దమామయ్యకు కన్నడాంధ్ర సంస్కృతులకు సంగమక్షేత్రాలయిన ఆదోని, బళ్ళారిలాంటి పట్టణాల్ని సందర్శించే భాగ్యం కలిగింది.

అప్పటికీ మా పెద్దమామయ్యే నయం! నా సంగతి చెప్పుకోవటం నామట్టుకు నాకే సిగ్గుబాటుగా వుంటుంది. ఒకసారి నేను మా చిన్నమామయ్యను చూచిరావడానికని బయల్దేరి, భూమి గుండ్రంగానే వుందన్న పరమసత్యాన్ని ఋజువు చేసుకున్నాను.

వాకబుచేయగా తెలిసింది చిన్నమామయ్య నెల్లూరుజిల్లా కనిగిరిసీమలో వున్నాడని!

అర్ధరాత్రప్పుడు గూడూరులో రైలెక్కాను. హేమంత నిశీధం. రెండుగంటలూ, ఆ ప్రాంతంలో మంచుదుప్పటి కప్పుకుని పెన్నానదీతీరంలో నిద్రబోతూ కనిపించింది నెల్లూరు. 'చిన్నమామయ్య ఈ పట్టణంలో వుంటే ఎంత బాగుండేది! హాయిగా



## ★ పితరాలూ, మమకారాలూ ★

యిక్కడ దిగేసి బంధుదర్శనంతోబాటు రంగనాథుణ్ణికూడా దర్శించుకోడానికి వీల య్యేదిగదా' అని విచారించాను.

కానీ అంతలోనే మళ్ళీ ఒకఊహ. రంగ నాథునికేం తొందర? ఆయన శతాబ్దాల నుంచీ యిక్కడే వున్నాడు. ఇకపైనా యిక్కడే వుంటాడు. మా చిన్న మామయ్య సంగతి అలా కాదే!

తొలికోడి కూయకముందే సింగరాయ కొండలో ఆగింది రైలు. మంచు దట్టంగా కురుస్తోంది. చీకట్లో యింతకుమునుపెన్నడూ కాలుపెట్టి ఎరుగని ఆ వూళ్ళో బస్‌స్టాండు వెదికి పట్టేసరికి కాళ్ళూ చేతులూ కొంకర్లు పోయినంత పనైంది.

సరే, బస్సు తెల్లవారకముందే కదిలింది. సరిగ్గా మధ్యాహ్నం పదకొండు గంటలకు కనిగిరి!

అన్వేషణ సాగించాను ఆఫీసుకోసం. ఆఫీసేమో కనిపించింది. "అయ్యోనాయనా! ఇంతదూర మొచ్చేశావా? మీ మావయ్య నెల్లూరికి ట్రాన్స్‌ఫరై నెలరోజులైందే! ఐనా యిప్పుడేం మించిపోయిందిలే! హోటల్లో భోజనంచేసి బస్సులో కూచో. సరిగ్గా సాయంత్రం ఆరున్నరకు నెల్లూరు" అన్నాడు మా చిన్న మామయ్య స్థానంలో పనిచేస్తున్న ఆఫీసరు.

ఇంత పనిచేశావా భగవంతుడా అను కుంటూ ఒంటి గంటకు కనిగిరి—నెల్లూరు బస్సులో కూచున్నాను.

మరపురానిది ఆ ప్రయాణానుభవం.

రెండుమూడు బారలకన్నా పొడవు లేని ఆ చిన్న బస్సు మట్టిబాటలో పరుగెడు తుంటే చెక్కలకు చెక్కలుగా, కమ్ములకు కమ్ములుగా ముక్కలు ముక్కలై నుగ్గు నూచమై గాలి కెగిరిపోతుందేమోనని తోచింది. నిజానికి పెన్న దాటుతునేదాకా నమ్మకం లేకపోయింది, పెరుమాళ్ళను గానీ, చిన్న మామయ్యను గానీ చూడగలనని!

"ఇదేనా రావడం! ఊళ్ళో అందరూ బాగున్నారుకదూ? కాఫీతీసుకొస్తానుండు" అంటూ సుందరమ్మత్త లోపలికి వెళ్ళింది.

అడిగిన ప్రశ్నలకు నేను జవాబివ్వక ముందే లోపలికి వెళ్ళిపోతున్న సుందర మ్మత్తను చూస్తూ విస్తుపోయాను.

ఇది జవాబుకోసం గాకుండా కేవలం మర్యాదకోసం చేసిన పరామర్శ కాబోలు!

ఇంతలో ఎలా వెళ్ళిన సుందరమ్మత్త అలాగే వట్టి చేతులతో తిరిగొచ్చేసరికి ఈ కాఫీ మర్యాద కూడా లాంఛనప్రాయమే నేమోనని నేను బిక్కచచ్చిపోయాను.

"ఈ వంటలక్కలతో వచ్చిన చిక్కే యిది! సమయానికి అయిపు లేకుండా పోతుంది. నువ్వలా గదిలో రేడియో వింటూ కూచో బాబూ! నేను చలమయ్యను హోట లుకు పంపిస్తాను" అంటూ ఈసారి సుందర మ్మత్త వరాండావైపు వెళ్ళిపోయింది.

వాకిటనే పదిలంగా చలమయ్య అనే బంట్రోతు వున్నాడనీ, ఇంట్లో వంటలక్క అమరివున్నదనీ, రేడియో మూలంగా శ్రీకాంతాపరులేననీ చెప్పకనే చెబుతోం దెమిటిమా సుందరమ్మత్త?

గదిలో కూచున్నాను. రేడియోలో సన్నగా వినవస్తున్న పాటను మినహాయిస్తే యిల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఇంట్లో ఇద్దరు పిల్లలుండాలి. (ఇది పదేళ్ళక్రిందటి మాట. ఇప్పుడు సంఖ్య త్రిగుణీకృతంకావస్తున్నట్టు తాజావార్త) వాళ్ళ సవ్వడి ఏ మూలనుంచి గానీ వినరావడంలేదు. ఇదేమిటబ్బా, రాత్రి ఎనిమిదిగంటలప్పుడు వీళ్ళేమైనట్టు?

ఆ పిల్లకు నూరేళ్ళాయుస్సు,తలచుకుంటూ వుండగానే ప్రత్యక్షమయింది అయిదేళ్ళ రాజేశ్వరి.

గదిలోకి వస్తూ వస్తూ నన్ను చూచి ఆగి పోయింది రాజేశ్వరి. ఆ పిల్లకు నేనెవరినో లీలగా తెలుసు.

"గుర్తు తెలియడంలేదా రాజేశ్వరీ! పోనీ దగ్గరికి వచ్చి చూడు" అంటూ చేతులు ముందుకు చాపాను.

రాజేశ్వరి తుర్రున బయటికి పారి పోయింది.

పారిపోయిన రాజేశ్వరి నా ఆగమనాన్ని గురించి తమ్ముడితో చెప్పిందేమో, అందుకు తోడూ ఆ యింటికి బంధువు అన్నవాడి ఆ గమనం అత్తిపూతలా విపరీతం గూడా నేమో, మూడేళ్ళ విజయ్ కుతూహలంతో పరుగునా వచ్చేశాడు.

వచ్చినవాడు అది వాడి గ్రహచారమో, కాక నేనాయింట్లో ప్రవేశించిన వేళా విశేషమో ద్వారబంధానికి పాదం మోదుకుని అడుగు తడబడి బోర్లగిల బడిపోయి ఏడుపు లంకించుకున్నాడు.

గబగబా వెళ్ళి కుర్రాణ్ణి పైకి లేవదీశాను. "దెబ్బ తగిలిందా బాబూ! ఎక్కడ తగి లింది? పోనీలే. పోతుందిలే" అంటూ వూర డిస్తున్నాను.

"ఏం జరిగింది రాజేశ్వరీ? ఎందుకు పడి పోయాడు? నువ్వు తోసేశావేమిటి?"

అంటూ అక్కడ సాక్షాత్కరించింది సుందరమ్మత్త.

"లేదత్తయ్యా! తొందరగా వస్తున్నానే పిూ! కాలుతగిలి పడిపోయాడు" అన్నాను.

"అగో, అదే! ఎందుకు రావాలి తొందరగా! ఇక్కడేం రాచకార్యాలున్నాయని? కాదులే. ఇలాకాదు..." అంటూ ఆవిడ కుర్రాడి రెక్క పట్టుకుని బరబరా హాలు మధ్యకు లాక్కెళ్ళింది.

తను కుర్చీలో కూచుంది. కుర్రాణ్ణి ఎదుట నిల్చోబెట్టింది.. "చెప్పు, ఎందుకు పరుగెత్తావు తొందరగా?" అని వీలైనంత కటువుగా ప్రశ్నించింది.

నేను తెల్లబోయాను. కుర్రాడు పరుగెత్తకుండా వుండాలంటే ఒకటి—వాడికేదో జబ్బయినా వచ్చివుండాలి, లేదా కుంటివాడైనా అయివుండాలి. ఈ రెండూ లేనప్పుడు వాడు కాళ్ళుకట్టి పడేస్తే తప్పా పరుగుతీయకుండా వుండడు. ఇక పడిపోవడమంటేనా, మహా మహా పెద్దవాళ్ళే ఒక్కొక్కప్పుడు నడిరోడ్డులో పల్టీకొట్టేస్తాగు. (ప్రేలెడంత పసివాడు అడుగుజారి పడిపోవడమూ నేరమేనా?

గొంతెత్తి ఏడవడానికి ధైర్యంచాలక, ఏడుపు బిగబట్టుకోవడంవల్ల మాటలు పెకలక గడగడలాడి పోతున్నాడు విజయ్‌బాబు!

హఠాత్తుగా దగ్గిరికి లాక్కుని సుందరమ్మత్త వాడి నడిపెన నాలుగు వడ్డించింది. "చెప్పు. ఇంక తొందరగా పరుగెత్తవు కదూ! బుద్ధొచ్చింది గదూ? పరుగెత్తవు కదూ!"

"బుద్ధొచ్చింది. ఇంక పరుగెత్తను" అంటూ విజయ్ చెంపలు వేసుకున్నాడు. వేసుకుంటే నేం గాక! ఆమాత్రంతో, సుందరమ్మత్త కోపం శాంతించింది. అదే పదివేలు!

"కూచో. నేను చెప్పేంతవరకూ అక్కడే కూచో" అని, పిండిబొమ్మను చేసి పెట్టి స్నానానికి వెళ్ళిపోయిన దాక్షాయణిలా ఆవిడ మళ్లీ యింట్లోకి వెళ్ళిపోయింది.

తొమ్మిది గంటలకు యిల్లు చేరుకున్న చిన్నమామయ్య లేవమన్నప్పటికీ ఆ కుర్రకుంక కదిలీ మెదిలాడు గాదు! మేమిద్దరమూ భోజనంచేసి తిరిగివచ్చేసరికి నిద్రముంచుకొచ్చేసిందేమో వాడక్కడే పడి నిద్రపోతున్నాడు!

"అయ్యో పాపం! విజయ్‌బాబు!" అని అనుకోకుండా వుండలేక పోయాను.

కానీ నేనక్కడున్న నాలుగురోజుల్లో ఈ చిన్న విజయ్‌బాబు నిర్మాణదశలో వున్న ఒక చిన్నశిల్పం మాత్రమే ననీ, యింతకంటే పెద్దశిల్పం ఎన్నడో తయారై పోయిందనీ తెలుసుకోగలిగాను.

అవును మరి! అలావుంది పరిస్థితి. అనవసరంగా మాట్లాడకూడదన్న నిర్ణయానికి వచ్చినట్లున్నాడు చిన్నమామయ్య. సుందరమ్మత్త "స్నానానికి లేస్తారా" అంటుంది. ఈయన స్నానాలగదిలోకి వెళ్తాడు. "భోజనానికొస్తారా" అంటుంది. పీటపైన కూచుంటాడు. "ఆఫీసుకు టైమయింది" అంటుంది. ఈయన పైకి లేస్తాడు. ఆమె ట్రంకు తెరిచి పాంటు, బుష్‌కోటు పైకి తీస్తుంది. గుండీలు వేయడం, మేజోళ్ళు తొడగడం, క్రాపు దువ్వడం లాంటి ఫినిషింగ్ టచెస్ గూడా సుందరమ్మత్త చేతిమీదుగా జరిగిపోతాయి. చిన్నమామయ్య ఆఫీసుకు వెళ్లిపోతాడు... ఇలా దొర్లిపోతున్నాయి రోజులు.

జీవితం చిరుతరగలతో తెలినురగలతో పడుతూ లేస్తూ సాగిపోయే సెలయేరులాంటిదంటారు. అలాంటి జీవితం టిక్కుటిక్కుమనే గోడగడియారంలా పరిణమించడాన్ని చూస్తే ఎవరికైనా బాధాకరంగానే వుంటుంది. బరువెక్కిన హృదయంతో నెల్లూరునుంచీ తిరిగి వచ్చేశాను.

ఇది పదేళ్ళక్రిందటి మాట.

నిన్న మొన్ననే జరిగినట్టున్నా ఇప్పుడు చెప్పబోతున్నది గూడా రెండు మూడేళ్ళ క్రిందటి సంగతి. 'వివాహ నిర్ణయాలు పైలోకంలోనే జరిగిపోతాయి' అంటూ ఆంగ్లంలో ఓ సామెతవుంది. పైలోకం దాకా మానవుడి స్పుత్నిక్ పరతెంచేవరకూ అక్కడ జరిగేదేమిటో, జరగందేమిటో మనకు తెలియదుగానీ మా పెద్దమామయ్య జ్యేష్ఠకుమారై వివాహంమాత్రం దాని పుట్టుకతోనే స్థిరీకరింపబడిపోయింది. అటు దానికీ, ఇటు నాకూ కూడా పెద్దలు ఆ అభిప్రాయాన్ని పాలల్లో రంగరించిపోశారు. అక్షరాలాతో కలిపి నేర్పించారు. రక్తంతో కలిపి పోషించారు. ఇంతటితో ఏమయింది అన్నట్టు చిట్టచివరకు వాళ్లూ వీళ్లూ కూడా కూడబలుక్కుని ఓ మంచి ముహూర్తంలో డోళ్లు ధణధణా మ్రోగించి ఆ శుభకార్యం కాస్తా అయిందంటే [illegible]యిందనిపించడానికి గూడా సంసిద్ధులయ్యారు.

ఈ పెళ్ళి ఎలాగూ జరిగిపోయేదే!... కట్నాల పేచీలు, ఆడబడుచుల [illegible]లకలు, వియ్యపురాళ్ళ రాద్ధాంతాలు ఈపెళ్లికి [illegible] తగిలే అవకాశం ఏమాత్రమూ లేదు. ఈ సంగతి అందరికీ తెలుసు. కానీ దీనితోబాటు తెలియని విషయం కూడా ఒకటుంది. ఈ పెళ్లికైనా చిన్నమామయ్య వస్తాడా రాడా అన్నదే ఆ తీరని ప్రశ్న!

ఎందుకు రాడు? అతడి తల ఇనుముతో చేసిందేమిటి? వధువా అక్కచెల్లెలికొడుకు. వధువా అన్నదమ్ముడి కూతురు. దీనికే రాకపోతే యింక అతడు దేనికొచ్చేటట్టు? ఏం, తనుమాత్రం పట్టి ఇంట్లోవున్నాడా? తనకు బిడ్డలు లేరా? వాళ్లకు పెళ్లిళ్లూ, పేరంటాలు జరగొద్దా?. ఇలా సాగింది బంధువుల ఊహాగానం.

ఏమిటో మరి! వీళ్ళ చాదస్తాలే వీళ్ళవి! పాతబడిపోయిన ఈ సాంఘికాచారాలను పట్టుకుని దేవుళ్లాడుతారేమిటి వీళ్లు! బంధువులతో ప్రసక్తి లేని లవ్‌మేరేజస్ ఎన్ని జరిగిపోవడం లేదు!

అనుకున్నంత పనీ చేశాడు — చిన్నమామయ్య. పెళ్లికి హైదరాబాదునుంచీ మా బావగారొచ్చారు. మైసూరు ప్రాంతంనుంచీ మా పెద్దమామయ్య స్నేహితులు సకుటుంబంగా తరలివచ్చారు. కానీ చిన్న

# ★ వికారాలూ, మమకారాలూ ★

మామయ్య మాత్రం రాలేదు. కనీసం నా మట్టుకు నాకు ముహూర్త సమయానికి ఆయన దగ్గరనుంచీ ఓకార్డుముక్కలో శుభాశీస్సులైనా అందలేదు.

పెళ్ళి సందడి తగ్గిన పది రోజులకు ఓ వుత్తరము వచ్చింది. అందులో—పెళ్ళికి బయలేదేరి స్టేషనుకు వచ్చినట్టూ, విజయ్‌బాబు కాలుజారి (మళ్ళీ!) ప్లాటుఫారంపైన పడిపోయినట్టు, వాడి ముక్కులో నుంచీ (ఈసారి!) బొళుక్కు బొళుక్కున రక్తం కారినట్టు, అంచేత యింటికి తిరిగి వెళ్ళిపోవలసివచ్చినట్టు—ఓ సంజాయిషీ గూడా దృగ్గోచరమైంది.

ఈ భారతదేశపు రైల్వేడిపార్టుమెంటు! ఎప్పుడూ మిగులు బడ్జెట్టే దీనికి! కుర్రాళ్ళు పడిపోవచ్చు, ముక్కులోనుంచీ రక్తం స్రవించవచ్చు. అందువల్ల యింటిల్లిపాదీ పెళ్ళికి పోలేకపోవచ్చు, అన్న ఆలోచన లేకుండా బండపలతోనా ప్లాటుఫారాలు! పోనీ, సముద్రతీరంలా పైన సన్నగా యిసుకైనా పోయించకూడదూ?

పెద్దమామయ్య ముఖం చిన్నబోయింది. చదివి ముగించిన తర్వాత వుత్తరం ఆయన చేతిలో నలిగి వుండగా మారిపోయింది. ఆయనదాన్ని వంటచేసుకుంటున్న అత్తయ్య ఒడిలోకి విసిరాడు.

"ఏమండీ! ఏమని వ్రాశారు?"

పెదమామయ్య ఆ కోపంలో "ఊఁ వ్రాశారు. కూరలో పప్పులేదని..." అని, అంతలో యిప్పుడు తప్పు జరిగింది అత్తయ్యవల్ల కాదని తెలియగానే కొస్తా శాంతించి "ఈ కుంక! పెళ్ళికి రాలేక పోవడానికి ఓ కారణాన్ని కల్పించడానికైనా చేతగాని ఈ బడుద్ధాయి! అప్పట్లో నాకొచ్చే పది హేనురూపాయల జీతంలో అయిదురూపాయలు మిగలబెట్టి వీడికి ఫీసు కట్టాను. కృతజ్ఞత? ఎక్స్ప్లనేషను వ్రాస్తున్నాడు. ఎవడికి కావాలి వీడి బోడి ఎక్స్ప్లనేషను?" అంటూ ఆగ్రహాన్ని చంద్రనిప్పులుగా మార్చి శూన్యంలోకి వెదజల్లారు.

"మీదొక పాడు! ఏనాడో మీరు చదివించారని ఈనాడు మీ యింట్లో పెళ్ళికి రావాలని అగ్రిమెంటేమున్నదండీ? ఎంతగా అన్నాతమ్ముడూ అయితేమాత్రం అంతస్తులు లేవూ? మీకుకాబట్టి వాళ్ళు అమ్మాయి పెళ్ళికి రాకపోబట్టి తెలిసింది. ఐదారేళ్ళకు మునుపు తిరుపతికి వెళ్తూ వెళ్తూ ఏనాడైతే యిక్కడ దిగారో ఆనాడే నాకంతా తెలిసి తెలిసిపోయింది."

"తెలిసిపోయిం దేమిటి నీ మొహంమా!" మామయ్యగారి కోపం ఆయస్కాంతపు దిక్సూచిలాంటిది. అది ఎప్పుడు, ఎక్కడ, ఏకారణంవల్ల వుప్పతిల్లినా చిట్టచివరకు అత్తయ్యపైకే ప్రసరిస్తుంది.

"బాత్ రూము ప్రత్యేకంగా లేదుగనుక తను స్నానం చేయడం సాధ్యంకాదని మీ మరదలు నిక్కచ్చిగా చెప్పేసింది. ఆపిల్ల—పేరు రాజేశ్వర నుకుంటాను. అది 'రేడియో లేకుంటే వీళ్ళేంవింటా రబ్బా' అని విస్తుపోయింది. ఇక మీ తమ్ముడిగారి సంగతి సరే సరి! ఇంట్లో కూచుంటే ఈపిల్లలు పైనబడి ఆయన ఫాంటును కొస్తా నలిపేసి వూరుకుంటారు. బయట అరుగుపైన కూచోవడానికి నామోషీ! పాపం, మానవుడు అవస్థపడి పోయాడు. ఈమాత్రం భాగ్యానికి మీరు వాళ్ళని మళ్ళీ మళ్ళీ రమ్మంటారు."

మామయ్యకు వూరడింపుగా ఇక్కడ నేను స్వయంగా కలుగజేసుకున్నాను.

"కానీ యిది స్వంత యిల్లవునా కాదా అత్తయ్యా! అద్దె యివ్వడానికి సమ్మతిస్తే మీకూ పెద్ద మిద్దెల్లో కాపురం పెట్టవచ్చు. ఆమాటకొస్తే హోటల్లో గది తీసుకోవడం యింకా హాయి! ప్రాచీన నాటకాల్లో రాజుగారు ఎవరక్కడ అనగానే ప్రతీహారి ప్రవేశించినట్టు కాలింగ్ బెల్ నొక్కగానే సర్వరు ప్రత్యక్షమౌతాడు" అన్నాను.

కానీ మామయ్య హాస్యాన్ని ఆస్వాదించే పరిస్థితిలోగానీ, 'అప్రీసియేట్' చేసే ధోరణిలోగానీ లేరు. ఆయన నగుఖానన రాలు ఉవ్వెత్తుగా లేచేశాయి. ఆలోచనలన్నీ అంతర్ముఖమైపోయి వాటిలో వాటికి సంఘర్షణ జరిగి, లోలోపల సముద్ర మథనం లాంటి తతంగం జరుగుతున్నట్టు తోచింది.

బహుశా మామగారిదో దృఢనిర్ణయానికే వచ్చినట్టున్నారనుకున్నాను. నిజమే! ఆయన పట్టుపట్టేశారు. ప్లానువేసేశారు.

మూడు నెలల తర్వాత ఓరోజున అత్తయ్యనాతో తన సొదనువెళ్ళబోసుకుంది. "ఏం చెప్పమంటావు నాయనా! మీమామయ్య చిత్రంగా మారిపోయారు. ఆ థియేటరు వెనుకవైపుకు వెళ్ళి కూచుంటే ఆయనకు మళ్ళీ యింటికిరావాలనే బుద్ధిపుట్టడంలేదు.

"ఇదేమిటత్తయ్యా! అంతగా సినిమా

(61 వ పేజీ చూడండి)

# 'కోప్-ఫాబ్రిక్స్'

## చేనేత వస్త్రములు

★ ఎక్కువ మన్నికకు
★ తక్కువ ధరలకు
★ పక్కా రంగులకు

ప్రసిద్ధిగాంచినవి.



రూపాయి **1** కి **0-6** నయాపైసలు చొప్పున
ఇంకను యివ్వబడుచున్నది.

మా విక్రయ శాలలు ఆంధ్రప్రదేశ మంతటనూ, మరియు మద్రాసు, బెంగుళూరు, బెరహంపూరు, మరియు కటక్ నగరములలోను కలవు.

—౦—

## ఆంధ్ర చేనేత సహకార సంఘము

గవర్నరుపేట :: విజయవాడ-2

—NVKR Advtg



వయ్యికపైగా పోర్ట్రెయిట్లు చిత్రించిన గిల్బర్ట్ స్టువర్ట్ 1798 లో వేసిన "మిసెస్ జోసెఫ్ ఆంతోనీ" రూపచిత్రం.



డెగాస్, మానే పద్ధతులలో చిత్రాలు రచించి ఇంత చిత్రకారిణి అమెరికాలో లేదనిపించుకున్న మేరీ కసాట్ వేసిన "బాలిక" చిత్రం.

# రెండు వందల సంవత్సరాల

# అమెరికన్ చిత్రకళ

అమెరికన్ కళాచరిత్ర ఆ దేశచరిత్రకు ప్రతిబింబమేనని తార్కికంగా ఆలోచిస్తే బోధపడుతుంది. ప్రాచీన చిత్రలేఖకులకు ఊహాశక్తి కొరవడినా, పరిశుద్ధమైన చిత్రకళాసంపద, సృజనాత్మక చిత్రలేఖనంకోసం ఆ తర్వాతితరాలకు చెందిన చిత్రకారులు చేసిన ప్రయోగాలూ, జాతీయ జీవిత రీతులను కళాత్మకంగా చిత్రాలలో రూపొందించాలన్న లక్ష్యంతో చిత్రకారులు చేసిన నిరంతర ప్రయత్నాలూ, తుదకు వారి లక్ష్యసిద్ధీ—ఇవన్నీ దేశాభివృద్ధి చరిత్రతో ముడిపడి ఉన్నవి.

అమెరికన్ చిత్రలేఖకుల సొంతభావాలు, సిద్ధాంతాలతోపాటు, విదేశాలలోని వివిధ కళోద్యమాల ఫలితంగా అమెరికాలోని చిత్రకళ ప్రతిభావంతంగా అభివృద్ధి అయిందని విశదమవుతున్నది.

"కలోనియల్ కాలంనుంచీ నేటివరకూ గల '4 గురు అమెరికన్ చిత్రకళాకోవిదుల చిత్రకళాఖండాలు" అనే ప్రదర్శనను ఇటీవల న్యూయార్క్ మెట్రోపాలిటన్ మ్యూజియమ్‌లో ఏర్పాటుచేశారు. దానిని తిలకించినట్లయితే అమెరికన్ చిత్రకళా పరిణామచరిత్ర కళ్లకు కట్టినట్లు కన్పిస్తుంది. రెండుశతాబ్దాలలో లిఖించిన ఇంచుమించు రెండువందల చిత్రాలవరకూ దానిలో ప్రదర్శించారు. అన్నీ అంత ఆకర్షవంతంగా లేకపోయినప్పటికీ, అమెరికన్ చిత్రకళా రీతుల్లో వచ్చిన పరిణామం వీటిలో బాగా ద్యోతకమవుతుంది.

వందలాది చిత్రలేఖకులలోనుంచి 14 గురు వేసిన చిత్రాలనే ఎన్నుకోవటంలో కొంత నిర్హేతుకమాటంగా ఉండక తప్పదు. సాంప్రదాయిక చిత్రకళాకారులపైనే వారు శ్రద్ధచూపటంకూడా కొందరికి రుచించకపోవచ్చును. కల్పనా చిత్రలేఖనంవంటి సంపూర్ణ చిత్రకళాభివృద్ధిని ఆ ప్రదర్శనలో సమగ్రంగా తిలకించలేక పోయినప్పటికీ, ఆ ప్రదర్శన ప్రముఖమైనదని చెప్పక తప్పదు.

ఆ ప్రదర్శనలో అత్యంత ఆకర్షణీయంగా ఉన్న చిత్రపటాలలో జాన్ సింగిల్టన్‌కోప్లీ చిత్రాలుకూడా ఉన్నవి. కలోనియల్ కాలానికి చెందిన ఆ చిత్రకళా బ్రహ్మ నిత్య జీవితంలోని వివిధ ఘట్టాలను చూపించే 'రొకోకో' రీతి పోర్ట్రెయిట్ డి ఎపారట్ అంటే అలంకారపూరిత చిత్రాలను ఎక్కువగా సృష్టించాడు. ప్రతి చిత్రంలోనూ ఆయా పాత్రల హావభావాలు ఎంతో ఉత్తేజకరమైన వర్ణసముచ్చయంలో ఉట్టిపడుతూ ఉంటవి.

ఆ ప్రదర్శనను మరొక కలోనియల్ చిత్రలేఖకుడు గిల్బర్ట్ చిత్రాలను కూడా అలంకరించారు. వాషింగ్టన్ చిత్రాలను అనేక విధాలుగా ఆయన లిఖించి తరతరాలవరకూ మాసిపోని ఖ్యాతి నార్జించాడు. స్టూవర్టు చిత్రకళా ఖండాల మూలంగానే మొదటి ప్రెసిడెంట్ వాషింగ్టన్ రూపురేఖా విలాసాలు ప్రస్ఫుటంగా నేటికీ చూడగలుగుతున్నాము. ఆయన చిత్రాలలోని అపురూప లావణ్యం వాటిని సర్వ కాలాలకు చెందినవిగా రూపొందించినది.

పంథొమ్మిదవ శతాబ్దారంభంనుండి అమెరికాలో పోర్ట్రెయిట్ పెయింటింగ్ అత్యంత ప్రాధాన్యం వహిస్తూ వివిధ రీతులలో అభివృద్ధి చెందుతూ, ఈస్ట్‌మన్ జాన్సన్ కాలంలో పరాకాష్ఠ నందు

కొన్నది. ముఖ్యంగా ఆయన లిఖించిన "టూ మెన్" (ఇద్దరువ్యక్తులు) చిత్రం మానసిక శక్తులను తీవ్రంగా ప్రేరేపించి అమెరికన్ పోర్ట్రెయిట్ (వ్యక్తులచిత్రాలు) చిత్రలేఖనానికి ఒక కొత్త అంతస్తును కల్పించింది.

జార్జి ఇన్నెస్ చిత్రకళలో వాస్తవికత బాగా గోచరమవుతుంది. స్వయంకృషిచేత పైకివచ్చిన వ్యక్తి. అమెరికన్ అంతర్యుద్ధ సమాప్తిని తెలియచేస్తూ ఆయన లిఖించిన "పీస్ అండ్ ప్లెంటీ" (శాంతీ సౌభాగ్యం) లాంటి తొలిచిత్రాలు హడ్సన్ రివర్ చిత్రకళ కోవకుచెందినవి. తర్వాతి చిత్రాలలో చాలాభాగం హృదయానికి హత్తుకొనిపోయి మనస్సును కలచివేయ కలిగిన శక్తికలవి. మరొక వాస్తవిక చిత్రకారుడు థామస్ ఈకిన్స్. ఆయన తనుచూసినదానిని ఉన్నది ఉన్నట్టుగా చిత్రించేవాడు. శుష్కించిన తనభార్య పెంపుడు కుక్కతో ఉన్నట్లు ఆయన లిఖించిన చిత్రం చిరస్మరణీయ కళాఖండంగా నిలిచిపోయింది.

19 వ శతాబ్దాంతంలో మనస్సును కలచివైచే చిత్రాలను, జపాన్‌దేశంలోని ముద్రిత కళను అనుసరించే కళాకారులు అమెరికాలో చాలమంది పైకివచ్చారు. పున్నమ వెన్నెల రేయి మధురానుభూతిని చిత్రించే వర్ణ సమ్మేళనంతో, విశాలంగా తీర్చిదిద్దిన చిత్రాలు లిఖించిన జేమ్స్‌మాక్‌నీల్ విజ్లర్, అంద చందాలను ఒలికించే పోర్ట్రెయిట్ చిత్రాలను రచించి అట్లాంటిక్ మహా సముద్రానికి ఇరుప్రక్కల అంటే ఖండాంతర ఖ్యాతి నార్జించిన పోర్ట్రెయిట్ కళావేత్త జాన్‌సింగర్ సార్జంట్, సౌందర్యపూరితంగానూ, సుస్పష్టంగానూ మాతాశిశువుల చిత్రాలువేసిన ప్రఖ్యాత అమెరికన్ యువతి మేరీకాసట్; హాయినిగొల్పే రీతిగా మానసిక ఉత్తేజాన్ని ప్రకోపింపచేసే చైల్డ్ హాసమ్ లాంటి చిత్రకళాకోవిదుల కళాఖండాలను కూడా ఆ ప్రదర్శనలో చూపించారు.

ఈ శతాబ్దారంభంలో మనస్సును కలచివైచే చిత్రాలుపేలవంగా ఉన్నవన్న వ్యతిరేకోద్యమానికి ఎనమండుగురు అమెరికన్ కళాకారులు 1908 లో ప్రదర్శించిన వారి చిత్రాలతో అంకురార్పణచేశారు. 1913 లో 'న్యూయార్కు' ఆర్మరీ షోలో ప్రదర్శింపబడిన చిత్రాలలోకూడా ఆ వ్యతిరేకభావం బాగా గోచరిస్తుంది.

ఆధునిక చలనచిత్ర కళకు సూత్రధారుడు లాంటివ్యక్తి వాల్ట్‌డిస్నీ వర్ణచిత్రాలలో అందెవేసినచెయ్యి. ఆ మెట్రోపాలిటన్ ప్రదర్శనలో ఆయన ధారావాహికంగా రచించిన సర్కస్ చిత్రాలు కొన్నింటిని చూడవచ్చును.

"అమెరికన్‌శోభ" అనే నూతన చిత్రకళారీతులను జాన్ స్టూవర్ట్‌కర్రీ ప్రవేశపెట్టి ఈ శతాబ్దంలో మంచిపేరు సంపాదించాడు. ఆయన సొంతరాష్ట్రం కాన్సాస్‌లోని వివిధ దృశ్యాలను వాస్తవికతకు మరీ దూరంకాకుండా నేత్రానందంగా ఉండే లాగ చిత్రీకరించి ఒక విశిష్టత సంపాదించాడు. ఆయన లిఖించిన ప్రముఖ నాయకుడు జాన్ బ్రౌన్ చిత్రం అత్యుత్తమ చిత్రాలలో ఒకటిగా ఆ ప్రదర్శనలో కానవస్తుంది.



యురోపియన్ చిత్రకళా ప్రభావాన్ని త్రోసిరాజని కొత్తపద్ధతిలో చిత్రరచనసాగించిన ప్రముఖులలో జాన్ స్టూవర్ట్‌కరీ ఒకడు. నీగ్రోవిముక్తి ఉద్యమనాయకుడు జాన్‌బ్రౌన్ ఇలా ఉంటాడని ఊహించివేసిన ఈ చిత్రం కరీదే.

ఇటీవలి చిత్రకళాకారులలో, 1953 లో మరణించిన జాన్‌మారిన్ సొంతపోకడలుగల అమెరికన్ కళావేత్తగా ఖ్యాతిపొందాడు. ఆయనచిత్రాలు ముప్పైకిపైగా ఆ ప్రదర్శనలో చూడవచ్చును. ఆయన తొలిరోజు

# చంద్రగ్రహణం

**[ మార్చి 24 ]**

వెనకటి కొక భావకవి పుట్టింటి కెళ్ళిన భార్యని తలుచుకుని విరహపడుతూ, "ఈ వెన్నెల ప్రేయసినవ్వును జ్ఞాపకంచేస్తోంది" అనుకున్నాడు. భార్య పుట్టింటినుంచి వచ్చేశాక "ప్రేయసినవ్వు వెన్నెలని జ్ఞాపకం చేస్తోంది" అనుకున్నాడు.

భార్య తాలూకు పొడుగాటి జడనుచూసి ముచ్చటపడిన ఇంకో భావకవి "చంద్రబింబం లాంటి నీ మొహాన్ని మింగటానికి వచ్చే రాహువులాగా వుంది నీ జడ" అని ఉపమించాడు. "మీ మొహంలా వుంది ఉపమానం" అని ఆ ఇల్లాలు చిరాకుపడింది.

ఏమైనా భావకవులే అదృష్టవంతులు—భావికవులకంటే. భావకవులు చంద్రుణ్ని గూర్చి కొన్ని ఫర్లాంగులపొడుగున పద్యాలు రాసేశారు. పాతకవుల సంగతి సరేసరి. చంద్రుణ్ని వర్ణించని కావ్యం కావ్యం కాదన్నారు. చంద్రుడిమీద మణుగుల లెక్కన కవిత్వం రాశారు. మొత్తంమీద వీళ్ళంతా చంద్రుడుండగానే కవిత్వం చక్కబెట్టుకున్నారు.

భావికవులకు ఈ అదృష్టం పట్టేటట్లు లేదని కొందరి అనుమానం.

స్పుత్నిక్ యుగం వచ్చేసింది. రష్యావాళ్లూ, అమెరికావాళ్లూ చంద్రుణ్ని చూసి రమ్మని రాకెట్లు పంపిస్తున్నారు. ఆ రాకెట్లలో మనుషుల్ని పంపించాలని ఆలోచనచేస్తున్నారు. పదేళ్లకో, ఇరవయ్యేళ్లకో వాళ్ళ ఊహలు నిజమయ్యేట్లయితే, మనుషులు బెజవాడలో రైలెక్కి ఢిల్లీ వెళ్లిపోయినట్లు చంద్రుడిలోకి రాకపోకలు సాగిస్తే ఇహ చంద్రుడిమీద రాసేందుకు కవిత్వం ఏం మిగులుతుంది? పాత కవులకీ, భావకవులకీ, కాలం తీరిపోయింది గనక వారికేం ఫరవా లేదు. కాని సినిమా కవులు మహా ఇరుకున పడతారు. "రావోయి చందమామా" అని నాయికచేత పాడించటానికి వీల్లేని ఇకమక లో పడతారు. "చందమామని రమ్మనటం దేనికి? నువ్వెళ్లరాదమ్మా" అంటారు ప్రేక్షకులు. అందుకే దూరదృష్టిగల సినిమాకవులు ఇదే సమయమని వీలైనన్ని చందమామా పాటలు ప్రతి సినిమాలోనూ చొప్పిస్తున్నారట.

చంద్రుణ్ని రాహువూ మింగటంలేదు, కేతువూ మింగటంలేదు ఆవటా అని చాలా కాలం క్రితమే కొందరు కుశాగ్రబుద్ధులు కిటుకు కనిపెట్టేశారు. సూర్యుడికీ, చంద్రుడికీ భూమి అడ్డం రావటంవల్ల చంద్రగ్రహణం వస్తోందన్నారు. "మహా చూసొచ్చినట్టు!" అన్నారు పోయేకాలంవాళ్లు. "అక్కడికి మహా మీరు రాహువును పలకరించివచ్చినట్టు!" అన్నారు వచ్చేకాలంవాళ్లు. "ఈ సంగతి రాకెట్‌లో పోయి చూస్తేనేగాని తేలదు" అంటున్నారట ఎటూకానివాళ్లు.

చంద్రుడిలో మనంచూసేది ఒకవేపు మాత్రమే. రెండోవేపు చూడటం మనుషుల కింతవరకూ సాధ్యపడలేదు. మనుషులు తమకు కనబడేదీ, తాముసమ్మేదీ మాత్రమే నిజం అని భ్రమిస్తారనీ, తమ నమ్మకాలకి రెండోవేపుకూడా ఉంటుందని ఒపట్లాన ఒప్పుకోరనీ, ఆ రెండోవేపుకూడా చూడగలిగితే మనుషులంతా ఋషులైపోతారనీ, దానికి ఉదాహరణం మనం చూడలేకపోతున్న చంద్రుడి వీపనీ కొంతమంది వేదాంతులంటూ వుంటారు. అది వేదాంతసమస్యకాదు, శాస్త్ర సమస్య, రాకెట్టులో పోయి చూస్తే అంతా తేలిపోతుంది అని శాస్త్రజ్ఞులంటున్నారు.

ఈ సమస్య తేలినా, తేలకపోయినా వచ్చే పౌర్ణమిరోజున, అంటే మార్చి 24 వ తేదీన చంద్రుడికి గ్రహణం ఖాయమని అప్పటివాళ్లూ, ఇప్పటివాళ్లూ ఒప్పుకున్నారు.

చంద్రమండలంలోకి మనుషులు వెళ్ళవచ్చు, వెళ్లకపోవచ్చు; అక్కడ మంచు పర్వతాలు, అఖాతాలూ వుండచ్చు; లేళ్లూ కుందేళ్లూ లేకపోవచ్చు. ఏమైనా చంద్రగోళం అక్కడ వున్నంతకాలమూ మనుషులు చంద్రుడి చల్లనివెలుగుల్ని, అందాన్ని అనుభవించటం మానరు. ప్రియుడు ప్రియురాలి ముఖాన్ని చంద్రబింబంతో పోల్చటం మానడు. తల్లులు పిల్లలకి అన్నం పెడుతూ "అడుగో దాయి దాయి" అని బులిపించటం మానరు. గ్రహణం రోజున కాసేపు కనబడకపోయినా చంద్రుణ్నిగూర్చి బెంగెట్టుకోవటం మానరు. ఎందుకంటే ఇవన్నీ శాస్త్రసత్యాలు కాకపోవచ్చు. కాని అందమైన ఊహలు. అందాన్ని ఆస్వాదించగల శక్తి మనిషికి ఉన్నంతకాలమూ అందంగా ఊహించటం మానడు. చంద్రుడూ సగం ఊహ, సగం నిజం. ★

"ధనిష్ఠ"

## అమెరికన్ చిత్రకళ

లలో లిఖించిన ఉజ్జ్వల చిత్రాలు 'న్యూయార్క్ నగర దృశ్యాలు' (సిటీ స్కేప్స్) మొదలు ఇటీవల రచించిన ఈశాన్యరాష్ట్రం 'మెయిన్'లోని ప్రకృతి దృశ్యాలవరకూ అందు ప్రదర్శించారు.

మెట్రోపాలిటన్‌సంస్థ ఎన్నికచేసిన 14 మంది కళాకారులలో ఇద్దరు సమకాలీన చిత్రలేఖకులుకూడా ఉన్నారు. వారిలో మొదటివ్యక్తి జార్జియా ఓకీఫ్. అమెరికాలో అత్యుత్తమ సమకాల చిత్రకారిణిగా ఆమె పేరుప్రతిష్ఠలు సంపాదించుకొన్నది. మరొక సమకాలీన చిత్రకారుడు అమెరికన్ కళాకారుల "డీన్"గా ప్రఖ్యాతి పొందిన ఎడ్వర్డ్ హాపర్. అమెరికన్ నగరాలనూ, పల్లెసీమలనూ, వాటి అందచందాలనూ, వికారాలనుకూడా చూపిస్తూ అనేక చిత్రాలు లిఖించాడు. ❖




[గతవారం తరువాయి]

ఆరోజల్లా గోపాల్ నిశ్చింతగా, హుషారుగా ఉండటం శశికి బాధకలిగించింది. తమ యిద్దరిమధ్య పేచీ పరిష్కారమై పోయినట్లు—ఇతఃపూర్వం ఉన్నట్టే ఇహముందు కూడా తేడాదేమీ లేకుండా ఉండవచ్చునని గోపాల్ భావిస్తున్నట్లు శశి గ్రహించాడు. ఇంతజటిలమైన సమస్య ఇంత తేలిగ్గా తేలిపోయిందనేదాన్ని గోపాల్ విశ్వసించటం చూస్తే శశికి ఆశ్చర్యమేసింది. తననుంచి గోపాల్ ఏమి అపేక్షిస్తున్నాడు? తనని ఇక్కడ ఉండేట్లు చేయాలని ఎందుకంత ఆరాటపడుతున్నాడు? తమ ఇద్దరి మనసులూ ఒకటవటమంటూ ఉండదన్నదూ. రోజూ ఏదో కీచులాట రాకమానదు. స్నేహ మమకారాన్ని, శ్రద్ధాగౌరవాల్ని అణచివేసి అశాంతి ఆకాశమెత్తున లేగుతుంది. అయినా శశి ఊళ్ళోనే ఉంటూ, తన తత్వానికి ఏమాత్రం సరిపడని సంకుచిత జీవితాన్ని గడపలసిందేనా? ఇంత విశాలమైన ప్రపంచం ఉండగా, విభిన్న వ్యక్తిత్వాలలో ఇద్దరూ అరంలేని, మమకారాలకి దాసోహమంటూ ఈ ఇంట్లో చెరోక ప్రక్కనపడి ఉండవలసిందేనా?

సేన్‌దీదీ కొడుకుని తమ యింటికి తీసుకురావటం శశి మనస్సుకి ఎంతబాధ కలిగినా, ఇప్పుడిల్లు విడిచిపెట్టి పోవాల్సి వచ్చిందే అన్నబాధ ముందు అదోక లెఖ్ఖలోది కాకుండా పోయింది. ఊరు విడిచిపెట్టి పోవాలంటే శశికి లోపల చాలా విచారంగానే ఉంది. అలాంటి మానసికమైన దిగుళ్ళు ఏవేవో పెట్టుకు కూర్చుంటే కాదు. వాటన్నిటినీ మించిన ఆకర్షణని, ఆశను కల్పించుకోవటం అవసరం కాని వీటినన్నిటినీ గోపాల్ ఊహించగలగటం అసంభవం శశి వెళిపోయాడంటే—సేన్‌దీదీ కొడుకుని ఇంటికి తీసుకురావటం మూలంగా వెళ్ళాడన్న ఒక్క కారణాన్నే ఊహించగల డతడు.

శీతలబాబు కబురంపాగు. సాయంత్రం అమూల్యతో కలసి వారింటికి వెళ్ళాడు శశి. కాస్తటీ అవీ త్రాగాక అమూల్యని పెందరాళేనే విడిచిపెట్టాడు శీతలబాబు. శశిని మాత్రం రాత్రిభోజనాలయాక, చాలా ప్రొద్దుపోయాక గాని విడిచిపెట్టలేదు. శశికి శీతలబాబు ఒక పెద్ద బెడదయినాడు. రెండుపూట్లా కబురంపుతాడు. వెళ్ళాక కబుర్లతో ఊదరపెట్టి కాని వదిలిపెట్టడు. రాత్రి ఇంటికి తిరిగి వచ్చాక చూస్తే భోజనాల గదిలో రెండు పీటలు వేసి ఉన్నాయి. మామూలుగా ఎనిమిదింటికల్లా భోంచేసేవాడు గోపాల్. అలాంటివాడు ఇవాళ పదకొండు గంటలవరకు భోంచెయ్యకుండా శశికోసం కనిపెట్టుకు కూర్చున్నాడు.

"ఇంత ఆలస్యమయిందేం శశీ? చప్పునవెళ్ళి కాళ్లూ చేతులూ కడుక్కుని రా, భోంచేద్దాం" అన్నాడు గోపాల్.

"మీరు భోంచెయ్యండి, నేను భోంచేసే వచ్చాను. భోజనం చేసేదాకా విడిచిపెట్టలేదు శీతలబాబు."

గోపాల్ మనసు కొంచెం చివుక్కుమంది" ఇవాళ కొంచెం విందు ధోరణిని చేయించాను పదార్థాలవీ. పరాయి పెద్దమనిషి ఇంట్లో ఉన్నాడా, రేపు మళ్ళీ ఎలాగూ వెళిపోతున్నాడు కదా కాస్త విందుచేసి పంపితే బావుంటుందని అనుకున్నాను. నువ్వు బయటెక్కడో భోంచేసి వస్తావని అనుకోలేదు నేను' అన్నాడు.

"పరాయి పెద్దమనిషి ఎవరు?" అని అడిగాడు శశి.

"అమూల్యబాబు మాట చెపుతున్నాను. పాపం, రమ్మని పిలిచి మళ్ళీ వెళ్ళిపొమ్మంటే అతడి మనస్సుకి కష్టంగా ఉండొచ్చు."

"అమూల్య ఎందుకు వెళ్ళిపోతాడు? ఆస్పత్రి బాధ్యతంతా అతడి కప్పగిస్తే?

గోపాల్ కొంచెం భయపడుతూ-"నువ్వుండగా ఇంకా అతడుకూడా ఉండి ఏం చేస్తాడు? ఆఁ?" అన్నాడు.

"నేను ఎల్లుండి వెళిపోతున్నాను" అన్నాడు శశి.

"ఎల్లుండా?" గోపాల్ కి ఇంక నోటమాట రాలేదు. శశి గదిలోకి వెళిపోయాక అతడు బయటి వరండాలోకి వెళ్ళి, చీకట్లో బెంచిమీద కూర్చున్నాడు. ఓ గుమాస్తా వరండాలో పడుకుండామని పక్క అదీ వేసి వేసుకుంటున్నాడు. అతడు చిలుంగొట్టంలో కాస్త పొగాకు అదీ వేసి గోపాల్ కిచ్చాడు. తర్వాత ఇహ యజమాని ఎదుట పడుకోటానికి సంకోచించి, పక్కచుట్టకి చేరగిలపడి కూర్చుని, అలసటగా నిట్టూర్చాడు. గోపాల్ కివాళ మళ్ళీ బ్రహ్మచారి జ్ఞాపకం వచ్చాడు. సేన్‌దీదీ పోయాక అతడి మనస్సుకి విచారమూ, వైరాగ్యమూ కలిగాయి. అవన్నీ బ్రహ్మచారిముఖతః సరసమైన ఆధ్యాత్మిక గాథలు వినగానే ఆశ్చర్యంగా మాయమైపాయి ఇవాళ చాలా క్రుంగిపోయినట్లుంది అతడి మనస్సు. విచిత్రమైన సంఘటనలతో నిండిన తన జీవితమంతా అకారణంగా నిరర్థకమైనదిగా తోచసాగిందిప్పుడు. తాను సాధించినదంటూ ఏమీలేదు. శశి పుట్టినప్పట్నుంచీ అతడిమీద యెన్నో ఆశలు పెట్టుకుని ఉన్నాడు గోపాల్. అవన్నీ ఇప్పుడు గగనకుసుమాలయినాయి. చదువు సంధ్యలు నేర్చికూడా ఇలా అయాడేమిటి శశి? ఇల్లూ-వాకిలీ, భూమీ-పుట్రా, డబ్బు-దస్కం మొదలైనవన్నీ తాను కూడ పెట్టింది ఎందుకు? తనకోసమా? తానింక ఎన్నాళ్ళు ఉండబోతాడు? శశి వీటినన్నిటిని వదిలిపెట్టుకుని ఎక్కడికో వెళిపోతే-గోపాల్ జీవితమంతా వ్యర్థమయి పోయినట్టు కాదూ?

అర్ధరాత్రివేళ అతడొకసారి అమూల్యగదికి వెళ్ళాడు. అమూల్యని లేపి, "నిన్ను ఒక్కమాట అడుగుతాను బాబూ! శశి

 జీవనలీల 

ఎల్లుండి వెడుతున్నట్లు నాతో ఎందుకు చెప్పావుకావు?" అని అడిగాడు.

రాత్రి రెండు ఝాము లున్నప్పుడు నిద్రపోతున్న మనిషిని లేపి, గోపాల్ ఇలా సంజాయిషీ అడగటం అమూల్యని దిగ్భ్రాంతుణ్ణి చేసింది. "నాకు తెలియదు. శశి ఏరోజున వెళ్ళేదీ నాతో చెప్పలేదు" అన్నాడు.

గోపాల్ అసంతోషంగా—"అన్నీ చెప్పినవాడు ఇదొక్కటే చెప్పకుండా ఉంటాడా? మీరీ విషయాన్ని దాచటంలో ఏదో ఉద్దేశ్యం ఉండిఉంటుంది" అన్నాడు.

అమూల్య నాలిక కరుచుకుని, "అన్నన్నా! అదేంమాటండీ?" అన్నాడు.

"అదేం మాటా! వాడేమో ఊరు విడిచిపెట్టిపోతూంటే నువ్వు వాడి స్థానంలో పీఠంవేసుకు కూర్చోవాలనుకున్నావ్. మంచి ఉద్దేశ్యమే సీది! హాయిగా పడుకున్నావ్ గాని లే బాబూ! నీ సామానులూ అవీ చప్పుడుకాకుండా చాటుగా సర్ది వేసుకుని — పద, సాగనంపుతాం."

గోపాల్ బందిపోటుదొంగలా కన్పించాడు. ఖూనీకోరు మాట్లాడుతున్నట్లుంది అతడి గొంతూ అదీ. అమూల్య గదిలో ఇంత విచిత్రమైన నాటక-ఫక్కీలో జరుగుతున్న సంభాషణ అలసిపోయి పడుకునిఉన్న శశికి మెలకువ తీసుకురా లేదు. జీవితం విషయంలో ఇతడింత జాగరూకుడై ఉంటే — అతడు చైతన్య రహితమైన బొమ్మలా ఉన్నాడు. అతనంటే అపరిమితమైన వాత్సల్యం అని ఇవాళ అర్ధరాత్రివేళ గోపాల్ సృష్టించిన ఈ విచిత్రదృశ్యాన్ని, అతడి విచిత్రపు సంభాషణని చూసిఉన్నా, వినిఉన్నా శశికి ఒక అనుభవం తెలిసివచ్చేదే! అణచుకున్న కంఠంతో అమూల్యని ఇలా కొంతసేపు దబాయించటంతో వేడెక్కిన బుర్ర క్రమంగా కొస్త చల్లబడిందేమో గోపాల్ కి; అతడిహ తన గదిలోకి వెళిపోయాడు.

మర్నాడు ప్రొద్దున అతడు చీకటితోనే వచ్చి శశిని నిద్ర లేపాడు. శశి లేచి చూసేసరికి గుమాస్తానె తిన పెట్టె-పరుపు చుట్ట ఎత్తి గోపాల్ ఎక్కడికో వెళిపోవటానికి సిద్ధంగా ఉన్నాడు.

గోపాల్ మామూలుగా అంటున్నట్లే-" ఎల్లుండి నువ్వు వెళ్ళటానికి వీల్లేదు శశీ! నేను ఇవాళ బాబాదగ్గిరకి కాశీ వెడుతున్నాను. వారం పదిరోజులు వారి ఆశ్రమంలో ఉంటాను. ఇద్దరిలో ఒకరమయినా ఇంట్లో ఉండకపోతే వీల్లేదు. నేను మళ్ళీ తిరిగివచ్చాక నీ యిష్టప్రకారం చేద్దువుగాని" అన్నాడు.

"హఠాత్తుగా కాశీ ఎందుకు వెడుతున్నారు?" అని అడిగాడు శశి.

"అవును శశీ! ఎన్నేళ్ళనుంచో ఈ సంసారతాపత్రయంలో పడి కొట్టుకుంటూ వచ్చాను. ఇప్పుడు నువ్వు పెద్దవాడివయావు. మనస్సు బావుండనప్పుడయినా ఓ వారంరోజులు విముక్తి అంటూ దొరకదా? ఈ మాత్రపుదాన్నయినా నీనుంచి ఆశించకూడదూ నేను?"

"నేనలా అనలేదు. ఏమీ లేకుండా హఠాత్తుగా వెడుతూంటే

(64 వ పేజి చూడండి



# ముక్తాని

వి.ఎస్. అవధాని

[గతవారం తరువాయి]

## 3

రామారావుదేకాదు ఖాజాబీబీది కూడా సంకటస్థితే. రామారావూ ఇతరులకు చెప్పుకునే వీలులేదు. చెప్పుకున్నా వినేవాళ్ళు లేరు ఖాజాబీబీకి. ఆడుతూ పాడుతూ ఇంతవరకూ హాయిగా తిరిగిన ఖాజాబీబీ జీవితానికి రామారావు ఒక ప్రశ్న అయినాడు. అట్లా అని రామారావు తనను బలవంతం చేశాడనికాదు. చాలా స్నేహంగానే ఉంటున్నా ఇద్దర్లో ఎవరూ దోవతప్పలేదు. కానీ, ఇట్లా ఎన్నిరోజులు,? ఎంతకాలం జరుగుతుంది? సుబ్బయ్యగారి ఇంట్లో పని యితే మానివెయ్యవచ్చు. అదేమంత కష్టం కాదు. ఒకవేళ కష్టంఅయితేమాత్రం మానివేయవలసివస్తే మానివేయక తప్పుతుందా? కులమూ, జాతీ సంగతి తెలియకుండానే పద్దెనిమిది సంవత్సరాలు బతికింది తను.

అంటే తను ముస్లిమ్‌లపిల్ల అని ఖాజాబీబీకి తెలియదనికాదు. తెలుసు. సుబ్బయ్యగారు హిందువులని తెలుసు. బ్రాహ్మణులని కూడా తెలుసు. కానీ, ఇవి తన జీవితసుఖానికి అవాంతరాలు కాబోతున్నవని ఇంతవరకూ ఖాజాకు తెలియలేదు. పోనీ వాళ్ళయినా తనను వేరుగా చూచారా? లేదు. వాళ్ళపిల్లల్లో ఒక పిల్లమాదిరిగా చూచారు. పనిచేసేపిల్ల అని ఎవరికన్నా చెపితేతప్ప తెలియదు. పైగా సుబ్బయ్యగారి పిల్లలకూ తనకూ పోలిక ఉన్నదనికూడా అంటారు. ఇంతకాలమూ మతంసంగతీ కులంసంగతీ, జాతిసంగతీ వాళ్ళూ పట్టించుకోలేదు. పట్టించుకోవలసిన సమయంగానీ, సందర్భంగానీ రాలేదు. తన చేతినీళ్ళు తాగుతారు హనుమాయమ్మగారు తను కాఫీపెట్టి ఇస్తే తాగుతారు సుబ్బయ్యగారు. ఇంత సన్నిహితురాలయింది ఆ ఇంటికి తను ఒకసారి తనకు జబ్బుచేసింది. హనుమాయమ్మగారు స్వయంగా ఉపచారం చేసింది తనకు ఇప్పుడైనా రామారావుతో తను ఇంకొకరకంగా ఉండగలిగితే చిక్కులేదు. అయితే...అట్లా తను ఉండగలగాలంటే ఇంకొక ముస్లిమ్‌ను చేసుకోవాలి. దానికేం? చాలామంది ఎదురు చూస్తున్నారు ఆశగా. అయితే తనను పెండ్లి చేసుకునే ముస్లిమ్ సుబ్బయ్యగారి ఇంటికి తనను వెళ్ళనిస్తాడా? ఎందుకువెళ్ళనిస్తాడూ వెళ్ళనివ్వడు. అది తన కులాచారానికి విరుద్ధం. తనకు తెలుసు సుబ్బయ్యగారి పెద్ద అమ్మాయి తనకు అక్షరాలు నేర్పింది. చదువు నేర్పింది. ఇటువంటి సంబంధం సాధ్యంకాదు. సాధ్యంకావాలంటే చాలా సాహసం కావాలి. అంతసాహసం తనకు ఉన్నదా? ఏమో? రామారావుకు ఉన్నదా? యేమో? ఎవరు చెప్పగలరూ? రామారావు చాలా మారిపోయినాడు. ఏవేవో సాకులు చెప్పి సుతారంగా వచ్చిన సంబంధాలన్నింటినీ వెనక్కి పంపిస్తున్నాడు. ఇదంతా ఎందుకు వచ్చిన బాధ? దీనికి ఎవరు కారణం??

రామారావని మొదట్లో అనుకున్నది ఖాజా. ఆ తరువాత కొన్నాళ్ళు తనే కారణం అనుకున్నది. కొన్నాళ్ళ తరువాత కాదు రామారావే కారణం. రామారావు అందంగా ఉన్నాడు. రామారావు అమాయకుడు. రామారావు తనను ఆకర్షించాడు అని అనుకొన్నది కొంతకాలం. కొన్నాళ్ళ తరువాత పాపం రామారావేం చేశాడూ తనేకదా. ఆయనను తన ఇంటికి తీసుకు వచ్చింది? తనే కారణం అని అనుకున్నాది ఖాజా. అంతేగానీ, అది మానవస్వభావం అని తెలియదామెకు! ఇందులో ఇంకొక విశేషం!! 'అదిగో పులి అంటే ఇదిగో పులి' అనే ధోరణి మామూలయిన ఈ రోజులలో ఇంతవరకూ సుబ్బయ్యగారి ఇంట్లో ఎవరూ తననుగానీ, రామారావునుగానీ అనుమానించలేదు. కొంత తెలిస్తే ఇంకా కొంత అనుమానం కలుగుతుంది. ఏమీ తెలియనివారికి అనుమానం ఉండదు. తమ ఇద్దరిమధ్యా మామూలు సంబంధమేగానీ, పరిచయమేగానీ, అంతకన్న ఎక్కువేమీలేదని ఇంట్లో అందరూ అనుకొంటారు. వాళ్ళూ వీళ్లూ తనను అనుమానించి చేసిన ప్రచారం సుబ్బయ్యగారి ఇంటికికూడా చేరింది. అయితే, సరిగ్గా ఇటువంటి వదంతులే పాకేం ఫ్లనాడు ఖలీజాబీబీ, సుబ్బయ్యగారి గురించికూడా బయలుదేరినయ్. అందువల్ల హనుమాయమ్మగారుపట్టించుకోలేదు. రామారావంటే ఆమెకు చాలా నమ్మకం. పతి అమాయకుడనీ, అట్టివంటివి

# మీ ఇంటి వాడుకకు...

## మేలు రకపు

## డస్ట్ టీ

మేలురకపు టీనే తమ ఇంటి
వాడుకకు కోరే వారికి
బ్రూక్ బాండ్ ఏ-వన్ (A 1)
డస్ట్ టీ. ఖర్చు తక్కువ.
ఒక పౌనుకు ఎన్నో కప్పుల
టీ అవును.



# ★ చుక్కాని ★

పూర్తిగా తెలియవనీ ఆమె నమ్మకం. ఈ వదంతులు ప్రారంభమైన తరువాత తాము ఇద్దరు కూడా ఇంట్లో చాలా జాగ్రత్తగా మసులుకొంటున్నారు. అసలు ఆ ఇంట్లో ఉండగా రామారావుకేసి ఒక్కసారయినా ఖాజా చూడదు. ఆఖరుకు హనుమాయమ్మగారు 'ఈ కాఫీ రాముడికి ఇచ్చి రావే అంటే' మధుని తీసుకెళ్ళమనండమ్మా అంటుంది తను.

ఇంతకూ అసలు తనను ఇతరులు దేనికి అనుమానించాలి? అనుమానపడవలసిన సంగతి రామారావుకూ తనకూ మధ్య ఏమి ఉన్నదీ? అవును. నిజమే. రామారావు తనకు కావాలి. అయితే చెయ్యరానిపనేమి తనుకానీ, రామారావుకానీ ఇంతవరకూ చెయ్యలేదే? రామారావును ఎన్నిసార్లో తను నివారించింది. లాలించింది. బుజ్జగించింది. అప్పుడే కాదని వాయిదాలు వేస్తూవచ్చింది. ఏమైనా మొత్తంమీద ఇదేదో ప్రాణాంతకం వ్యవహారంగా నేపరిణమించింది?? ఏమిచెయ్యాలి? ఎవరిని అడగాలి అని మథనపడ్తూ పందిరి మంచంమీదా ఖాజాబీబీ ఏఅర్థరాత్రో కన్నుమూసింది. అంతలోనే.. కల. కలలో అమ్మ. "ఖాజా...ఓ ఖాజా" పిలుస్తోంది.

తను ఏడుస్తోంది.

"ఏడవకమ్మా...ఏడవకు. భయంలేదు."

"అమ్మా...అమ్మా."

"భయంలేదు. పట్టుదల వదలమాకు. దోవ తప్పకు. కాలుజారకు సుబ్బయ్యగారి ఇంటికి వెళ్ళడం మానెయ్యి."

"ఎట్లా? ఎట్లా మా?"

"ఎట్లా ఏముందీ? ఇక నేను రానమ్మా. అప్పుడప్పుడు వచ్చి చూచి పోతూంటా అని చెప్పు."

"చెపితే."

"చెపితే ఏముందీ...నే చెప్పినట్లు చెయ్యి. అంతే. రామారావు నీవాడే..."

"ఆఁ—ఆఁ"

"అవును. అట్లాగే జరుగుతుంది. తొందర పడమాకు..."

"అమ్మా...అమ్మా" అని అరిచింది ఖాజా. అరిచి కళ్ళు తెరిచింది. కొడిగుడుదీపం వెలుగులో అమ్మ ఫోటో కనిపించింది.

ఇక ఆతరువాత ఆరాత్రి ఖాజాబీబీకి నిద్ర పట్టకపోవడంలో ఆశ్చర్యం ఏమిటీ? రామారావు తనవాడవుతాడని అమ్మ చెప్పింది. ఎట్లా అవుతాడూ? నమ్మాలి. నమ్మితేసరి.

## 4

'లల్లూరామ్—సుధారామ్' కంపెనీ ఎదుట పోలీసువాన్ ఆగింది. పదిమంది పోలీసులు గబగబా లోపలికి వెళ్ళారు. పదిమంది గుమాస్తాలను వాన్‌లో ఎక్కించుకొని వెళ్ళారు. అంతా హడావుడి. అంతాభయం. మిగతా గుమాస్తాలు ఎవరిచోట్లో వాళ్ళు కూర్చొని 'ఎవరెవర్ని తీసుకువెళ్ళారని లెక్కవేశారు. పోలీసులకు కావలసిన వాళ్ళలో ఒకగుమాస్తా రంగారావు అన్నానికని అప్పుడే అంటే అయిదునిమిషాల కిందటే ఇంటికి వెళ్ళాడు. వెళ్ళినవాడు ఆరోజల్లా తిరిగిరాలేదు.

రెవెన్యూ గుమస్తా సుబ్బయ్యగారి ఇంటికి ఖబురు వెళ్ళింది. అప్పటికే పోలీసులు సుబ్బయ్యగారిఇల్లు సోదా చేసి వెళ్ళారు. ఎందుకు సోదాచేశారూ? ఇదంతా ఏమిటీ అని ఖాజాబీబీ ఖాదరును అడిగింది. ఖాదరు పోలీసు. ఖాజాబీబీకి దూరంచుట్టం. సంగతంతా చెప్పాడు. "లల్లూరామ్—సుధారామ్" కంపెనీలో డబ్బుపోయింది. నాలుగు వేలదాకా పోయింది. పోలీసులకు ఫిర్యాదు చేశాడు లల్లూరామ్. మతిలేని పోలీసులు పదిమంది గుమాస్తాలను పట్టుకెళ్ళారు. ఆ పదిమందిలో రామారావొకడని ఖాదర్ చెప్పాడు. ఆమాటలు విని హనుమాయమ్మగారు వళ్ళు తెలియకుండా పడిపోయింది.

సుబ్బయ్యగారికోసం కలెక్టరాఫీసుకు మనిషిని పంపించారు. సుబ్బయ్యగారికి సంగతంతా చెప్పాడు సబ్ ఇన్‌స్పెక్టరు. సుబ్బయ్యగారు నిశ్చేష్టితుడైనాడు. తన కొడుకుదొంగ అన్నది వెధవలోకం. ఛీ... తనకొడుకు ఇటువంటి పని ఎన్నడూ చెయ్యడు. ఎక్కడో యేదో పొరపాటు జరిగింది. అదే సర్దుకొంటుందని సమాధానపడ్డాడు. పోలీసులు తమ పని పూర్తిచేసుకొని వెళ్ళారు. వాళ్ళకు కావలసినదియేమీ ఆ ఇంట్లో దొరకలేదు. పోలీసులు వెళ్ళినతరువాత కొంచెంసేపటికి హనుమాయమ్మగారికి వొళ్ళు తెలిసింది. "రామా.. రాముా" అంటూ ఏడుస్తోంది. ఆమెను ఎవరూ ఆపలేకపోతున్నారు.

"ఏడవకండి అమ్మగారూ" అన్నది ఖాజా. దగ్గరగా ఉన్న హోటలుకెళ్ళి కాఫీతెచ్చి సుబ్బయ్యగారికీ హనుమాయమ్మగారికీ ఇచ్చింది ఖాజా.

"ఇంతకూ స్టేషనుకు ఎవరినన్నా పంపించారా బాబూ" అన్నది ఖాజా.

"లేదు. ఎవరు వెళ్తారూ? సరే నువ్వు ఇక్కడే ఉండు. నేను వెళ్ళి చిన్నవాణ్ణి పిలుచుకువస్తా. వాడన్నా వెళ్ళి వస్తాడు."

"నాకు తెలుసు నాన్నా. నేను వెళ్ళి వస్తా బుల్లన్నయ్య దగ్గరికి" అన్నాడు మురళి- సుబ్బయ్యగారి ఆఖరుకొడుకు.

"సరే వెళ్ళిరా నాయనా. పోలీసులతో తగాదా పడకు. అన్నయ్యను ధైర్యంగా ఉండమని చెప్పు" అన్నది ఖాజా.

"ఆ పని వాడు ఎందుకని" హనుమాయమ్మగారూ అనలేదు. సుబ్బయ్యగారూ అనలేదు. రెండోకొడుకు కోసం బయలుదేరాడు సుబ్బయ్యగారు.

ఏడుస్తున్న పిల్లలందరూ ఖాజాను చూచి ఏడ్పు మానారు. కానీ, హనుమాయ్యగారు మాత్రం ఇంకా తమాయించుకోలేకపోయింది.

"పొద్దుట్నించీ రాలేదేమే" అన్నది హనుమాయమ్మగారు.

"రాలేదండీ అమ్మగారూ" అన్నది ఖాజా. "ఏం ఎక్కడికెళ్ళావ్?"

"ఎక్కడికీ వెళ్ళలేదండీ."

"మరి ఎందుకని రాలేదూ"

"రోజూ ఇక్కడికి రావటం పడవద్దాండీ"

"అంటే .సంసార మాయె. పిల్లలాయె..." అన్నది హనుమాయమ్మగారు ఓ చుట్టాన్ని దెప్పిపొడుస్తున్న ధోరణిలో.

"అది కాదండీ. ఇక నేను రోజూ రాను. అప్పుడప్పుడొచ్చి చూచి పోతూంటాను."

"ఏం, ఎందుకదీ? అట్లా ఎందుకనీ? పెళ్ళిచేసుకోబోతున్నావా?"

"అవునండీ అమ్మగారూ"

"అదాసంగతి ఇంకా చెప్పవేం మరి" అన్నది హనుమాయమ్మగారు.

హనుమాయమ్మగారితో అబద్ధం ఆడితే చాలాకష్టం. అయినా అమ్మమాటప్రకారం ఖాజా అబద్ధం చెప్పింది.

"మరి పొద్దుకూకుతోంది. నేను వెళ్తానండీ."

"ఒసే ఇట్లా వదిలిపెట్టి వెళ్తావుటే. ఈపూట ఇంట్లో ఎట్లాగే."

"మరేం ఫరవాలేదండీ అమ్మాయిగారు సర్దుకుంటారు నేనువెళ్తాను. మీరుధైర్యంగా ఉండాలి. పెద్దవారు మీరే..."

"మహా చెప్పవచ్చావే పిల్లా నీకు మాత్రం భయం వెయ్యలేదా యేం?"

"భయం వేసింది. అయితే ఏడిస్తే ఎట్లా? ఇదేం నిలిచేదా పెట్టేదా? మహా మహా కేసులే ఎగిరిపోతున్నాయ్ అదీకాక మన

# ★ చుక్కాని ★

మేం తప్పు చెయ్యలేదు గదండీ. ఎందుకు భయపడాలి పోలీసోళ్ళు మాయదారోళ్ళు అనుకోండి. అయినా భయపడితే ఇంకా భయపెడ్తారంటమ్మా" అంతలో సుబ్బయ్యగారు రెండోకొడుకుతో తిరిగి వచ్చారు.

"నేను వెళుతున్నానండీ బాబుగారూ" అన్నది ఖాజా.

సుబ్బయ్యగారికి ఈమాట కొత్త. ఖాజా ఎప్పుడూ తనతో వెళుతున్నాను అని చెప్పదు. చెప్ప నవసరం లేదు. ఇదేదో కొత్త మర్యాదగా తోచింది అయనకు.

"ఈపూట ఇక్కడే ఉండరాదూ" అన్నాడు, రెండోకొడుకు మోహనరావు.

"వీల్లేదండీ. వెళ్ళాలి" అన్నది ఖాజా. అని గబగబా వాకిట్లోకి వెళ్ళింది. వాకిట్లో కొంతమంది చేరి ఏమిటేమిటో చెప్పుకుంటున్నారు. అవన్నీ వినేఓపిక లేదు ఖాజాకు. గబగబా రైలుకట్ట వెంట కొంతదూరం నడిచింది. ఆ తరువాత రైలుకట్ట దిగి జిల్లాకోర్టు ఆవరణలో పోలీసు క్వార్టర్సుమీదుగా నగరపాలెంలోకి వెళ్ళింది. అక్కడ రిక్షా ఎక్కి ఇంటికిచేరింది. తాళం తీసి పరుగు పరుగున పడకగదిలోకి పోయి పందిరిమంచంమీద పడుకుని ఏడ్చింది. ఖలీజాపోట్లో కనిపించటం లేదు. ఇంట్లో దీపం లేదు. దీపం వెలిగించాలి. నిప్పెట్టెక్కడ పెట్టిందు గుర్తులేదు. ఆ అలమారా ఈ అలమారా ఆ గూడూ ఈ గూడూ వెదికింది. పక్క ఇంట్లోంచి కకపకలు వినిపిస్తున్నాయ్.

"మనకేం భయం లేదంటావా?" అది లక్ష్మిగొంతు.

"మనకేం భయం? మనం అసలు దొరికితే కదా? మనమీద లల్లూరామ్‌కు చాలా నమ్మకం. రామారావులాంటి అమాయకులు ఉండగా మనకేం భయం?" ఇది మగ గొంతు.

"అంత వికరగా మాట్లాడకు. మరి నువ్వు ఇప్పుడు ఎక్కడికి వెళ్తావ్?"

"ఎక్కడికీ వెళ్ళను. ఊళ్ళోనే ఉంటా. పగలల్లా ఎవరికీ కనిపించను. రాత్రి ఇక్కడికి వస్తుంటాను."

"మరి పోలీసోళ్ళు ఊరుకుంటారా?"

"ఊరుకోక యేంజేస్తారూ? వాళ్ళకు మాత్రం డబ్బు అక్కర్లేదాయేం?"

"అయితే అదేదో తొందరగా చూడ రాదూ?"

"చూస్తాను. దానికీ సమయం రావాలి."

"నువ్వు ఎంత చెప్పినా నాకు భయంగా ఉన్నది."

"అట్లాగే ఉంటుంది మొదట్లో."

"సరే మరి. ఈ డబ్బు అంతా నాదగ్గరే ఉంచమంటావా?"

"ఉంచు. జాగ్రత్త ఇది నాజీవితానికి ముప్పు తెచ్చేసంగతి ఎవరికన్నా చెప్పావా? నీప్రాణాలు తీస్తా జాగ్రత్త"

...............

ఆరాత్రి ఖాజా ఇంట్లో దీపం వెలగనే వెలగలేదు. ఆదిలక్ష్మి ఇలు పెద్ద భవంతి. దానిచుట్టు తోట. ఆతోటను ఆనుకునే ఖాజా ఇలు. తోటలోంచి ఈమాటలు వినిపించినయ్. ఆ మగమనిషి ఎవరో ఖాజాకు తెలిసింది. రామారావు పనిచేసే కోట్లో రంగారావే అయి ఉంటాడు. ఊళ్ళోనే ఉన్నా ఇంతవరకు పట్టుకోలేకపోయినారు పోలీసులు. తప్పించుకొదలచినవాణ్ణి పోలీసులు పట్టుకోలేరు. పారిపోలేనివాడి కోసం అన్వేషించి పట్టుకుంటారు ఆదిలక్ష్మి తల్లి శ్రీదేవికూడా సామాన్యురాలుకాదు. దాని కారణంగా ఊళ్ళో చాలా హత్యలు కూడా జరిగినయ్. దాని చెప్పుచేతలలో కొంత మంది రౌడీలు ఉన్నారు. ఆదిలక్ష్మి కనుచూపులకోసం ఎదురుచూస్తున్న అధికారులు కూడా ఉన్నారు. అదంతా ఓసాలె గూడు అందులో పడ్డాడు రామారావు. ఎట్లా ఎట్లా? ఎట్లా బయటికి వస్తాడూ? ఎవరు తీసుకువస్తారూ? రామారావు తరఫున ఎవరు పని చేస్తారూ? సుబ్బయ్యగారు పెద్దవాడు. ప్రభుత్వోద్యోగే అయినా పోలీసుఅధికారులతో అంత పలుకుబడి లేదు. "రామారావు నీవాడేనని" అమ్మ చెప్పింది. వాళ్ళ ఇంటికి వెళ్ళటం మానివెయ్యమని చెప్పింది. హనుమాయమ్మగారితో తను అబద్ధం కూడా చెప్పింది. అయ్యోరాత! తన పెళ్ళి? పెళ్ళి? ఎవరితో? సోడాబుడ్ల బండి తోసుకొంటూ, లుంగి పైకి ఎగదోపి, ఎడంచేత్తో బీడీదమ్ములాగుతూ రోడ్డుమీద వెళుతుంటే తన కేసి చూచే రజాక్‌తోనా తన పెళ్ళి. గుర్రబండీ తోలుకొంటూ, ఓ పూట తిండికి లేక పోయినా గ్లాస్కో లుంగీలు కట్టే రహిమాన్‌తోనా? కోర్టు అమీనా ఉద్యోగం వెలగపెడుతూ ఎవరూ లేకుండా చూచి తన ఇంట్లో జొరబడి, తను కత్తి తీసేటప్పటికి కాళ్ళమీద పడి ఏడ్చిన ఇస్మాయిల్ తోనా? ఎవరితో తన పెళ్ళి? పెళ్ళి అనేదే జరిగితే రామారావుతోనే జరగాలనుకొంటూ వరండాలో చాపమీదనే నిద్రపోయింది ఖాజా–స్టేషన్లో రామారావును ఎంత హింసిస్తున్నారోనని దిగులుతో...

మురళి వెళ్ళేటప్పటికి రామారావు స్టేషన్లో నిలబడి ఉన్నాడు. ఆ ముఖంలో దిగులూ లేదు. భయమూ లేదు. ప్రమాదమేమిటో తెలియనివాళ్ళకు భయమేమి?

"ఎవరికోసం" అన్నాడు సెంట్రీ.

"మా అన్నయ్య రామారావు"

"అయితే...ఏం మాట్లాడుతావ్? సబ్ ఇన్‌స్పెక్టరు చూస్తే మాట దక్కదు"

"ఏమీ మాట్లాడను. చూచి వెళ్తా. కాఫీ తెచ్చి ఇస్తా. అంతే" అన్నాడు మురళి.

రామారావు ఆమాటలు విన్నాడు.

"మురళీ" అని అనలేక అనలేక అన్నాడు.

"అన్నయ్యా"

అంతలో సబ్ ఇన్‌స్పెక్టరు రానే వచ్చాడు. కర్కోటకుడని పేరు. "ఏరా చెప్పు ఆరంగారావు ఎక్కడ ఉంటాడూ? చెప్పు. నిన్నేమీ చెయ్యను. నీమీద వాను రాకుండా చూస్తా. మీ పెద్దన్నయ్య

నాకు తెలుసు. నీసంగతంతా చెప్పాడు ఇందాక క్లబ్బులో."

"నాకు తెలియదండీ రంగారావుతో నాకు స్నేహంలేదు."

"పోనీ, ఈ డబ్బు వాడే తీశాడంటావా?

"నాకు తెలియదండీ?"

"వాడు నిన్న టీపార్టీకి నిన్ను పిలిచాడా?"

"పిలిచాడు."

"నువ్వు వెళ్ళలేదు ఎందుకనీ?"

"వాడితో స్నేహమేలేదు. అదీకాక వాడు మంచివాడుకాదని మా పెద్దన్నయ్య చెప్పాడు."

"అయితే మరి నీదగ్గర ఉండవలసిన డబ్బు వాడు కాజేస్తే నీకు ఎట్లా తెలియదూ? నీకు ఎంత ఇస్తానన్నాడూ?"

రామారావు సమాధానం చెప్పలేదు.

"మాట్లాడవేంరా?" అంటూ రామారావు చెంపమీద గట్టిగా కొట్టాడు.

మురళి కంటివెంట నీళ్లు వచ్చినయ్‌గానీ, రామారావుకు నొప్పే లేదో యేమో అట్లాగే మొద్దల్లే మంచోని చేత్తో దవడమీద రాచుకున్నాడు.

"నిజం చెపితే తేలికలో బయటపడ్తావ్. లేకపోతే సుబ్బయ్యగారికి చాలా చెడ్డపేరు వస్తుంది. ఆలోచించుకో. నిజం చెప్పేదాకా ఇక్కడే పడివుండాలి తిండీ గిండీ లేకుండా. ఆలోచించుకో" అంటూ ఇన్‌స్పెక్టరు వెళ్ళిపోయినాడు.

"అన్నయ్యా."

"మురళీ."

"అన్నయా"

"మురళీ"

"కాఫీ కావాలా..."

"వద్దు. ఏమీ వద్దు. పెద్దన్నయ్య దగ్గిరికి వెళ్లివస్తావా?"

"పెద్దన్నయ్యకు అంతా తెలుసుంది. వీళ్లందరూ వాడి స్నేహితులు. వాడు చెయ్యగలిగినదంతా చేస్తాడు. మనం వెళ్ళనక్కరలేదు. మరి ఈ రాత్రికి తిండి."

"తిండి అక్కరలేదు. ఏమీవద్దు. నువ్వు వెళ్లు మురళీ. నువ్వు అనుకున్నంత మంచి వాళ్లుకారు వీళ్లు. నువ్వు వెళ్ళు. ఇంటికివెళ్లు. తొందరగా వెళ్లు."

"రేపు పొద్దున్నే నేనూ మధూ వస్తాము."

"సరేలే వెళ్లు. తొందరగా వెళ్లు."

ప్రపంచమంతా చీకటి. ఇక్కడే ఈ పోలీసుస్టేషన్లో హాయిగా ఉన్నదేమో ననిపించింది రామారావుకు. చాపఅయినా లేకుండా కటిక నేలమీద పడుకొన్నాడు. కార్తీకమాసపు చలి ఎముకలను కొరికేస్తోంది. స్టేషన్లో, పోలీసుల బంట్లు నల్లులు తనవంటి వాళ్ళను నిద్రపోనివ్వకుండా నెత్తురు తాగుతున్నయ్. ప్రపంచం అంతా ఏమైపోతే తనకేం? నాన్నా, అమ్మా, అన్నయ్యలూ అందరూ ఏమైపోతే తనకేం? ఇక్కడ ఈ చీకటికొట్లో ఇట్లా పడిఉంటే సరి. విశ్రాంతిగా ఉంటుంది. నాన్నకు సహాయపడలేకపోతున్నామే అన్న దిగులులేదు. అమ్మ కష్టపడుతుందే అన్న బాధలేదు. యజమానిని మెప్పించలేకపోతామేమోనన్న భయం, ఆగుర్దా లేవు. హాయిగా ఉన్నది. సబ్-ఇన్‌స్పెక్టరు తనను కొట్టాడు. తను చిన్నవాడు కాబట్టి కొట్టాడు. తను తిరగపడితే సబ్‌ఇన్‌స్పెక్టరు ఏమవుతాడూ? అదేం మాటా? ఇంకా పోలీసులు లేరా. వాడిదగ్గర లాటీలేదా? చిన్నప్పుడు అమ్మ కొట్టేది. లెఖ్ఖలు రాకపోతే నిన్న మొన్నటిదాకా నాన్న కొట్టేవాడు. ఇప్పుడు ఇన్‌స్పెక్టరు కొట్టాడుఅమ్మ కొట్టినా, నాన్న కొట్టినా ఖాజాతనను ఓదార్చేది. ఇప్పుడు ఖాజాయేది? అయ్యో ఖాజా!; ఇంకా ఎక్కడి ఖాజా బీబీ. ఖాజాబీబీ ఇక తనముఖం చూస్తుందా? దొంగతనంచేశాడని తెలిస్తే ఖాజా తనముఖం చూస్తుందా? తెలిసేదేమిటీ? ఈపాటికి ఊళ్ళోఅందరికీ తెలిసేఉంటుంది. నాన్న ఏమని అనుకొనిఉంటాడూ? అమ్మ ఏమని అనుకొనిఉంటుందీ? పెద్దన్నయ్యమాత్రం ఇవన్నీ నమ్మడు. వాడిదంతా ఓవిచిత్రం చిన్నన్నయ్యసంగతి చెప్పలేము నాన్నతో పెద్దన్నయ్య మాట్లాడడు. చిన్నన్నయ్యతో నాన్న సలహాపడ్తాడు. వాడేమిచెపుతాడో? తనదగ్గర డబ్బుఉండడం చూచాడు వాడు. తనను అనుమానించినా అనుమానించవచ్చు వాడు. అందుకనే జాగ్రత్తగా ఉండమని ఖాజాబీబీ చెప్పింది. ఖాజాబీబీని తను పెళ్ళి చేసుకుందామని అనుకున్నాడు. కులాలు వేరు. జాతులు వేరు. మతం వేరు వీటన్నింటికంటే నాన్నమాటను తను కాదనలేడు. అయినా ఖాజా తనకు కావాలి. కేవలం శరీర సుఖానికేకాదు. అన్నిరకాల సుఖానికి ఖాజా కావాలి తనకు. తెలియకుండానే ఎప్పుడో నిద్రపట్టింది. నిద్రలో ఇంకో లోకం. పోలీసులూ, అమ్మా నాన్నా, యజమాని బుర్రమీసాల లల్లూరామ్, రక్తంపీల్చే నల్లులూలేని ఇంకో లోకం!! ఆలోకంలో తనూ ఖాజా...ఎర్రరంగులంగా రోజారంగు గౌనూ, జడ అల్లని వెంట్రుకలు. తల్లో మల్లెలు. ఇద్దరూ చెయ్యి చెయ్యి కలిపి జంటగా, హాయిగా మబ్బుల్లో దూర దూరంగా ఎగిరిపోతున్నారు......

## 5

నాలుగురోజు లయినది. సుబ్బయ్యగారి రెండోకొడుకు మోహనరావు హడావుడిగా లీడర్లందరిదగ్గరికీ వెళ్ళివచ్చాడు. సుబ్బయ్యగారికి ఏవేవో సలహాలు చెపుతున్నాడు. హనుమాయమ్మగారు ఏడ్పుతగ్గించి సాధింపులు ప్రారంభించింది. మురళీ, మధూ రోజూ పొద్దునా, సాయంకాలం స్టేషనుకువెళ్ళి రామారావుకు కాఫీ ఇచ్చి కొంచెంసేపు ఖబుర్లు చెప్పివస్తున్నారు. చిత్రంయేమిటంటే రామారావు అసలు తనకు ఏబాధలేనట్లు హాయిగా నవ్వుతూ మాట్లాడుతున్నాడు. సుబ్బయ్యగారి ఇల్లు ఇంత భీభత్సంగా ఉన్నా పెద్దకొడుకు వాసు ఒక్కసారన్నా ఆ ఇంటికి రాలేదు. రాలేదని ఆ ఇంట్లో ఎవరూ అనుకోలేదు. కానీ, ఖాజా అంతులేదేమవిమాత్రం కనీసం లక్షపార్లయినా అనుకున్నారు. ఖాజాకు క్షణం తీరికలేదు. రామారావు కేసు కారణంగా తన నాయన స్నేహితులందరి ఇళ్ళకూ ఖాజా తిరుగుతోంది. తన నాయనతోపాటు యుద్ధంలోకెళ్ళి తిరిగి వచ్చిన వాళ్ళల్లో చాలామంది ఇప్పుడు పెద్ద పెద్ద ఉద్యోగాలలో ఉన్నారు. ఎట్లాయినా రామారావు నిర్దోషి అని నిరూపించాలి. అందుకు అవసరమైన ఆధారాలను సంపాదించమని ఖాజాకు వాసు సలహా చెప్పాడు. ఆయనను జైలునుంచి తప్పించావంటే ఇక ఆయన నీవాడే అవుతాడే చెల్లెలా అన్నది వాసుభార్య కమల.

"మీ దయుండమ్మా" అన్నది ఖాజా.

"మాదయ యేమిటే? నీ పినతల్లి కొడుకు అబ్దుల్లా ఈ వూళ్ళో సి. ఐ. డి. వాడి దగ్గరికివెళ్ళి బతిమాలుకో. వాడు సలహా చెప్తాడు. ఆ ప్రకారం చెయ్యి" అన్నాడు వాసు.

"ఆళ్ళందరూ ఇప్పుడు నాతో పలుకుతారా అండీ" అన్నది ఖాజా. వాసంటే ఖాజాకు భయం.

"కులంవాళ్ళు గదండీ. నేను చెడిపోయినానని అంటున్నారు."

"అట్లాగా. ఎక్కడ ఎప్పుడు చెడిపోయినావో? మరేం భయంలేదులే. ఒక్కమాట చెప్తా. జాగ్రత్తగా విను. నీ మనస్సుకు మంచిదనితోచిన పని చెయ్యి. తాత్కాలిక సుఖం కాదు. శాశ్వతంగా, సుఖంగా ఉండే

(63-వ పేజీ చూడండి)

# ప్రైవేటు




## తాళ్లూరు నాగేశ్వరరావు

ఆ సాయంత్రం చల్లగాలికి బకింగ్‌హామ్ కెనాల్ వొడ్డున పచ్చటి గరికమీద కూర్చున్నాడు ప్రైవేటు మాష్టరు సూర్యనారాయణమూర్తి. కాలువగట్టున చెట్లనీడలు ప్రాకి అవతలి వొడ్డును తాకినయ్. సూర్యుని కడసారి కిరణాలు ఎర్రగా నీళ్లపై బడి మనోజ్ఞంగా మెరుస్తున్నాయి. పొలాల్లో పనిచేసి వొస్తూన్న ఆడవాళ్ళు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ-హానవచ్చి కలిసినట్టుగా అతని వెనగ్గా నడిచివెళ్లారు.

పడమటిదిక్కునుంచి, కరణంగారి అరటి తోటలమీదుగా గాలి హాయిగా వీస్తోంది, ప్రైవేటు మాష్టరు సూర్యనారాయణమూర్తి ఆలోచిస్తున్నాడు. ఏకాంతంగా వుండే అతనికి ఆలోచించుకోవడమే పెద్ద కాలక్షేపం! ఆలోచించుకోవడంలో ఉన్న ఆనందం, సంతృప్తి—అలవాటుపడినవాళ్ళకు గానీ తెలీదు.

“బాబుగారూ...”మార్దవం, మాధుర్యం వొలికే కంఠధ్వని వినవొచ్చింది.

ఆలోచనల గొలుసు ఆ స్త్రీ కంఠంలోని శ్రావ్యతకు పుటుక్కున తెగింది. సూర్యనారాయణమూర్తి మెడ ప్రక్కగా తిప్పి చూశాడు.

ఆమె ఎంతో వినయంగా నమస్కరించింది. ప్రతిగా నమస్కరిస్తూన్నట్టు తల ఆడించాడు సూర్యనారాయణమూర్తి. ఆమె మాట్లాడేందుకు సిగ్గు పడుతూన్నట్టు, సంకోచిస్తూన్నట్టు—అతనివంక అదో రకంగా చూస్తూ కొంచెం విలంబనం చేసింది. అతను ఆమెవంక ఆశ్చర్యపడుతూ అదేపనిగా చూశాడు రెండుమూడు నిముషాలు. మనిషి పెద్దరూపవతి కాదు. ప్రథమ వీక్షణంలోనే ఆకర్షించే అందమైన లక్షణాలు ఆమెలో ఆట్టేలేవు. కాస్త నిదానించి చూచినమీదట గాని అతనికి ఆమె అందం అంతు పట్టలేదు. చామనచాయ; గుండ్రటిముఖం; వొంకుల జుత్తు; నిండుగా కనిపించే ముక్కు; పల్చటి పెదాలు; వయస్సును నిర్ణయించలేని వక్షాలు; కళ్ళల్లో ప్రత్యేకం మగవాడు మోజుపడేఆకర్షణ. ‘ఆమె అందం ఫర్వాలేదు’ అని సమాధానపర్చుకొని ఆకళ్ళే! కాని మొట్టమొదట మనిషిని చూడగానే కనిపెట్టవచ్చు—జీవితంలో ఎన్నో అనుభవాల్ని మూటకట్టుకున్నదని. సూర్యనారాయణమూర్తి కూడా అదే అభిప్రాయానికి గురైనాడు.

“నా పేరు రాజ్యలక్ష్మి. నేను...”ఉపోద్ఘాతం లేకుండా తన కథను మొదలెట్టిన ఆమెను—“కూర్చోండి. తర్వాత మాట్లాడుదురుగాని” అన్నాడు సూర్యనారాయణమూర్తి మర్యాదగా. అతని మర్యాద ఆమెకెంతో గుండెధైర్యాన్ని తెచ్చిపెట్టింది.

సావకాశంగా తన దీనచరిత్రను వినిపించింది. సహనంతో అంతా విన్నాడు సూర్యనారాయణమూర్తి. కనుచీకటి పడింది.

ఆమెది వాస్తవానికి విషాదగాథే. కాని అది అతి సామాన్యమైనదే! లోకంలోఅట్లాంటివి చాలా జరిగాయి, జరుగుతున్నాయి—జరగొచ్చుకూడా. ఆమె నిరుపేద కుటుంబానికి చెందినది. చిన్నతనంలోనే తల్లీ-తండ్రీ చనిపోయారు; మేనమామ పెంచిపెద్దదాన్ని చేశాడు. ఆమె ఫోర్త్‌ఫారంవరకూ చదువుకుంది. మేనమామ ఒక పేదవాడికిచ్చి పెళ్ళి చేశాడు. మూడేళ్ళు ముచ్చటగా కాపురం చేసి, టైఫాయిడ్ జ్వరంతో ఒక ముహూర్తాన యీ లోకాన్ని విడిచాడు. తర్వాత కథ ఏముంది? మేనమామ “ఇక నీ బతుకు నీవు చూసుకోవమ్మా!” అన్నాడట. గతిలేక లోకంమీద పడింది. భర్త స్వగ్రామంలో వుండే తావులేక, వయస్సులోవున్న మగవాళ్ళు ఎగబడితే - అవినీతికి తెగబడలేక పారిపోయి వొచ్చిందట నీతిగా జీవనం గడుపుకుందామని.

ఆమె తన జీవితచరిత్ర నిజంగానే వెల్లడించిందా? కట్టుకథ అల్లిందా? ఆమె నిజంగానే మొగుడుచచ్చిన దిక్కుమాలిన స్త్రీయా? లేక మొగుడు విడిచిపెట్టిన నీతిమాలిన స్త్రీయా? ఆమె జీవితం చాలా రుచి చూచిన ఆడదిలాగా అగపడుతుందే! వాస్తవంగా ఆమె అవినీతికి భయపడే



వచ్చిందా?— అట్లా ఆలోచించలేదు సూర్యనారాయణమూర్తి. ఆమెను చూడడంతో ఒకవిధమైన కరుణ ఏర్పడింది హృదయంలో. అసలే అతను మెత్తని మనస్సు గలవాడు. సినిమాలో పాత్రలుపడే కష్టాలకే కళ్ళ నీళ్లు కారుస్తాడు. చూస్తూ ఏ అన్యాయాన్నీ సహించలేడు. ఏ అక్రమాన్నీ దిగమ్రింగలేడు; ఏ అవినీతినీ క్షమించలేడు.

"ఈ ఊళ్ళో నాకేదైనా జీవనాధారం దొరుకుతుందా?" అన్నది అఖరికి రాజ్యలక్ష్మి.

చిన్నగా నవ్వాడు సూర్యనారాయణమూర్తి.

"కష్టించి పనిచేసేవాళ్ళకు ఒకవూళ్ళో మటుకు జీవనాధారం దొరకదా!" అన్నాడు అతను సామాన్యధోరణిలో.

చీకటి బాగాదిగజారాక తనవెంట ఊళ్లోకి తీసుకొచ్చాడు ఆమెను. సూర్యనారాయణమూర్తి ఏకాకి. భార్య చనిపోయి దాదాపు పదేళ్ళు కావస్తున్నది. భార్యవున్న రోజుల్లో ఉన్న రెండెకరాల మాగాణిఅమ్మి, విరివిగా కర్చుపెట్టి ఆమె చనిపోయేటప్పటికి చిల్లికానీ మిగల్చలేదు. అంత జల్సాగా గడిపిన జన్మస్థానంలో బిచ్చగాడిలా బ్రతకలేక ఆవూరు వచ్చాడు మూడేళ్ళక్రితం పిల్లలకు ప్రైవేటు చెప్పుకుని బ్రతుకుదామని. ఆ వూళ్ళోవున్న ఎలిమెంటరీ స్కూల్లో పంతుళ్ళు ఏమీ చదువు చెప్పకపోవడంచేత - సూర్యనారాయణమూర్తి ప్రైవేటు స్కూల్లో వేలం వెర్రిగా పిల్లలు చేరారు. బాగా చదువుచెప్పే మాష్టరని ఊళ్ళో పేరు పడింది. అంచాత రాను రాను అతని స్కూలే ఎలిమెంటరీ స్కూలైంది.

# ★ ప్రైవేటు మాష్టరు ★

చీకట్లో రాజ్యలక్ష్మిని ప్రైవేటు మాష్టరు సూర్యనారాయణమూర్తి వెంట పెట్టుకొని రావడం ఆ వూళ్లో చాలమంది చూశారు. ఎవ్వరూ ఎందుచేతనో అపోహ పడలేదు. కాని ఆ వూరి పంచాయితీబోర్డు వైస్ - ప్రెసిడెంటు బాపినీడు ఆమెను చలమయ్య కొట్టు పెట్రోమాక్సులైటు కాంతిలో చూసి - "ఎక్కడదిరా ఈ పిట్ట" అన్నాడు నిర్లక్ష్యంగా. కాని ఆ మాటల్ని ఆమె కానీ, మాష్టరుగానీ వినలేదు.

ఆమె వంటచేస్తానని అన్నది కానీ సూర్యనారాయణమూర్తి ఆమెని చేయనివ్వలేదు. స్వయంపాకం ఆమెకి రుచిచూపించి, ఆమె మెప్పు పొంది మురిసిపోయాడు.

ఆ రాత్రి నిద్రబోయేముందు ఒక ఆలోచన తట్టింది- సూర్యనారాయణమూర్తికి. ఆ వూళ్లో ఆమెకు గౌరవప్రదమైన జీవనాధారం ఏం దొరుకుతుంది? తన స్కూలు వర్ధమానదశలో వుంది. ఇప్పటికే ముప్ఫైమంది వున్నారు. రాజ్యలక్ష్మిని పంతులమ్మగా యిక్కడే వుండిపొమ్మంటే - తను ఇంకా పిల్లల్ని చేర్చుకొనేందుకు అవకాశం వుంటుంది. ఎంతోమంది తండ్రులు రోజూ తిరిగి పోతూనే ఉన్నారు - తమ పిల్లల్ని చేర్చుకోమంటూ. ఆమెకూ తను కొంత జీవనాధారం సునాయాసంగా కల్పించినట్టూ వుంటుంది. అసలు ఆమె ఏమంటుందో - ఈ ఆలోచనకు.

## 2

జీవితంలో కొన్ని కొన్ని సంఘటనలు ఎంతో విచిత్రంగా, ఆకస్మికంగా, ఆశ్చర్యజనకంగా జరుగుతూ వుంటాయి. కొన్ని జీవితంలో మంచికి దారితీయవచ్చు; మరి కొన్ని చెడుకు దారితీయవచ్చు; ఇంకా కొన్ని జీవితపథాన్నే అనుకోని రీతిగా మార్చవచ్చు. సూర్యనారాయణమూర్తితో ఆ సాయంత్రం తలవనితలంపుగా పరిచయం కలగడం జీవితంలో ఒక మరపురాని సంఘటనగా గుర్తించింది రాజ్యలక్ష్మి. ఆ మరునటిరోజు ఉదయం - "మీరు ముక్కూ మొహం తెలీని యీ వూళ్లో ఏం జీవిక చూసుకుంటారు! రాత్రి నాకు ఒక ఆలోచన తట్టింది. మీకు నచ్చి, ఆ విధంగా ఒప్పుకుంటే - నాకు అభ్యంతరం ఏమీ లేదు. ఇక్కడ ఎలిమెంటరీ స్కూల్లో పంతుళ్లకు చదువు చెప్పడంమీద ఉన్న అశ్రద్ధవల్ల- ప్రైవేటు స్కూలు అవశ్యకత జాస్తిగా ఉంది. ప్రతి తండ్రీ ప్రైవేటు చెప్పించడం ద్వారా పిల్లవాడి అభివృద్ధిని ఆకాంక్షించడం సహజం. నా ప్రైవేటు స్కూల్లో మీరు బాలికల సెక్షను నిర్వహిస్తే - మీకు శ్రేయస్కరమైన జీవనాధారం ఏర్పడుతుంది" అని సూర్యనారాయణమూర్తి అన్నప్పుడు, ఆ సంఘటన తన జీవితంలో 'మంచి'కే దారితీసిందని రాజ్యలక్ష్మి గాఢంగా నమ్మింది.

ఆనందంతో ఆమె కళ్ళు మెరిశాయి; మనస్సు ఎగిరి గంతేసింది; హృదయం సముద్రం ఉప్పొంగినట్టు ఉప్పొంగింది—

"మీరు ఇంత సహృదయులని..." ఆపైన కృతజ్ఞతని మాటలద్వారా వెల్లడించలేకపోయింది రాజ్యలక్ష్మి. ఆమెముఖంలోని సహజమైన ఆవేశాన్ని అతను గ్రహించి— సంతోషపడ్డాడు.

సూర్యనారాయణమూర్తి ఉంటోటే ఇల్లు రెండు కుటుంబాలు దివ్యంగా ఉండేందుకు సరిపడే ఇల్లు. పల్లెటూరు కనుక, అద్దెకుండే వాళ్ళ పోటీడి అసలే లేదు కనుక— పది రూపాయలకే ఆ ఇంటి యజమాని అద్దెకిచ్చి, తనకొడుకు డివిజనల్ ఇంజనీరైతే వార్ధక్యదశలో అక్కడే స్థిరపడ్డాడు. సువిశాలమైన గృహం కనుక రాజ్యలక్ష్మిని వేరేపెట్టేందుకు ఎక్కువ శ్రమ లేకపోయింది అతనికి. రెండు పెద్దతడికెలు మేదరవాళ్ళచేత అల్లించి అడ్డుగాపెట్టాడు. రాజ్యలక్ష్మి ఉండేందుకు, పిల్లలకు చదువుచెప్పేందుకు విడిగా గదులుగా ఏర్పాటుచేశాడు. ఆమె వంటచేసుకొనేందుకుకూడా ప్రత్యేకంగా పొయ్యి పెట్టించాడు.

ఆ వూళ్ళో రాజ్యలక్ష్మిని గురించి అనేక రకాలుగా చెప్పకోనారంభించారు. 'ఆమెకూ పంతులుగారికీ అంతకుముందు ఎక్కడో సంబంధం ఉందట.' 'ఆమె మొగుడు విడిచిపెట్టిన దిక్కుమాలినదట. మనిషి అందంగా వుంటే—భార్యలేని లోపాన్ని తీర్చుకోవటానికి తీసికొచ్చాడట.' 'ఆమెకు మొగుడూ లేడూ, ముక్కు చెక్కులూ లేవు. 'అసలు పెళ్ళే కాకుండా సంతానవతి అయిందట. పుట్టిన పాపని ఏ కాలవలోనో పారవేసి — పంతులుగారి పంచన చేరిందట! - అవిధంగా ఆ వూళ్ళో వాళ్ళు చెప్పుగోవడం అతనికి తెలిసింది. కాని ఏమంటాడు? కొత్తగా ఊళ్ళోకి వొచ్చినవాళ్ళమీద స్వేచ్ఛగా ఊహాగానాల్ని చేయడం - పల్లెటూరివాళ్ళకు ఉగ్గుపాలతో వొచ్చినవిద్య. తనమీద చెలరేగిన దుమారాన్ని అరికట్టేందుకు, అపోహల్ని ఖండించేందుకు సూర్యనారాయణమూర్తి ప్రయత్నించలేదు. అడిగినవాళ్ళకు నిజం చెప్పాడు.

సూర్యనారాయణ ప్రైవేటు స్కూల్లో వారంరోజుల్లో అదనంగా అయిదుగురు బాలికలు, పదిమంది బాలురూ చేరారు. వాళ్ళను అతను రాజ్యలక్ష్మివల్లనే చేర్చుకున్నాను. ఆమె పిల్లలకు సక్రమంగా, శ్రద్ధగానే పాఠాలు చెబుతూంది. అంతకుపూర్వం అనుభవం లేకపోయినప్పటికీ, అక్షరాలు వొచ్చినవాళ్ళకూ, రానివాళ్ళకూ సమానంతో చదువు చెప్పడం, దిద్దించడం, చూచివ్రాత వ్రాయించటం, 'హోంవర్కు' చేయించటం - రాజ్యలక్ష్మి త్వరలోనే ప్రైవేటు మాష్టరుగారికి విశ్వాసాన్ని కలిగించింది. ఆమె ఎంతమంది పిల్లలకు ప్రైవేటు చెబుతూందో-ఆ జీతమంతా ఆమెకే చెందేట్టుగా ఏర్పాటుచేశాడు.

రోజులు బాగానే గడుస్తున్నాయి. కాని రాజ్యలక్ష్మికి తనకు యింత ఆదరణ యిచ్చి, గౌరవప్రదమైన జీవికను కల్పించిన సూర్యనారాయణమూర్తి స్వయంపాకంతో బాధపడటం నచ్చలేదు. తను స్త్రీయైవుండీకూడా అతనిని చేయి కాల్చుకోనివ్వడం మర్యాదా? అతను తనకు చేసిన సహాయానికి, చూపిన ఔదార్యానికి తను ఇట్లానేనా కృతజ్ఞత ప్రకటించడం? నలుగురూ ఏమనుకుంటారు? అట్లా బాధపడింది రాజ్యలక్ష్మి. కాని వెంటనే చొరవచేసికొని తన అభిప్రాయాన్ని వెల్లడించలేకపోయింది. అన్యథా భావిస్తాడేమోనన్న భయం ఆమెను పీకింది.

ఒకరోజు సాయంత్రం బడి వదలిపెట్టాక తెగించింది—

"ఏమండీ! మిమ్మల్ని ఒక్క విషయం అడగాలని కుతూహలపడుతున్నాను."

సూర్యనారాయణమూర్తి హృదయం ఎందుకో గతుక్కుమన్నది-ఆమె అంతగా అడగాలని కుతూహలపడే ఆవిషయం ఏమై వుంటుందోనని.

"అడగండి—"

"ఏంలేదు: ఈ ఇంట్లో నేను అడుగుపెట్టినప్పటు 'చీ నన్ను ఒక్కవిషయం బాధిస్తోందండి. తమరు కొస్త దయదలిస్తే...నా ఆత్మకు కొంత ఉపశాంతి..."

ఆమెమాటలు సుతరామూ అర్థంకాలేదు. ప్రైవేటుమాష్టరుకు. అయినా తల ఆడించాడు.

"ఏమీలేదు తమరు నేను వొచ్చాకకూడా స్వయంగా వంటచేసికోవడం—" నీళ్ళు నమిలింది రాజ్యలక్ష్మి.

ఆమెముఖకవళికల్లోని భావపటిమని అర్థం చేసుకున్నాడు; ఎంతో ఆనందపడ్డాడు. కాని క్షణికమైన ఆ ఆనందానికి ఆత్మను లొంగనివ్వలేదు.

"అహా! అట్లా శెలవివ్వకండి. స్వయంపాకానికి నాచేతులు యిన్ని సంవత్సరాలనుంచీ బాగా అలవాటుపడ్డాయి. మీరునాకు వంటచేసి పెట్టడం—నా ఆత్మకు సంతృప్తి చేకూర్చదు. ఆత్మ సంతృప్తి లేనిది నేను ఏపనీచేయను; చేయనివ్వను. దయచేసి మీమాటను త్రోసిపుచ్చినందుకు క్షమించండి" అన్నాడు సూర్యనారాయణమూర్తి.

నిర్విణ్ణురాలైంది రాజ్యలక్ష్మి.

ఆమె ముఖంలో తన నిరాకరణవల్ల కలిగిన మార్పు కొంచం బాధకలిగించింది సూర్యనారాయణమూర్తికి.

ఆరాత్రి చాలసేపు ఆలోచించాడు సూర్యనారాయణమూర్తి—ఆమెనుగురించే. భార్య గతించినదగ్గర్నుంచీ స్త్రీతో మాట్లాడడంగానీ, స్త్రీసాంగత్యానికి ప్రాకులాడడంగానీ లేదు. తన గతచరిత్ర సింహావలోకనానికి తెచ్చుకుని, అందులోని కుళ్ళునూ, అవినీతినీ, దుర్మార్గాన్నీ అవగాహన చేసుకొని—చెంపలేసుకోవడంతోనే సరిపోయింది. జీవితం కొంత ముందుకు సాగింతర్వాతనే—మానవుడు వెనక్కి మళ్ళి ఏం జరిగిందో చూసుకోగలడు. రోజాలు హాయిగా గడుస్తూంటే, సుఖం మానవుడి ఆత్మను పెనవేసికొని–వెనక్కి మళ్ళనివ్వదు. ఉన్నది కొత్త తగలేసుకొని, లోకంలో ఉన్న సుఖంలో మునిగి తేలుదామనుకొన్న రోజుల్లో–అతని ఆత్మకు వెనుకచూపు లేదు. కాని జీవితంలో ఆ మాయకాలం గడిచిపోగానే–సూర్యనారాయణమూర్తికి ఏది మంచో–చెడో తెలిసికోవాలనే జ్ఞానతృష్ణ సహజంగా కలిగింది. అయినా అతను సన్యాసం పుచ్చుకోలేదు; 'ఈ జగత్తంతా మిథ్య–ఈ శరీరమంతా తోలుతిత్తి' అని భావించలేదు. శారీరకమైన సుఖంమీద అతనికి నమ్మకంఉంది. కాని గౌరవప్రదంగా సంఘంలో బ్రతికి, స్వశక్తిమీద జీవితాన్ని ముందుకు నెట్టాలనే ఆశయాన్ని హృదయంలో ప్రతిష్ఠించుకున్నాక–అతని ప్రవర్తనలో చాల మార్పు వొచ్చింది.

అతనిఇంట్లో రాజ్యలక్ష్మి అడుగుపెట్టిన దగ్గర్నుంచీ–ఊళ్ళోవాళ్ళ ఊహల్ని అటుంచి, అతని హృదయంలో కూడా చిన్నగా సంఘర్షణ బయలుదేరిందనే చెప్పొచ్చు. మధ్యవయస్కుడు కావటం చాతనైతేనేమి, కోర్కెల్ని సంపూర్ణంగా విసర్జించినవాడు కాకపోవటంవల్లనైతేనేమి, ఒక స్త్రీని ప్రేమించే అవకాశం అయాచితంగా ఏర్పడటంవల్లనైతేనేమి – సూర్యనారాయణమూర్తిలో అజ్ఞాతంగా ఆమె సౌందర్యాన్ని గుర్తించాల్సిన అగత్యం, ఆమెహృదయాన్ని అర్థంచేసికోవాల్సిన కుతూహలమూ, ఆమెను గంటగంటకూ చూడాలనే ఆసక్తి క్రమంగా ఒక రూపానికి రాసాగినయ్. ఆ రాత్రంతా కంటిమీద కునుకులేకుండా ఆలోచించి, ఆమె చేష్టల నన్నింటినీ–చిరునవ్వునూ, ప్రదర్శించే వినయాన్నీ, ముక్తసరి మాటలనూ, కనపర్చే కృతజ్ఞతాపూర్వకమైన భక్తినీ, మననంచేసికొని, తర్కించుకొని–ఒక నిశ్చయానికి వొచ్చాడు. ఆమెకు తనంటె ఇష్టం! కాని తన నిశ్చయంమీద పూర్తి విశ్వాసంలేదు సూర్యనారాయణమూర్తికి. ఆమెకు తనమీద ఇష్టమని ఎట్లా తెలిసికోవడం! "మీరంటే నాకెంతో ఇష్టం! మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను" అని ఆమె అంటేగానీ నమ్మకం కుదరదు. అట్లా ఆమె సాహసిస్తుందా? ఏదైనా చిన్న సంఘటనవల్లనైనా–తాము ప్రేమికులం అన్న విషయం బయటపడితే బాగుంటును, అనుకున్నాడు సూర్యనారాయణమూర్తి ఆ తెల్లవారుఝామున.

ఆ శుభముహూర్తంకోసమే అతను ఎదురు చూస్తున్నాడు.

## 3

బకింగ్‌హామ్ కెనాల్‌కు షికారుకెళ్ళి సూర్యనారాయణమూర్తి ఇంటికి వొచ్చేప్పటికి కనుచీకటి కాస్తా కటికచీకటైంది. ఏదో ఆలోచిస్తూ అంత ఆలస్యంచేశాడు. "ఇంత ఆలస్యంగా ఇంటికొచ్చారు. ఇంకా వంట చేసికొని ఎప్పుడు భోజనంచేస్తారు? ఈ పూటకు మాఇంట్లోనే భోజనం చేయండి!" అనిరాజ్యలక్ష్మిఅంటే "అల్లాగే" అందామను

(53-వ పేజీ చూడండి)

# మనసు మార్చిన మమత

రాగలత కాలేజి కెళ్ళటానికి సిద్ధంగా ఉన్నది. తలుపు నెట్టుకుని సుశీల ప్రవేశించింది.

"కాలేజికి పోదామా?" అంది రాగలత.

"నేను చదువు మానేస్తున్నాను," అంది అడిగినదానికి.

"ఏమిటే! నువ్వు చదువు మానేస్తున్నావా? నేను నమ్మను," అంది రాగలత.

"నమ్ము, నమ్మకపో. నేను ఇంక చదవను."

"నిజంగానే?" రాగలతకి నమ్మకం ఇంకా కలిగినట్లు లేదు.

"నిజమే లతా! బహుశ ఎల్లుండి మావూరు వెళ్ళిపోతాను."

లతకి మూర్ఛపోయినంత పనయింది.

సుశీల, లత ఇద్దరు ప్రాణస్నేహితురాండ్రు. ఇద్దరూ ఆ క్రిందటి సంవత్సరమే బి. ఎస్.సి. లో చేరారు.

కొంతమందికి గమత్తుగా స్నేహము కలుస్తుంది. అది లత, సుశీల విషయంలో నిజమైంది.

లతకి చిన్నప్పుడే మాతృదేవి పోయింది. తండ్రి ప్రకాశరావు ఆమెని గారాబంగా పెంచాడు. ఆయన కలప వ్యాపారంలో లక్షలు నిలవచేశాడు.

లత మన స్తత్వం అర్థంచేసుకోవాలంటే కొన్ని ఏళ్ళు ఆమెతో సాహచర్యం చెయ్యనక్కరలేదు. "వివాహము—చదువు" ఈ రెంటిలో ఆమె చదువుకే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తుంది.

"చదువుకుంటే తరువాత సుఖపడవచ్చు," అంటుంది ఆమె.

ఇది విని కాలేజి స్టూడెంట్లు నవ్వుకునేవాళ్ళు!

అన్న ఎల్లుండి రానేవచ్చింది.

సుశీల వెళ్ళేరోజు అదే!

ఎంత ఆలోచించినా ఇంత హఠాత్తుగా సుశీల వెళ్ళిపోవటానికి గల కారణం లతకి బోధపడలేదు.

గుంటూరు స్టేషనులోకి విజయవాడ పాసింజరు వచ్చింది. జనం హడావుడిగా లోక్కి ఎక్కుతున్నారు.

"నన్ను మర్చిపోతావా? ఎప్పుడైనా ఉత్తరం వ్రాస్తావా?" అంది లత.

"నిన్నెందుకు మర్చిపోతాను!"

## "అప్పృతవాణి"

"ఏమోలే! ఇంత ప్రాణస్నేహితురాల్ని నన్ను విడిచి వెళ్ళటంలేదూ?"

"ఏంచెయ్యను లతా! మా ఇంటి పరిస్థితులు నన్ను మార్చివేశాయి."

"పరిస్థితులా?"

"అవును పరిస్థితులే! ఎంత నిబ్బరం గలవారైనా పరిస్థితుల కింద లోబడతారు."

"సైకాలజీ కాచివడపోసినట్లు మాట్లాడుతున్నావు," నవ్వుతూ అంది లత.

"దానికేం సైకాలజీ తెలియక్కరలేదు. అనుభవంమీద చెబుతున్నాను," అంది సుశీల.

రైలు కూత కూసింది. గార్డు విజిల్ ఊదాడు.

'వస్తా లతా!' అంది లత చెయ్యిపట్టుకుని సుశీల.

"మంచిది" అంది లత విచారరంగా.

రైలు కదిలి, వెళ్ళిపోయింది.

లత చిన్నబోయిన మనసుతో రూముకొచ్చింది.

సుశీల కనిపించకపోతే కష్టంగానే ఉంది లతకి. "ఎప్పటికైనా విడిచిపోక కలిసే ఉంటామా?" అనుకుని మనసు దిటవు చేసుకున్నది.

కాని ఎంత త్రిప్పుకుందామనుకున్నా లత మనసు సుశీలమీదనుంచి పోలేదు. ఆమె దగ్గరనుంచి వచ్చిన ఉత్తరం భద్రంగా పెట్టెలో దాచుకునేది.

"ఏమిటే మా ఇరువురి సంబంధం!" అనుకున్నప్పుడల్లా ఆమెకి నవ్వవచ్చేది.

అప్పుడే సుశీల వెళ్ళి నాలుగు నెలలు అయింది. లతకి బి. ఎస్‌సి. మొదటి సంవత్సరం పరీక్షలయిపోయినయి. శలవలకు యింటికి బయలుదేరింది.

"ఏమ్మా! పరీక్షలు బాగా రాశావా?" అన్నాడు తండ్రి.

"రాశాను నాన్నా!" అంది.

"ఈ శలవల్లో అయినా వివాహం చేస్తానమ్మా" అన్నాడు ఆయన ఓ మధ్యాహ్నం.

"బి. ఎస్‌సి. కానియ్యి నాన్నా! ఏం తొందర?"

"కాదమ్మా. మీ అమ్మ నీ ముచ్చటలేమీ చూడకుండానే కళ్ళుమూసింది. ఇక మిగిలింది నేను. నేనుకూడా నీ వివాహం చూడకుండా పోతానేమోనని భయంగా వుంది. నామాట ఈ ఒక్క విషయంలో వినమ్మా," అన్నాడు.

"బి. ఎస్‌సి. పూర్తవగానే చేసుకుంటాలే నాన్న. లేకపోతే చదువు మొండిపడుతుంది."

"నీ ఇష్టం."

లత ఇంటికొచ్చి నాలుగురోజు లయింది. ఆరోజు ప్రొద్దుట కాఫీ తాగుతుంటే సుశీల వచ్చింది.

"రావే! ఎన్నాళ్ళకి కనిపించావు!"

"పరీక్షలు బాగా రాశావా?"

"ఆ! అది సరే హఠాత్తుగా చదువు మానేయటానికి కారణమేమిటే?"

"ఆ సంగతి ఎందుకులే లతా!"

"చెప్పు"

"ఇంటి పరిస్థితులు లతా! నాన్న మంచము పట్టాడు. నా పెళ్ళిచూస్తే ఇక తనకు నిశ్చింత అని అన్నాడు. నాన్నని చూస్తే జాలేసింది. సరేనన్నాను. ఇరవయి ఒకటో తారీకు పెళ్ళి. తప్పకరా!" అంది సుశీల.

"సరే అలాగే వస్తానుకాని, వరుడెవరు?"

"గోపాలరావు. మా బావ. స్కూల్లో మాస్టారు." లత నవ్వింది.

"చివరకు ఎం. ఎస్‌సి. కాకుండానే వివాహము చేసుకుంటున్నావే?"

"ఏంచెయ్యను? నాన్నకోసరం."

లత నిట్టూర్చింది. ఆ మధ్యాహ్నం సుశీల వెళ్ళిపోయింది.

ఓ ప్రెజెంటు తీసుకుని లత సుశీల వివాహానికి వెళ్ళింది. పురోహితుని మంత్రాల సందడిలో, మేళాలమోతలో సుశీల గోపాలరావు సొమ్మయిపోయింది. పెళ్ళికి రాధ, లీల, వేణుకూడా వచ్చారు.

ఆ సాయంకాలం లత, రాధ, లీల వేణు కాలవగట్టుకెళ్ళి కూర్చున్నారు.

"సుశీల, ఎం. ఎస్‌సి. చదువుతానని అన్నదల్లా, ఇలా హఠాత్తుగా బుద్ధిర్చుకుని పెళ్ళిచేసుకున్న దెందుకో?" అంది రాధ.

లతకి తెలుసు అసలు సంగతి. కాని చెప్ప లేదు.

"లతా! నీ వివాహమెప్పుడు?"

లత మాట్లాడలేదు.

"లత అసలు వివాహము చేసుకోదే!" వేణు నవ్వింది. దానికి లత జవాబు చెప్ప లేదు. ఓ గంట కూర్చొని తిరిగివచ్చారు. ఇంటికి రాగానే సుశీలను చూసి, నవ్వొచ్చింది లతకి.

ఎర్రగులాబి రంగుకి మారిపోయిన సుశీల ముఖాన్న తుమ్మెదలాగా ఒక చుక్క మెరుస్తోంది నల్లగా.

కాళ్ళకి పసుపు, దానిపైన ఎర్రనిగీతలతో పారాణి.

మెడనిండా సొమ్ములు.

జడనిండా మల్లెపూవులు.

ఆమెచుట్టూ సుమంగళులు చేరి నవ్వుతు సంతోషిస్తున్నారు.

ఆ మర్నాడు లత వెళ్ళిపోయింది.

రైలు వేగంగా గమ్యస్థానానికి వెళ్ళిపోతోంది.

లత ఆలోచనలు కూడ వేగంగా పరుగెడుతున్నాయి. రాత్రి సుమంగళులు, సుశీల తండ్రి ఆనందిస్తున్న దృశ్యం ఆమె కనుల ముందు మెదిలింది.

"ఈ ఆనందం తన తండ్రి అనుభవించడా?"

లతకి జవాబు దొరకలేదు.

ఒక్కసారి, ఆమె తనజాతకాన్ని వేణుతో పోల్చి చూసింది.

తనకు బి. యస్‌సి. అయిపోయింది.

అతను ఇంటర్ ఫేలయ్యాడు.

తను శ్రీమంతుల పిల్ల.

అతను బీదవాడు.

తను యం. బి. బి. యస్. చదివి డాక్టరు అవుతుంది.

అతను కథలు వ్రాస్తాడు. బొమ్మలు గీస్తాడు.

అతని కథలు, చిత్రాలు చూసి చాలా మంది జనం సంతోషిస్తారు.

ఆమె దిగవలసిన స్టేషను వచ్చింది.

"పెళ్ళి బాగా జరిగిందా?" తండ్రి ప్రశ్న మామూలుగా సున్నితంగా.

రిజల్ట్సు వచ్చాయి. క్లాసు వచ్చింది లతకి. యం.బి.బి.యస్. సీటు వచ్చింది. కాలేజిలో చేరింది.

సుశీల దగ్గరనుంచి ఉత్తరాలు వస్తూనే వున్నాయి.

"నన్ను ఆయన బాగా చూస్తారు. నేనంటే ఎంత ప్రేమో..." ప్రతి ఉత్తరంలోను ఈ మాటలు వుండేవి.

"ఆ మూర్ఖుడు అవనవుకు ఈ సుశీల ప్రేమించగలదా?" అనుకున్న తనకు సందేహం తీరిపోయింది.

నేను వేణును ప్రేమించగలనా?

లత తల తిరిగిపోయింది. పరుపుపై పక్క మీద వాలిపోయింది.

"వివాహము అనేది నా జీవితంలో అసలు రాదేమో అనిపిస్తోంది" అని రాధ లతకు ఉత్తరాలు రాసేది.

లతకి రాధ ఉత్తరాలు చూసినప్పుడల్లా నవ్వు వచ్చేది.

కాలేజినుంచి హాస్టలుకి రాగానే సుశీల దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

సుశీల ఇంకో తొమ్మిదినెలలకి తల్లి అయిపోతుంది. లతకి చెప్పరాని సంతోషం వచ్చింది.

సుశీల తల్లి అయితే తనకెందుకంత సంతోషం? మొదటేడు అయిపోయింది. సెలవులు. ఇంటికొచ్చింది లత.

ఇంటికొచ్చిన మూడోరోజున సుశీలను చూడటానికి వెళ్ళింది.

"ఏమే లతా! ఎప్పుడొచ్చావు?"

"ఇప్పుడే."

"నాన్నగారు కులాసా?"

"ఆఁ!"

అక్కడ సుశీల పరిస్థితి లతకి విచిత్రంగా తోచింది. ఒక్కపనీ ఆమెచేత చేయించటం లేదు. అన్నం తినేటప్పుడు మరింత కొసరి కొసరి వేస్తుంది తల్లి.

"అసలు దీనిపెళ్ళి చూడననే అనుకున్నా. ఇప్పుడు మనవడిని కూడా చూడబోతున్నా" అన్నాడు సుశీల తండ్రి.

"ఏమిటె సుశీలా? మరీ నిన్ను ఇంత ఇదిగా చూస్తున్నారు?" ఉండబట్టలేక అడిగింది.

"అవును లతా! మరీ మా వదిన. ఎప్పుడు కనిపించినా ఇవే మాటలు. నాకు చచ్చే సిగ్గుగా వుంది. ఆయన మరీను—"

"సరె నే వస్తాను."

లత రెండో సంవత్సరం చదివేందుకు మళ్ళీ పట్నం వెళ్ళిపోయింది.

హాస్టల్లో కిటికీదగ్గర కూర్చొని, దూరాన కార్మిక భార్యాభర్తలు నవ్వుకుంటూంటే, చూస్తూ కూర్చునేది.

కార్మికుడు ఫ్యాక్టరీనుంచి వచ్చి తన భార్యతో నవ్వుతూ కబుర్లు చెబుతున్నాడు.

తాత, మనవడిని దగ్గరగా తీసికొని ముద్దు లాడుతున్నాడు.

వాళ్ళకి దవ్వేది?

వాళ్ళకి చదు వేది?

చదువుకుని తను సుఖపడి, తండ్రిని సుఖపెట్టగలనని అనుకున్న లతకి తండ్రిపై ప్రేమ ఒక్కసారి పొంగిపొర్లింది.

తనకోసం ఎంత కష్టపడ్డాడు నాన్న?

చిన్నప్పుడు రెండుమైళ్ళ దూరం గోం చేస్తే నడిచి పక్కవేట్నం పోయి కొనుక్కొచ్చేవాడు!

అటువంటి తండ్రిని తను బాధ పెడుతున్నది.

తండ్రి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

"మీ నాన్నకు జ్వరంగా వుంది. నిన్ను చూడా లనుకుంటున్నాడు." తండ్రి కాదు అది వ్రాసింది—వేణు.

ఏడుపొచ్చింది. 'నాన్న చచ్చిపోతే తన కెవరు దిక్కు? అయ్యో—నాన్న చచ్చిపోగూడదు! ఆయన పుట్టి పెరిగిన తరువాత ఎప్పుడూ కష్టపడటమే.' ఇదంతా ఎవరి కోసరం?

తనకోసరం. కాని తను ఇంకా తండ్రిని కష్టపెడుతున్నది. హఠాత్తుగా ఆమె కాలేజి మానేసి ఇంటికొచ్చేసింది. తండ్రిని చూడగానే బావురుమని ఏడ్చింది.

"ముహూర్తం పెట్టించు నాన్నా!" అంది మనస్ఫూర్తిగా మారిన మనసు గల లత.

తనూ, వేణూ నమస్కరిస్తుంటే ఆయన కళ్ళవెంబడి ఆనందబాష్పాలు రాలిపడ్డాయి.

తల పక్కకి తిప్పి తల్లి ఫోటోవంక చూసింది. ఇంట్లో అందరూ తనని చూసి సంతోషిస్తున్నట్లనిపించింది.

"పెళ్ళి వద్దన్నావే? ఇప్పుడెలా చేసుకున్నావు?" అని రాధ ఉత్తరం వ్రాసింది.

ఇక చదవలేక ఉత్తరం క్రింద పడేసింది. ఆమె మనస్సులో సుశీల పక్కలో పాపబోసినవ్వు నవ్వుతూ మెదిలింది. ★




## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము

చ. అనుపమనిత్యసత్యరతు లై వినయాన్వితు లైనపాండునం
దనులకు ధర్మమార్గులకు ధర్మ వెలుంగఁగ యిట్టు లెగ్గు సే
సినధృతరాష్ట్రనాథుఁడు నశేషసుహృత్సుతబంధుదాహమూ
చన మయి లక్కయిం డ్లతికృశానుశిఖాహతిఁ గ్రాఁగ గ్రక్కునన్.

వ. తదనంతరంబ ప్రభాతసమయం బగుడును.

చ. అతిమురితక్రియాభిరతుఁ డైనపురోచనుతోడ భస్మసా
త్కృత మయి పెద్దతద్విపుల గేహముఁ దక్షణదగ్ధ మైనయా
కృతకవిభూతిజాతుమని కేతనముల్ మఱి శత్త్రవేశ్మముల్
ధృతి సెడి చూడఁగా నరుగుదెంచి జనుల్ గడుసంభ్రమంబుతోన్.

మధ్యాక్కర. ప్రోవైన భస్మంబు వాయఁ ద్రోచి యయ్యుదిలో నడఁగి
యేవురు గొడుకులతోడ నం దొక్క యింతి యత్యుగ్ర
పావకదగ్ధ యై యున్నఁ జూచి యప్పౌరులు దాని
భావించి కుంతియు సుతులు నని శోకపరవశు లగుచు.

మ. బలవంతుల్ భరతాన్వయస్థితికరుల్ భాస్వద్భుజావీర్యని
ర్దళితారాతులు భూరిభూభరమహాధౌరేయకుల్ పాండవే
యులు నిష్కారణ మిట్లు వచ్చి ధృతరాష్ట్రోపాయమారోపిత
జ్వలనజ్వాలలఁ గ్రాఁగి రే యనుచు నం జాతార్తు లై రంతయున్.

వ. అంత విదురప్రేషితుండయిన ఖనకుండు పౌరులంగలసిన భస్మంబు వాయఁద్రోయు వాఁడపోలె నెవ్వరు నెఱుంగకుండఁ దనచేసిన బిలంబుద్వారంబు గప్పి లక్కయింట నొక్కనిషాదవనిత యేవురు గొడుకులతో దగ్ధ యగుట యెఱింగి గజపురంబునకుం జని తద్వృత్తాంతంబును పాండవుల కుశలగమనంబును విదురునకుం జెప్పెనిట వారణావతమ్మునవెల్ల విట్టిదారుణంబు పురోచనకారితంబ కానెఱింగి శోకించి కుంతీపాండవుల పంచత్వంబు ధృతరాష్ట్రునకుం జెప్పి పుచ్చిన.

### పాండవులు లక్కయింటఁ జచ్చిరని ధృతరాష్ట్రుండు దుఃఖించుట

ఉ. బాధితశత్రుపక్షు లగు పాండుకుమారులదుఃఖసాత్త్వ మ
ర్యాదము లైనపాలనశాధిపనూనులయొద్ద నష్టు డు
ర్యోధనుఁ డాదిగాఁగ సుతు లున్న సభన్ విని దుఃఖతాత్ముఁ డై
యాధృతరాష్ట్రుఁ డా పలికి నట్లును జేయ వివిధప్రలాపుఁ డై.

వ. మఱియు గాంధారిం దొట్టి దేవీజనులయాక్రందనధ్వను లొక్కపెట్టయంతఃపురంబున నెగసె భీష్మాది కురువృద్ధులును విప్రులుం బౌరులును శోకాక్రాంతులయిరి విదురుండు పాండవుల కుశలస్థితి యెఱింగియు నెఱుంగనియ ట్లుండెం

గలసి దుఃఖితుండపోలె నుండె నంత ధృతరాష్ట్రుండు గొడుకులుం దానును బాంధవులును గుంతీపాండవులకుదక దానంబుసేసి సంస్కారాది పరలోకక్రియలు గంగాతీరంబునం జేయ సమకట్టించి తగువారి బ్రాహ్మణుల నపార ధనంబులతోడం బుచ్చిన,

క. మతిఁ బాండుకుమారులపం,చత విని దుర్యోధనుండు సంతసపడియెం
హితుఁ డయినవృకోదరుపం,చత కెంతయు జాతదుఃఖ చంచలుఁ డయ్యెన్.

వ. అట పాండవులును భాగీరథి లంఘించి దక్షిణాభిముఖులయి మారుతమార్తాండ మరీచిగోచరంబు గానిగహనంబున నరుగుచు నధికక్షుత్పిపాసా పరవశులయి నడవనోపకయున్న నెప్పటియట్ల యందఱనెత్తికొని వాయుతనయుండు వాయువేగంబునఁ జని సాయాహ్నంబున నొక్కవట మహీజాతశీతల శిలాతలంబున నునిచి దానియగ్రవిటపం బెక్కి నీ రారయు చున్నంత ననతిదూరంబున.

మ. ప్రమదాపాదిపయఃప్రపూర్ణ మిదియో పద్మాకరం బంచుఁ ద
త్కమలామోదసుగంధిమారుతము వీఁకన్ ము న్నెఱింగించినన్
రమణం బిల్చె సరోవరం బనిలజున్ రాజీవరాజీవన
భ్రమదాళివ్రజచక్రవాకబకహంసక్రౌంచనాదంబులన్.

వ. ఆదిక్కున కొక్కక్షణంబ యరిగి యక్కొలను గని యందుఁ గృతావగాహనుండై కడుపునిండ నీళ్లుద్రావి యచ్ఛిద్ర కమలపత్త్రపుటికల నీళ్లుగొని భీముఁడు గ్రమ్మఱి వచ్చునంత.

క. ధరణీదిశాప్రసారిత, గురుకరనికరంబు లుడిచి కొని దీర్ఘనిరం
తరగతి ఖిన్నుఁడపోలెను, హరిదశ్వుఁడు విశ్రమించె నస్తాద్రిదరిన్.

ఉ. అంబురుహాప్తుఁ డస్తశిఖ రాంతరితుం డగుడున్ సమస్తజీ
వంబులు నెల్లచో నిజని వాసముఁ బొందు నెడం దమిస్రపుం
జంబులపోలె వెల్వడియె శైలవిశాలగుహాలినుండి నా
గంబులయూథముల్ సఘన ఘానపరిగ్రహణోత్సుకంబులై.

## భీముఁడు నిద్రితులైన జననీసోదరులం జూచి చింతిల్లుట

వ. భీమసేనుండును దద్వటవృక్షంబుక్రింద నధికపథిశ్రాంతులయి పయిపుట్టంబులు పఱచుకొని తమ బాహుదండంబులు దలగడలుగా నిద్రితులయి యున్న సహోదరులం దల్లినిం జూచి తరమదుఃఖితుండై యాత్మగతంబున.

క. త్రిభువనసామ్రాజ్యశ్రీ, ప్రభుఁ డగుధర్మాత్మజుండు ప్రాకృతజనున
ట్లభిరూక్షితలంబున ని ట్లభిభూతుం డగునె నిద్ర నతిఖిన్నుం డై.

సీ. కుంతిభోజాధిపు కూఁతురు వసుదేవు,చెలియలు మఱియు విచిత్రవీర్యు
కోడలు కౌరవ కులవిభూషణుఁ డైన, పాండుమహాదేవి పరమధర్మ
పరులైనకొడుకులఁ బడసినయది పుష్ప,సుకుమారతరమూర్తి శుచిపరార్థ్య
శయనతలంబున శయనించియును నిద్ర, వోవనియది డప్పిఁ బొంది కటికి

ఆ. నేలఁ గండ్లు లొత్త నిద్ర వోయినయది, తల్లికంటె నిద్రఁ దగిలి సుతులు
వాల్మ్రుగముల ఘోర వన మని వగవక,మఱచియుండి రేమి మాడ్కి యొక్కొ

వ. వీరికి నిద్రాభంగము సేయనోపఁ దమకుం దారమేల్కని నీళ్లు ద్రావుదురుగాక యనియక్కమలపత్త్రపుటికల నీళ్లి మ్ముగా సంగ్రహించి వెండియుం దనమనంబున.

క. ఖలుఁ డై ధృతరాష్ట్రుఁడు పు,త్త్రులు దానును గూడి మమ్ము దూరస్థులఁగా
నిలు వెలువరించి లాక్షా,నిలయంబున నునిచెఁ బాప నిష్ఠితబుద్ధిన్.

క. కులపాంసను లయి యహితం,బులు సేయుచు నుండుచుట్ట ములఁ బొందక యి
మ్ములు నుండువాఁడ పుణ్యుఁడు, వెలయఁగ గ్రామస్థితైక వృక్షముపోలెన్.

క. పరహితబలవంతులు సు,స్థిరమూలాన్వితు లపాప ధీరతులు పర
స్పరసంశ్రయమున జీవిం,తురు మనుజులు వనములోని ద్రుమములపోలెన్.

వ. అని ధృతరాష్ట్రు బాంధవత్వంబు నిందించుచు నిబిడాంధకార నీరంధ్రంబులయిన దిశలు సూచియున్నంత జనరథ వంబు దప్పుల వీతెంచిన ముందటం బురంబు గలుగవలయు నిచ్చోట నేమఱి యునికి యుచితంబు గాదని. ★



# అమరజీవి

## బి. విద్యాసాగర్

వీధిలో సన్నాయి మేళం వినిపిస్తోంది.

రాజశేఖరంగారు చదువుతున్న పేపరు అక్కడ పడేసి, గబగబా వరండాలోకి వచ్చారు. కొంత దూరంలో పెళ్ళివారి వూరేగింపుజనం ఆగివున్నారు. ఆ జన సమూహంలో, చక్కగా అలంకరింపబడిన పల్లకీ దీపాలకాంతిలో స్పష్టంగా కని పిస్తోంది. అందులో నూతన వధూవరులు ముచ్చటగా కూర్చునివున్నారు.

రాజశేఖరంగారి మనస్సు కొద్దిగా చివుక్కుమంది. ఆయన కేవో పాతకాలం నాటి జ్ఞాపకాలు గుర్తుకొచ్చినాయి. కానీ, ఆయన పెళ్ళివారివంక చూస్తూ వాటి నన్నిటినీ మరచిపోవటానికి ప్రయత్నిస్తున్నారు. ఇంతలోకి, ఆయన మనస్సుకు యేదో చటుక్కున తోచింది. తనుకూడా "ఊరే గింపు"లో కాసేపు అలా తిరిగివస్తే బాగుండు ననిపించింది. ఎప్పుడూ మనస్సుకు చికాకు పరిచే సమస్యలగురించి ఆలోచించకుండా, కాసేపు అన్నింటినీ మరిచి నలుగురిలోనూ కలిసిపోకపోతే, మానవుడికి జీవితం దుర్భర మయిపోతుంది. అందుకే రాజశేఖరంగారికి కాసేపు సరదాగా తిరిగివద్దా మనిపించింది. నిజానికి, ఆయన యిలాంటి పెళ్లి వూరే గింపులు ఎన్నో చూశాడు. కానీ యెప్పటి కప్పుడు నూతనవధూవరులను చూస్తూవుంటే, యేదో అనూహ్యమైన ఆనందం కలుగుతుంది.

ఆయన యిలా ఆలోచిస్తూవుండగానే, కాంతమ్మగారు వాకిట్లోకివచ్చింది. వస్తూనే "ఏమిటండీ! అలా చూస్తున్నారు?" అంది.

"ఏమీలేదు! మన సందు చివర కని పిస్తోందే! ఆ వూరేగింపు యెవరిదా అని..."

"అదా!... మన వెంకట్రామయ్యగారు వాడుకు పెళ్ళిచేశాడు కదండి. మనకు శుభ లేఖకూడా వచ్చింది. మీకు జ్ఞాపకం లేదూ—?"

"అవునవును! జ్ఞాపకంవచ్చింది. జానకి రాముడి పెళ్ళికదూ!" అని కొంత ఆగి "వాడికి యిప్పుడెన్నేళ్లు" అని అడిగారు.

"ఇరవై యేళ్ళుంటాయనుకుంటాను. మన రాజూ, వాడూ వొక ఈడు వాళ్లే!" అంది.

రాజశేఖరంగారి మనస్సు కలుక్కుమంది. 'రాజూ' అని అస్పష్టంగా తనలోనే గొణుక్కున్నారు. అవును! రాజూ బ్రతికి వుంటే యిప్పుడు వాడికి యిరవై యేళ్ళు వుండేవి! తనుకూడా ఈపాటికి వాడిపెళ్ళి జరిపించేవాడు......రాజును గురించిన జ్ఞాప కాలు, శేఖరంగారి మనస్సులో గజిబిజిగా అల్లుకుంటున్నాయి.

పెళ్ళివారి పల్లకీ మరింత దగ్గరకు వచ్చింది. ఇప్పుడు వధూవరులు బాగా కనిపిస్తున్నారు. జానకిరాముడి ముఖంలో యేదో క్రొత్తకళ గోచరిస్తోంది. సతీసమేతుడైన శ్రీరాముల వారిలాగా వున్నాడు. రాజశేఖరంగారు, జానకిరాముడిని చూడటం యిది మొదటి సారికాదు. అతనిని చిన్నప్పటినుంచి బాగా ఎరుగును. కానీ, ఈరోజున జానకిరాముడి ముఖంలో యేదో ప్రత్యేకత వుంది. మధు పర్కాలలో అతను చూడటానికి ముచ్చటగా వున్నాడు. సిగ్గుపడుతున్న నవవధువువంక జానకిరాముడు కొంటెగా చూస్తున్నాడు... రాజశేఖరంగారు యిదంతా చూస్తూనే వున్నారు. ఆయన కేదో అవ్యక్తమైన ఆనందం కలిగింది. తన కుమారుడు రాజును జానకిరాముడిగా వూహించుకుని తృప్తిపడ టానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ అలాంటి అనుభూతి ఆయన కాసేపుమాత్రమే అనుభ వించగలిగారు. తర్వాత రాజునుగురించిన జ్ఞాపకాలు స్మృతిపథంలో మెరసినాయి.

"మనంకూడా వారితో అలా తిరిగి వద్దామా!" అంది కాంతమ్మ క్షణంసేపు ఆవ రించుకున్న నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ.

శేఖరంగారు వులిక్కిపడ్డారు. ఏమిచెప్ప టానికీ తోచలేదు.

"సరే! దానికేమి! అలాగే వెళ్దాము" అన్నాడు చివరికి.

"అయితే పదండి! మీ వుత్తరీయం తెచ్చి పట్టుకొస్తాను" అంది లోపలకు పోతూ.

రాజశేఖరంగారికి ఆశ్చర్యమేసింది. ఆమెలో పుత్రశోకము నశించిపోయిందా అనిపించింది, పెళ్ళివారిని చూస్తుంటే, తనకు రాజు జ్ఞాపకం వస్తున్నాడు. కానీ తన భార్యకు వారిని చూస్తుంటే ఎటువంటి అనుభూతి కలుగుతున్నదో వూహించ లేకుండా వున్నాడు.

కాంతమ్మ వుత్తరీయం తీసుకువచ్చి యిచ్చింది. కాని, శేఖరంగారు దానిని తీసుకుని కుర్చీలో కూలబడ్డారు.

"ఏమిటి మళ్ళీ కూర్చున్నారు," అంది.

"ఏమీలేదు! నాకెందుకో ఈరోజు మనస్సు బాగాలేదు" అన్నాడు.

"నాకూ అలాగే వుందండీ" అంది ఆవిడ కంట తడిపెడుతూ.

రాజశేఖరంగారి మనస్సు యిక అక్కడ లేదు. పెళ్ళివారివంక చూస్తున్న కొద్దీ స్మృతి పథంలో రాజు మరింత సన్నిహితు డవు తున్నాడు.

* * *

అయ్యో! రాజు బ్రతికివుంటే, ఈపాటికి అతనికి యిరవై యేళ్ళు వుండేవి, తండ్రి ముచ్చటగా ఈపాటికి కుమారుడికి పెళ్ళిచేసి ఆనందించేవాడు. కాని విధి బలీయమైంది. తండ్రిని కుమారుడిని వేరుచేసి రాజశేఖరం గారి జీవితంలో నిప్పులు కురిపించింది.

ఈరోజు జానకిరాముడిని చూస్తుంటే, శేఖరంగారికి రాజు బాగా జ్ఞాపకం వస్తున్నాడు.

సరిగ్గా ఈ పెళ్ళికొడుకు అంతే వుంటాడు. పొడుగ్గా, లావుగా వుండేవాడు. అతని కళ్ళలో ఏదో జ్యోతి ప్రకాశిస్తున్నట్లు వుండేది.

రాజు అందంగా వుంటాడు. ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూ విహరిస్తూ వుంటాడు. అతను ధోవతి కట్టుకుని, సిల్కులాల్చీ వేసుకుంటే, రాజశేఖరంగారికి ముచ్చటవేస్తుంది.

ఒకరోజు శేఖరంగారు,—ఈరోజులాగానే — కుర్చీలో కూర్చునివున్నారు. ఆవేళ లెనిన్ వ్రాసిన వొక గ్రంథాన్ని చదివి, దానినిగురించే ఆలోచిస్తున్నారు. ఇంతలో రాజు అక్కడికి వచ్చి

"ఏమిటి నాన్నా! ఆలోచిస్తున్నారు" అన్నాడు.

"ఏమీలేదు! లెనిన్ అభిప్రాయాలను గురించి ఆలోచిస్తున్నాను."

తర్వాత కాసేపుదాకా, వారిద్దరిమధ్యా, లెనిన్, మార్క్సుల సిద్ధాంతాలనుగురించి చర్చ జరిగింది. రాజశేఖరంగారికి యిలాంటి చర్చలలో పాల్గొనటమంటే సరదా! రాజు చాలా హుషారుగా మాట్లాడుతాడు. కానీ ఆ హుషారు ఎక్కువసేపు లేదు. కాసేపటిలోనే, అతను మనస్సులో ఏదో 'మధన' పడుతున్నట్లు కనిపించాడు. తండ్రి యిది గమనించాడు.

"ఏమిటి బాబూ! ఏదో సీరియస్‌గా ఆలోచిస్తున్నావు"

"అహఁ! ఏమీలేదు" అన్నాడు రాజు వులిక్కిపడుతూ.

"ఏమీ లేకపోవడమేమిటి! ఇందాకటి నుంచి చూస్తున్నాను. నువ్వు పరధ్యానంగా మాట్లాడుతున్నావు—నీకు నాదగ్గర సంకోచమెందుకు? నీ మనస్సులో వున్నదేదో నాకు చెప్పు బాబూ!" అన్నారు రాజశేఖరంగారు.

"ఏమీలేదు నాన్నా! మీతో వొక ముఖ్యవిషయం మాట్లాడుదామనుకుంటున్నాను"

"ఏమిటది! సంకోచించకుండ చెప్పు!"

"ఏమీలేదు! గోవా విముక్తికోసం సత్యాగ్రహం జరగబోతోంది. నేను అందులో పాల్గొందామనుకుంటున్నాను."

రాజశేఖరంగారు ఆశ్చర్యపోయారు. కానీ మరుక్షణంలోనే ఆనందించారు. తన కుమారుడు అంతటి సాహసానికి పూనుకుంటాడని ఆయన ఎన్నడూ అనుకోలేదు. రాజుకు యిలాంటి ఆలోచన కలగడం నిజంగా పూర్వజన్మ సుకృతం అనుకున్నారు. రాజుకూడా భారతదేశపు వీరుల జాబితాలలోకి ఎక్కుతాడు. అతని చరిత్ర కూడా సువర్ణాక్షరాలలో లిఖించబడుతుంది. తరతరాలుగా, గోవా స్వాతంత్ర్యవీరులతో, రాజుపేరుకూడా పలుగురు చెప్పుకుంటారు. అతని ఖ్యాతి దేశమంతటా వ్యాపిస్తుంది.—



# ★ అమరజీవి ★

రాజశేఖరంగారు అంతవరకు వూహించారు. కొడుకుని నిరుత్సాహపరచటం ఆయనకు అవివేకమనిపించింది. అందుకే, ఆయన ఈవిషయం భార్యతోనైనా సంప్రదించకుండా తన అంగీకారం తెలియజేశారు.

రాజు ఏదో పనిమీద బజారువైపు వెళ్లిపోయాడు. శేఖరంగారికి ఈ రోజు ఎంతో ఆనందంగా వుంది. తన కుమారుడు కూడా ప్రయోజకుడయ్యాడు. అంతా సవ్యంగా జరిగితే, గోవాను సామ్రాజ్యవాదుల బంధనాలనుండి విముక్తిచేసి, విజయలక్ష్మిని చేపట్టి తిరిగి వస్తాడు. అప్పుడు మనదేశములోని ప్రజలంతా వీరులను సన్మానిస్తారు. నల్గురూ వారి గురించే చెప్పుకుంటారు. అప్పుడు ఈ వూరేమిటి? దేశమంతటికీ రాజుపేరు తెలిసిపోతుంది. అంతేకాదు! నలుగురూ, అప్పుడు తనను గౌరవంగా చూస్తారు. వీరపుత్రుడి తండ్రికావటం కూడా అదృష్టమే!

ఏపని చేసినా, కీడెంచి మేలెంచమన్నారు. అందుకే రాజశేఖరంగారు మొదట రాజు వెళ్లటానికి వొప్పుకోలేదు. కానీ, రాజుయొక్క ఉత్సాహం, అతని ధైర్యం చూశాక, వద్దనటానికి మనసొప్పలేదు.

ఆరోజు రాత్రి రాజు తల్లికి చెప్పకుండా వూరువిడిచి వెళ్లిపోయాడు. ఆవిడకు తెలిస్తే గోల పెడుతుందని అతనికి తెలుసు. అందుకే ఆవిడ నిద్రపోతూ వుండగా, తండ్రిని లేపి, ఆయనతో చెప్పి వెళ్లిపోయాడు. రాజశేఖరంగారు కుమారుడిని దీవించి పంపించాడు.

మర్నాడు కాంతమ్మగారు, కొడుకు కనపడటం లేదని గోలపెట్టింది. రాజశేఖరంగారు మాత్రం నిండు కుండలాగా, యేమీ తొణకకుండా, ఆవేళకు తనకుతోచిన సమాధానం చెప్పి వూరుకున్నాడు.

* * *

ఆగస్ట్ 15-వ తేదీన కొంతమంది వలంటీర్లు గోవాలో ప్రవేశించారు. తర్వాత యేమి జరిగిందీ వివరంగా చెప్పనవసరం లేదు.

ఆ రోజు రాత్రి రాజశేఖరంగారు రేడియోలో వార్తలు విని కుప్పలాగా కూలిపోయారు. రాజు తుపాకి కాల్పులలో మరణించినట్లు రేడియోలో చెప్పారు. తనకుమారుడే! సందేహం లేదు! పూర్తిపేరు కూడా చెప్పారు.

రాజశేఖరంగారు చాలాసేపటి వరకూ తేరుకోలేకపోయారు. తర్వాత మెల్లగా లేచి, భారంగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లి భార్యకు ఈ విషయం చెప్పారు. ఆవిడ గొల్లుమంది.

"అయ్యో! నారాజు!—నాతో చెప్పకుండా పోయావేమి చిట్టితండ్రి!...నాతో చెప్పివుంటే, నిన్ను పోనిచ్చేదాన్నా!" అంటూ పెద్దపెట్టున ఏడవటం మొదలుపెట్టింది. ఇది విని, పక్కయిళ్లలో వున్న నలుగురూ అక్కడకు చేరారు.

అంతా విషయం తెలుసుకుని, చాలా దుఃఖించారు. కానీ లోలోన వారు కొంతవరకూ ఆనందించక పోలేదు. తమ గ్రామానికే ఖ్యాతి తెచ్చిన రాజు పేరును స్మరించుకుంటూ, తమ మనస్సులోనే, అతనికి శ్రద్ధాంజలి ఘటించారు. కొంతమంది రాజశేఖరంగారిని చూసి ఈర్ష్య కూడా పడ్డారు. ఇది చాలా విచిత్రమైన సంగతి! రాజులాగా తమ కుమారుడు కూడా ధైర్యం చేసి గోవాకు వెళ్లలేదేమని విచారించారు. అలా విచారించినవారి సంఖ్య చాలాతక్కువ. చూస్తూ చూస్తూ కుమారుడి ప్రాణాలను బలి యివ్వడానికి ఎవరు సాహసిస్తారు?

రాజశేఖరంగారు పుత్రశోకంతో అమితంగా దుఃఖిస్తూకూడా, వొకచెంప కొద్దిగా మనస్సులోనే ఆనందించారు. తను కన్న కలలు ఫలించినాయి. తన కుమారుడు వీరుడైనాడు. అమరజీవి అయి ప్రజల స్మృతిపథంలో శాశ్వతంగా నిలిచిపోయినాడు. ఇక తనకు కావలసిందేముంది? తనపేరు వూళ్లో నలుగురూ చెప్పుకుంటారు. అందరూ తనను గౌరవంగా చూస్తారు. ఈ భావన ఆయనలో కలుగగానే, వస్తూన్న దుఃఖాన్ని దిగమ్రింగుకున్నాడు.

కాంతమ్మగారి చుట్టూ ఆడవాళ్లు చేరి రాజు అకాలమరణానికి తమ సానుభూతి తెలియజేశారు. ఇది ఇలావుండగా, రాజశేఖరంగారు, తనను పలకరించడానికి వచ్చిన వారితో మెల్లగా అసలు విషయం చెప్పేశాడు. అది విని వారంతా ఆశ్చర్యపోయారు. కుమారుడికి ధైర్యంచెప్పి, ఇలాంటి వుద్యమాలలో పాల్గొనమని పురికొల్పే తల్లిదండ్రులు ఎంతమంది వుంటారు? రాజశేఖరంగారు ఇలాంటి సాహసానికి పూనుకున్నాడంటే, ఆయనను నిజంగా అభినందించాలి. ఒక వీరుడిని కన్న గౌరవం ఆయనకు దక్కింది. కొంతమంది ఈవిధంగా అనుకున్నారు. మరికొందరు రాజశేఖరంగారు చాలా తెలివి తక్కువపని చేశాడనీ, అన్యాయంగా కుమారుడిని దేశంకోసం త్యాగం చేశాడనీ అన్నారు. "అంత కీర్తి కావాలని అనుకున్నవాడు తనే పోలేకపోయాడూ?" అని ఆయనను మనస్సులోనే నిందించారు.

కాంతమ్మగారు ఇంకా ఏడుస్తూనేవుంది. చూడవచ్చిన ఆడవాళ్లు ఒక్కొక్కరూ వెళ్లిపోయారు. రాజశేఖరంగారు మాత్రం అసలు విషయం భార్యకు చెప్పలేదు. చెబితే యేం కేమైనా వుందా?...

మర్నాడు సాయంత్రము శేఖరంగారు క్లబ్బుకు వెళ్లారు. కొంతమంది మంచి వుషారుగా చీట్లపేక ఆడుకుంటున్నారు. రాజశేఖరంగారు అక్కడకు వెళ్లకుండా తలుపు చాటునవుండి వారిమాటలు వింటున్నాడు. వారు తన విషయమే మాట్లాడుకుంటున్నారు.

"ఆయనేదో పెద్ద ఘనకార్యం చేశాననుకుంటున్నాడు. నిన్న వాళ్లయింటికి వెళ్తే అసలు విషయం చెప్పాడు. ఆయనే రాజుకు ధైర్యం చెప్పి, పంపించాడట!.. ఇంతకంటే విచిత్రం యేమైనా వుంటుందా! చూస్తూ చూస్తూ ఏ తండ్రి అయినా కొడుకుని బలియిస్తారుటండీ?" అంటున్నాడు ఆనందరావు.

"అదేనండీ! నాకూ అర్థం కాకుండా వుంది. అంత కీర్తికోసం తహతహలాడేవాడు తనే పోలేకపోయాడా?" అంటున్నాడు వెంకట్రామయ్య.

రాజశేఖరంగారు యిక అక్కడ వుండ

(44-వ పేజీ చూడండి)

# నక్షత్రఫలితాలు

**[25 3-59 మొదలు 31-3-59 వరకు]**

## గ్రహ స్థితి.

| కే బు ర | శు | కు | |
|---|---|---|---|
| | తే 29 దీని కుజుడు మిధునములో ప్రవేశించును. కన్య, తుల, వృశ్చిక ధనస్సులలో చంద్రుడు | | |
| శ | గు | | రా |

### * అశ్వని [చూ, చే, చో, లా] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. రాబడి తక్కువ. గృహావసరములు తీరక కలతలు. ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనబడగానే ఔషధచికిత్స పొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతిచేయించుట మేలు. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. 25 అనారోగ్య సూచనలు. 27, 28, 29 పితృవర్గ సహాయము, కార్య లాభము, ప్రయాణము. 31 రాజకీయవాదులకు ఆందోళన, అధిక ఖర్చులు.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీకు మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్థులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు ఇబ్బందులవల్ల చదువు సాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్రసహాయము కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్ర వస్తుసంపాదనవంటి శుభయోగములు కూడా వుంటాయి.

### * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. మీ బుద్ధిబలము సువయోగించి ప్రయత్నించినా కార్యసిద్ధి వుండదు. చేతికివచ్చేడబ్బు అవసరములకు చాలక ఇబ్బందిచే అశాంతిగా వుంటుంది. మారకుండున్న ఆత్మీయులకు అనారోగ్యముగా వుందని తెలిసి వ్యథపడతారు. అయినను దైవానుగ్రహముచే అన్నీ సరిపడతాయనే మనోధైర్యముతో వుంటారు. ఉద్యోగస్థులకు అస్థిమితము. వర్తకులకు ఆందోళన. 25 నిలకడలేని స్థితి. 26 ప్రయాణము. 27,28,29, నష్టద్రవ్యప్రాప్తి, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, వింతలను చూచుట. 31 ఆరోగ్య-చింత.

### * రోహిణి [ఓ, వా, వి, వూ] *

ఈ వారము అనుకున్నట్టుగా డబ్బు చేతికి రాకపోవుటచేతను అధిక ఖర్చుల చేతను అశాంతి కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు కొంతవరకు అనుకూలిస్తవి. ఉద్యోగస్థులకు అధికారుల తొందరలు. వర్తకులకు అశాంతి.

---

## బి. నరసింగరావు

---

భార్యకు ఆరోగ్యము బాగుండదు. వ్యవహారముల పరిష్కారములో దుష్టస్త్రీలతో వివాదము. విద్యార్థులకు చదువుపై అనాసక్తి. అధిక కార్యభారము. త్రిప్పట, 27, 28, 29 ధన లాభము. కార్యసిద్ధి. 31 వివాదములు, భార్య అనారోగ్యము.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

తలపెట్టిన పనులు మీద వేసుకొని, కార్యసాధన అవసరపుటికి నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు ఫలమును పొందుతారు. సోదర సహాయము కొంత అనుకూలత కలిగిస్తుంది. ఉద్యోగస్థులకు అధికారుల చురుకుమాటలచే మనోవ్యథ కలుగుతుంది. అవసరాలు తీరనందున ఇంట్లో అశాంతి. ప్రమాదములవల్ల గాయములు కలుగవచ్చును. రసాయనిక పదార్థములు, ఎరువులు వ్యాపారస్థులకు, గనుల యజమానులకు లాభము. 25 కార్యభారము, ఆటంకములు. 26, 27, 28 సోదర సహాయము, కార్య లాభము 31 ప్రమాదసూచన.

### * ఆర్ద్ర [కూ, ఘ, ఙ, ఛ] *

ఈ వారము మీకు రోగకాలము. బంధు సహాయము అధికారుల సహాయము కలుగుట చేతను ఆటంకములను గడిచి కార్యలాభము పొందుతారు. ఆదాయాభివృద్ధి కలుగుతుంది. కవులు నూతన రచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము.

### * పునర్వసు [కే, కో, హా, హి] *

ఈ వారము మీకు మంచి భాగ్యయోగ్యము. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల బాగుకొరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థాన ఉద్యోగస్థులకు, న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

### * పుష్యమి [హూ, హే, హో, డా]

ఈ వారము మీకు యోగదాయకము ధనయోగంవుంటుంది. సంగీత సభలు కవితా గోష్ఠివంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్న భోజనము వెండిపాత్రలలో చేస్తారు. శుభకార్యాలలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది.

### * ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము రోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభకరముగా ముగుస్తవి. శుభ, పుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహ నిర్మాణమునకు ప్రయత్నిస్తారు. ఉద్యోగస్థుల హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువలాభము. వారమంతా శుభయోగములతో కూడియున్నా కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. వారమంతా కుటుంబమున స్త్రీలతోనూ, మిత్రులతోనూ విందూవినోదము.

### * మఖ [మా మీ మూ మే] *

ఈ వారము రాబడి తక్కువ. కార్యభారము ఎక్కువ. గృహావసరములు తీరక స్పర్థలు వస్తవి. అనారోగ్య సూచనలు కనపడగానే ఔషధ చికిత్స పొందడము, రవికి శాంతిచేయడం మంచిది. ఉద్యోగస్థులకు క్రొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో కూడి వున్నా పితృవర్గమునుండి సహాయము. కార్యలాభము కలుగుతవి.

## ఈవారపు ధరలు:

నూలు, వస్త్రములు :-మార్పు లేదు.
నూనెదినుసులు:-నిలబాటుగావుండును.
ఆహారధాన్యములు:-మార్పు లేదు.
బెల్లము, పంచదార:- సమస్థాయి నుం డును.
చింతపండు:-స్వల్పముగాతగ్గును.
పప్పుదినుసులు :- మార్పు లేదు.
వెండి, బంగారము :-మార్పు లేదు.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మ నక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) * (మో, టా, టీ, టూ)

ఈ వారము మొదట్లో నిరాశగా వున్నా మిత్ర సహాయమువల్ల కార్యలాభము అవుతుంది. ధనలోపమువల్ల ఆందోళన, యింట్లో వున్న వారి అనారోగ్యమువల్ల అశాంతి కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమున లాభము. వారమంతా ఉద్రేకముతో ఉంటుంది. విదేశీయుల పరిచయము అపూర్వ ధన సంపాదన కలుగుతవి. 31 వ తేదీని అధిక ఖర్చులు, మనోవ్యథ.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) * (టే, టో, పా, పీ)

ఈ వారము ఆశించిన సహాయము లభించక అవసరములు తీరక, ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, వర్తకులకు చాంచల్యము. పుణ్యపురుషుల సాంగత్యము వలన మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగా యున్నా నష్టద్రవ్యలాభములు పొందుతారు. 31 న అధిక ఖర్చులు.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము అనుకూలతకన్నా ప్రతికూలత ఎక్కువ. ఇచ్చి పుచ్చుకోనేపట్లనివాదములు వచ్చి, మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలించినా, అమిత ఖర్చులవల్ల సంతోషముండదు. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, జొన్నలు, రాగులు, ఉప్పు, సాపులు, నూనెవ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది. 31 న బంధువులరాక అధిక ఖర్చులు.

### * చిత్త [పే, పో, రా, రి] *

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్న కార్యాలకి ఆటంకము కలుగుతూనే వుంటుంది. అయినప్పటికీ పట్టుదలవల్ల కార్యలాభము పొందుతారు. సోదరసహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలు తగిలే ప్రమాదములు జాగ్రత్తవల్ల తప్పవచ్చు. గనుల యజమానులకు, లోహ, ఖనిజ, వ్యాపారస్తులకు, భూస్వాములకు, కష్టముతోగూడిన లాభము. పోలీసుశాఖ ఉద్యోగస్తులకు మేలుకాలము. 31 న ప్రమాదసూచన.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమ సమాచారము. తెలుస్తుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. బంధుదర్శనము, గణిత జ్యోతిషశాస్త్ర చర్చలు జరుగుతాయి. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచువర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. 31 న అధికఖర్చులు.

### * విశాఖ [తీ, తూ, తే, తో]

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికివస్తుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతవి. పుణ్యకార్యాచరణ ప్రభుత్వ సన్మానము, వైద్యజ్యోతిషశాస్త్రములవంటి ప్రసంగాలు జరుగతవి. విద్యార్థులు నూతనాకంలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగావున్నా కొంత ఆందోళనకూడా వుంటుంది. పిల్లల అభివృద్ధికి కొన్ని ఏర్పాట్లు చేస్తారు.

### * అనూరాధ [నా, నీ, నూ, నే]

ఈ వారము మీరు తలపెట్టిన కార్యములలో జయముపొందుతారు. వెండిపాత్రలలో మృష్టాన్నభోజనము బంధుమిత్రులతో చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి బియ్యము, ద్రవపదార్థజనిత వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభదాయకము. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము 31 న అధిక ఖర్చులు.

### * జ్యేష్ఠ [నో, యా, యి, యూ] *

ఈవారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి కలుగుతుంది. వివాహాది శుభకార్యాలలో పాల్గొంటారు. ఇష్టవస్తులాభము. పరోపకారంవల్ల కీర్తి కలుగుతుంది. విద్యార్థులకు చాలా చురుకుగా చదువు సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులు అమితలాభము పొందుతారు. వాహనయోగములు కలుగును. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీ

 # నక్షత్రఫలితాలు 

నటులకు యోగకాలము. 31 న కుటుంబ కలహము.

## • మూల [యే, యో, బా, బీ] *

ఈవారము కార్యభారము ఎక్కువ. వింత మాటలు వినుట పరాక్రమము వల్ల ఘనత, ప్రయాణము ధనలాభము వుండును. అకాల భోజనమువల్ల అనారోగ్యసూచనలు కనపడ గానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 31 న అనారోగ్యం.

## *పూర్వాషాఢ [భూ, ధ, ఫా, ఢా]*

ఈవారము తలపెట్టిన పనులు నెరవేరవు. అలక్ష్యము కలుగుతుంది. వర్తకులకు లాభము ఎక్కువ. ఆత్మీయుల ఆరోగ్యం చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వన పర్వత ప్రాంతములకు బదిలీ అయే సూచనలున్నవి. రహస్యములను కనిపెట్టుటకు వినియోగించ బడుతారు. వారమంతా చికాకుగా వున్నా వారాంతములో మిత్రసహాయము, విదేశీయుల పరిచయము, కార్యసిద్ధి జరుగును.

## *ఉత్తరాషాఢ [బె, బో, జా, జీ]*

ఈవారము ధనాభావము ఎక్కువ. ఎవరి సహాయంవల్ల కార్యసాధన చేదామనుకుం టారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయినా దైవబలంవల్ల క్రమేణా కార్యాను కూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు. వారమంతా ఎంత ఆందోళనవున్నా సాధుసజ్జన సాంగత్యము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, వింతలను చూచుట, నష్టద్రవ్యలాభము కలుగుతవి.

## • శ్రవణము [జూ, జే, జో, ఖా] *

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తవి. కోర్టుదావాలు అనుకూలిస్తవి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి పాపక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగా యుండదు. ఇచ్చి పుచ్చుకొనేపట్ల వివాదములు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వర్తకులకు వారమంతా నిరాశ. వారాంతమున లాభము. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

## • ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము ఎన్ని అవాంతరములువచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. ఆశించిన ధనం సమయానికందక అప్పు చేస్తారు. ఆత్మీయుల వల్ల నిందలపాలవుతారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు భూస్వాములకు ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, రంగులు లోహపు సామానుల వ్యాపారస్తులకు, కష్టముతో కూడిన లాభము 31 న ప్రమాదయం.

## శతభిషం [గో, సా, సీ, సూ]

ఈ వారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోను అధికారుల సహాయముతోను, ఆటంకములు గడిచి ఫలం పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. దైవజ్ఞ జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్య దిక్కునుండి క్షేమము తెలుస్తుంది. విద్యార్థులకు మంచి కాలము. కవులకు శిల్పులకు, గణితశాస్త్రజ్ఞులకు, నటీనటులకు యోగకాలము. 26, 27 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి.

## పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికి వస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో కొంత అనుకూలత వుంటుంది. పండిత గోష్ఠి జరిపిన విషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగము లున్నా కొంత ఆందోళనతో కూడి వుంటుంది. ధనలాభము పుత్రుల అభివృద్ధి, కార్యసిద్ధి 25 న అధిక ఖర్చులు. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలు కాలము.

## •ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]•

ఈ వారము వినోదములలో పాల్గొనుట దధి, క్షీరమధుర పదార్థయుక్త భోజనము రజతపాత్రలలో భుజించుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్త్రములుకొనుట, మొదలగు యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థ క్రయవిక్రయములలో వర్తకులకు, లాభము కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు మేలుకాలము వారాంతమున అధిక ఆందోళన.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము ధనధాన్యాభివృద్ధి, పశువృద్ధి, కృషి మూలకముగా లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తు లాభము. పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు రెట్టింపు లాభము. కవులకు గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము స్త్రీలతోనూ ఆప్తులతోనూ. విందు వినోదము 18 న కుటుంబకలహమునకు



# బాలసాహితి

## సప్తమాంకం



సర్వాలచే ఒక రోదన
సంఖ్యగ దూషింపబడే
సప్తమాంక ప్రాముఖ్యము
సవిస్తరముగా రచింతు!

గోపస్త్రీ పరివేష్టితు
డాపద్బాంధవుని కున్న
అలంకరణ సామగ్రులు
తెలుసుకొనుడు - వెరసి ఏడు!

కస్తూరీ, కౌస్తుభమూ,
నవమౌక్తికమూ, వేణువు,
కంకణమూ, హరిచందన,
ముక్తావళు లనెడి ఏడు!

శ్రీరాముని జన్మతార
తారలలో ఏడవదే!
లెక్కించుము పునర్వసును
అశ్వినితో మొదలుపెట్టి!

పరమాత్ముని కుక్షిలోన
పదునాలుగు భువనమ్ములు!
ఏడు ఊర్ధ్వలోకమ్ములు,
ఏడు అధోలోకమ్ములు!

"సప్త ద్వీపావసుంధ
రా" యను వాక్యమ్ము తెలుపు
ద్వీపమ్ముల సంఖ్యకూడ
ఏపుమీఱ ఏడేయని!

హిమాచలము, హేమకూట,
నిషధ, వింధ్య, మాల్యవంత,
గంధ మాదనమ్ము, పారి
యాత్ర మనే నగము లేదు!

కశ్యపుడూ, అత్రి, భర
ద్వాజుడు, విశ్వామిత్రుడు,
గౌతముడూ, జమదగ్ని,
వశిష్టుడూ సప్తఋషుల్!

లవణ, ఇక్షు, సురా, సర్పి,
దధి, క్షీర, జలార్ణవాల్
గురుగభీర సాగరాలు
వెరసి ఏడు - తెలుసుకొనుడు!

సర్వాల సమ్మోహపఱచు
సంగీతపు స్వరము లేదు!

ధర్మపరులు పాండవ సై
న్యపు టక్షౌహిణులు ఏడు!

ఆది, సోమ, మంగళ, బుధ,
లక్ష్మి, శుక్ర, స్థిరవారా
లేదుగ విభజించినారు,
ఎల్లరు తమ కాలమ్మును!

బాలల దసరా సరదా
పండుగ - మాసాలలోన
ఆశ్వయుజ మాసమౌను;
నెలలలోన ఏడవదది!

తిరుపతి పర్వతము లేదు!
హరిధనుస్సు రంగు లేదు!
పద్మప్రియుని హయము లేదు!
ప్రపంచమున వింత లేదు

కాని, పరక, అణా, బేడ,
పావు, అర్ధరూపాయీ
రూపాయీ నాణెమ్ములు
పాతవాటిలోన ఏడు!

ఒకటి, రెండు, ఐదు, పదీ,
పాతిక, యాభై, నూఱూ,
నయాపైస నాణెమ్ములు
క్రొత్తవాటిలోన ఏడు!

ఏడనగా ఒక్క అంకె!
ఏడన నొక వత్సరమగు!
తాతయ్యకు పదిఏళ్ళన
పదికావవి - పడి డెభ్భై!!

"వెలది, జూదమూ, పానమ్ము,
వేట, పలుకు ప్రల్లదమ్ము,
దండపు పరుసదనమ్మూ,
సొమ్ము నిష్ప్రయోజనముగ
వమ్ముసేత - అనెడి సప్త
వ్యసనమ్ముల జనదుతగుల"
అని చెప్పెను మును విదురుడు
శిరోధార్య మతని సూక్తి!

 "అతిక" 

# నిజమైన విలువ

అది శరత్కాలం. తోటల్లోనూ, ఉద్యానాల్లోను ఉన్న చెట్లన్నీ ఉదాసీనంగా ఉన్నాయి. వాటికి పూవులు లేవు. కాని తోటలో నున్న సరస్సులో మాత్రం ఒక అందమైన కమలం వికసించి ఉంది. అంతసుందరమైన కమలం వసంతంలో కూడా వికసించదేమో. ఆ పువ్వును చూడగానే తోటమాలి ఆనందం పట్టలేక పోయేడు.

తోటమాలి మనస్సులో ఇలా ఆలోచించేడు. "ఈ పుష్పాన్ని రాజుగారికి కానుక ఇస్తాను. వారికి పువ్వులంటే ఎంతో ప్రీతి. వారు ప్రసన్నులయితే నాకు ఘనంగా బహుమాన మిస్తారు." వాడా పువ్వుని కోసి పట్టుకొని రాజమహలు దగ్గర కెళ్లి, దర్శనానికి కాచుకొని నిలబడ్డాడు.

నగరానికి వెలుపల బుద్ధభగవానుడు 'వటవృక్షం క్రింద విశ్రమించి ఉన్నాడు. రాజమహలు మంగళ వాద్య ఘోషలతో ప్రతిధ్వనించుతున్నది. పూజాద్రవ్యాలతో నిండిన పళ్లేరాలు పట్టుకొని స్త్రీలు మంగళ గీతాలు పాడుతూ బయటకు వచ్చేరు. మహారాజు ప్రసేనజిత్తు భగవానుని దర్శనానికని బయలుదేరుతున్నాడు.

కమలంయొక్క వెయ్యిదళాలూ వికసించి ఉన్నాయి. తోటమాలి వాటిని చాలా శ్రద్ధతో అమరించేడు. అందులోని మకరందబిందు వొక్కటి క్రిందపడనియ్యలేదు. ఈ లోపున ఒక సెట్టి ఆత్రోవంట వచ్చేడు. ఆ పువ్వును చూచీచూడ్డంతోటే సెట్టికి దాన్ని కొనాలనిపించింది.

## సి. నాగభూషణరావు

తోటమాలిని సమీపించి యిలా గన్నాడు: "ఈ పువ్వు అమ్ముతావా? నేడు బుద్ధభగవానులవారు వచ్చారు. చెప్పు; ఎంతకిస్తావో, చెప్పు."

"ఒక చిన్నంయెత్తు బంగారం ఇస్తే ఇచ్చేస్తాను, అన్నాడు మాలి.

సరేనని సెట్టి దానికి సమ్మతించేడు.

ఆ సహస్రదళ కమలాన్ని చూసేసరికి రాజుగారికి చాలా కుతూహలం కలిగింది. మాలినిపిలిచి, "ఏ వెలకు దీన్నిస్తావు?" అని ప్రశ్నించేరు.

మాలి నమ్రతతో జవాబిచ్చేడు: "ఇప్పుడే సెట్టి బేరమాడి ఒప్పుకున్నాడు మహాప్రభో."

రాజు: ఏధర కేమిటి.

మాలి: ఒక చిన్నం ఎత్తు బంగారానికి.

రాజు: నేను పది చిన్నాలిస్తాను.

సెట్టి: అయితే నేను ఇరవై ఇస్తాను.

అలా చూస్తూఉండగానే కమలం యొక్క విలువ పెరిగిపోయింది. ఇంతట్లో తోటమాలి ఇలాగన్నాడు: "సెట్టిగారూ, క్షమించండి. మహాప్రభో, తాము మన్నించండి. నేనీ పువ్వు అమ్మను." దాంతో రాజూ, సెట్టీ నిరాశచెంది వెడలిపోయేరు.

తోటమాలి ఆ పువ్వునిపట్టుకొని అక్కడనుంచి బయలుదేరేడు. త్రోవంటపోతూ, బుద్ధభగవానుడికి కానుకగా దీన్ని ఇవ్వడానికి వారిద్దరూ ఇంత పోటీపడ్డారుకదా; బుద్ధభగవాను డెంతటి మహాత్ముడో! ఆయనకీపువ్వు నేనే ఎందుకీయకూడదు," అని ఆలోచించుకున్నాడు.

బుద్ధభగవానుడు వటవృక్షం నీడను పద్మాసనంపై కూర్చున్నాడు. వారి నుదుటిపై మహాజ్వాలతేజం, ముఖంలో శాంతీ రూపొంది ఉన్నాయి.

తోటమాలి తిన్నగా ఆ మహాత్ముని పాదాలవద్దకు వెళ్లి, క్రిందను కూర్చొని, శిరస్సు వంచుకొని,

ఆ కమలాన్ని సమర్పించేడు. చెట్లపై పక్షులు గానంచేయ నారంభించేయి. చల్లగాలి మెల్లగావీచి ఆ కమలం యొక్క పరిమళాన్ని నాలుగు దిక్కులా వ్యాపింపజేసింది. వాయు మండలమంతా సువాసనలతో నిండిపోయింది.

బుద్ధభగవానుడు ప్రసన్నుడయేడు. చిఱునవ్వుతో ఇలాగన్నాడు. "వత్సా! ఏమయినా చెప్పాలా—ఏమికావాలి నీకు?"

మాలి గద్గదస్వరంతో జవాబిచ్చేడు: "స్వామీ! ఏమీ అక్కర లేదు. మీ పాదధూళికణము మాత్రం కావాలి."

[ఒక హిందీకథ ఆధారంగా] ★

## ముందు జాగ్రత్త

రాముడు: ఒరేయ్, ఆకొత్త అబ్బాయి నన్ను 'ఫూల్' అన్నాడు.

భీముడు: 'ఫూల్' అంటే ఏమిట్రా?

రాముడు: అదే నాకూ తెలియలేదు. ఎందుకైనా మంచిదని ఒకటిచ్చుకున్నాన్లే

* * *

## అన్యాయం

రామారావు: "నేను రమణారావు అనే మారుపేరుతో కథరాసి పత్రిక్కి పంపించానోయ్."

సుబ్బారావు: "అన్యాయం. ఆ పేరుగల ఎన్నివందలమంది అమాయకుల్ని నిష్కారణంగా అనుమానిస్తారో చూడు."

అనగనగా ఒక మేక. అది మంద పోతోంది. పోయిపోయి ఒక అడ
నుండి తప్పుకొంది. అందిన ఆకు విలో ప్రవేశించింది. ఎదురుగా
లలముల్ని కొరుకుతూ అలా సాగి సింహం వస్తోంది. ఒళ్లు ఒక్కసారి











భయంతో కంపించిపోయింది మేక. ఇలా ఆలోచించింది: "నన్నెట్లాగూ సింహం చంపుతుంది. అయితే నా యుక్తి నన్ని చూస్తాను. పారితే మంచిదే. పారకపోతేనో! నన్ను చంపి తింటుంది. నన్ను గడ పన్నక పోయినా చంపేది ఖాయమేగా!" ఈ తలపు తలలో పొడమడంతోటే చెదరిన ధైర్యాన్ని కూడ దీసి కొన్నది. సింహం సమీపించగానే నమ్రతతో నమస్కారం చేసింది.

## రాచాబత్తుల
## వీరరాఘవయ్య

ముచ్చుకైనా భయం కనపడడంలేదు మేకలో.

'ఇదేమిటి మేక వైఖరి!' అని విస్తుపోతూవుంది సింహం.

"వింతపడే సమయం కాదండీ యిది. గొప్ప విపత్తు సంభవించబోతూవుంది మీకు," అని మేక అంది.

"ఇది ఒక అల్పజంతువు. పైగా నా సమీపాన వుంది. కొద్దిక్షణాల్లో నాకాహారం అవబోతూవుంది. దీని విపత్తునేమీ ఎంచకుండా నాకు విపత్తు సంభవించుతుం దంటోంది," అనుకొని సింహం మరింత వింతలోనయ్యింది.

"ఏమిటి నాకు సంభవించే విపత్తు" అని అడగడానికి నోరు

తెరవబోయింది: సింహం నోరుకద పక పూర్వమే మేక చెప్పడం ప్రారంభించింది "మృగరాజా! సావధానంగా వినండి. నేను రాజు గారి మేకను. మొన్న యీ అడవిలో నివసించే మనుష్యులొచ్చారు రాజు కడకు. వాళ్లు రాజుతో యీవిధంగా మొరబెట్టుకొన్నారు — 'రాజా! మీ పరిపాలనాకాలంలో యింత వరకు ఏ కష్టాలు ఎరగం మేము. కడుపులో నీళ్లు కదలకుండా హాయిగా బ్రతుకుతున్నాం. కాని యీ మధ్య ఒక సింహం మిత్తిలాగా అడవిలో ప్రవేశించింది. ఇప్పుడు బయటికిపోయిన మనుషులు మళ్లీ తిరిగి యింటికిరావడం అంటూ లేదు దొరా! ప్రాణాలపై తీపితో ఎన్నాళ్లని యింట్లో కూర్చోగలం? కూర్చుంటే పొట్టగడిచే దెట్లా? ఇప్పటికే ఒకళ్లనో యిద్దరినో పోగొట్టుకోని కుటుంబం అంటూ లేదు మా అడవి పల్లెల్లో. కాబట్టి తమరిక ఏమాత్రం ఉపేక్షించక వచ్చి ఆ సింహాన్ని మట్టుబెట్టితేనే గాని మేము బ్రతకలేము మారాజా!'

"రాజు వాళ్ల మొర ఆలకించాడు. ఇవ్వాళ తమను సంహారించేందుకై బయలుదేరి వచ్చాడు తగు సన్నాహంతో. నన్ను ఎలాగా విడిచి పెట్టారు," అని చెప్పి మేక వెనక్కి చూసింది వస్తున్నారేమో చూడ్డానికన్నట్టుగా. దానితోపాటు సింహమూ చూసింది.

"రావడం లేదులే," అని ఒక నిట్టూర్పు విడిచి చెప్పడం సాగించింది మేక మళ్లీ:

"ఇంతకీ చెప్పొచ్చిం దేమిటంటే, యిప్పుడుగనక నన్ను మీరు భక్షించేటట్లైతే, యిచ్చట మీరున్నారని గ్రహించి రాజు తన పరివారంతో యిచ్చటకు వస్తాడు; రాజు శక్తి మీకు తెలియదేమో! ఆయన కళ్లబడిన జంతువు ఏదైనా తప్పించుకు పోజాలదు.

"పోతే, నన్నిప్పుడు మీరు చంపకపోయిన పక్షంలో నేను తిరిగి రాజుదగ్గరకు వెళతాను. 'యీ ప్రాంతంలో సింహం లేదులే' అనుకొని రాజు యింకోవైపుకు వెళతాడు. అప్పుడు మీరిచ్చట స్వేచ్ఛగా విహరించవచ్చు.

"ఏదో నన్ను మీరు చంపకుండా విడిచిపెట్టేందుకు గాను నేనిట్లా చెబుతున్నా ననుకోకండి. ఎట్లైనా మా జంతుజాతికి రాజు మీరు. మీ క్షేమంకోరే నేనింతగా చెబుతున్నానని నమ్మండి. ఇవ్వాళ కాకపోతే రేపైనా నా బ్రతుకు బందలు కావలసిందే. ఇట్లా వేటలో ఉపయోగపడేటప్పుడు ఏ జంతువు

---

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక
# బాలల సంఘం

GROUP **A లేక B**

[సభ్యత్వపు దరఖాస్తు]

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) —

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు —
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు : —
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి: నెంబరు] —
* చదువుతున్న తరగతి, లేక, ఫారము : —
పాఠశాల పేరు : —
ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :

అర్యా:
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘంలో నన్ను సభ్యునిగా [illegible] చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

[తేదీ : -1959] (సంతకము)

* గమనిక: [illegible] 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా '[illegible]' అని వ్రాయాలి.

సంచిక: 25-3-59] ఈ దరఖాస్తు 28-3-59 నాటికి మాకు చేరాలి|

# ★ బుద్ధిబలం ★

కైనా ఎలాగైనా చాతమార్తాను. లేకపోతే రాజుగారికి నన్ను తినాలనే బుద్ధి ఎప్పుడు పుడితే అప్పుడైనా తప్పదుగదా నా చావు! కనక నేను చావునుండి తప్పించుకొనేందుకే యిలా చెబుతున్నానని మాత్రం పొరపాటు అర్థంచేసికోకండి. నామూలాన నా జాతికి ప్రభువైన మీ ప్రాణాలుపోవడం ఏమాత్రం యిష్టంలేకనే నేనింతగా చెప్పడం అది గ్రహించగోర్తాను—యిదీ అసలువిషయం—యిక తర్వాత మీ యిష్టం," అని చెప్పి ఆగింది మేక, సింహం ముఖంలోని భావాలను పరికిస్తూ.

కొంతతడవు సింహం ఏదో ఆలోచించి "సరే—వెళ్లు అన్నది.

"మీరు మాత్రం యీ ప్రాంతాన్ని విడిచి యింకోవైపు వెళ్లకండి" అంటూ మేక మరో నమస్కారబాణం వదలి వచ్చినదారి బట్టింది 'బ్రతికిపోయానురా' అనుకొంటూ.

చూశారా బాలలూ! మేక తన బుద్ధిబలంవల్ల ఎంతటి అపాయాన్ని గడిచి గట్టెక్కిందో! ★

# అమరజీవి

(34-వ పేజీ తరువాయి)

లేకపోయాడు. వచ్చిన తోవనే ఇంటిముఖం పట్టాడు. ఆయన మనస్సులో వెయ్యి సముద్రాలు పొంగి పొర్లినాయి. అగ్నిపర్వతం బ్రద్దలయి నిప్పులు కురిపించినట్లు, ఆయనను ఎవరో బలవంతంగా అగాధంలోకి త్రోసినట్లు ఆయన బాధపడ్డారు. తనను చూసి తానే అసహ్యించుకున్నాడు. తను పర్రి పిరికివాడు. తనకు ధైర్యంలేక కొడుకును పంపించాడు. అదేగా, నలుగురూ అనేమాటల్లోని ఆంతర్యం! ఇక తను బ్రతికుండి ఏమి లాభం? సంక్షుభితమైన ఈ సముద్రంలో తను ఇంక ఎన్నాళ్లు ప్రయాణం చేస్తాడు?

రాజశేఖరంగారు బరువుగా అడుగులు వేసుకుంటూ యింటికి బయలుదేరారు. దోవలో ఆయన మనస్సు స్వాధీనంతప్పి ఆయన చిన్ననాటి ముచ్చటలను జ్ఞాపకం చేస్తున్నది. సరిగ్గా పాతికేళ్ల క్రితం! అప్పుడు తనకు షుమారు యిరవైయేళ్లు వుండేవి... అప్పుడు తాను 'యిలాంటి' సంఘర్షణే ఎదుర్కొన్నాడు. ఆనాడు పలువురు దేశస్వాతంత్ర్యోద్యమంలో పాల్గొంటున్నారు. తనుకూడా ధైర్యంచేసి వెళ్దామనుకున్నాడు. కానీ తండ్రి అంగీకరించలేదు. అదీకాక, తనకానాడు మనస్ఫూర్తిగా వెళ్లాలనిలేదు. ఒకవేళ వున్నా, తను పిరికివాడు కావడం వలన, తనకు ధైర్యసాహసాలు లేవు. అందుకే, ఆనాడు తన తండ్రి వెళ్ళవద్దని వారిస్తే, తానేమి బాధపడలేదు..... కానీ ఈనాడు, తన కుమారుడు దేశంకోసం త్యాగం చేస్తానంటే, తాను ఆమోదించాడు. తనకు కావలసినదల్లా వొక్కటే! నలుగురూ తనగురించి గొప్పగా చెప్పుకోవాలి... అది స్వార్థం కాదూ? అలాంటప్పుడు నలుగురూ తనగురించి ఈనాడు చెడ్డగా చెప్పుకుంటున్నారంటే వారి తప్పేమీ లేదు. కీర్తికోసం, కుమారుడిని అమానుషంగా "హత్య"చేసి దేశానికి హారతియిచ్చాడు.

రాజశేఖరంగారు యింటికి చేరుకున్నారు. భార్య ముఖం చూడలేకపోయారు. ఆమె రాజుగదిలో కూర్చుని అతని ఫోటోవంక చూస్తూ పెద్దగా ఏడుస్తున్నది.

"అయ్యో రాజూ! నిన్ను ఆపేవాళ్లు వొక్కరూ లేకపోయారా!" అంటూన్నది.

శేఖరంగారి గుండె నీరయిపోయింది. తనే కుమారుని "హత్య"చేసిన హంతకుడినని ఎలా చెప్తాడు? ఆనాడు తను కుమారుడిని వద్దని వారిస్తే తప్పకుండా రాజు వెళ్లకుండా ఆగిపోయేవాడు. కానీ, తనకానాడు ఆవేశంలో వొళ్లు తెలియలేదు.

* * *

ఈనాడు, జానకిరాముడి పెళ్ళి చూస్తుంటే, రాజు జ్ఞాపకానికి వస్తున్నాడు. అవును! రాజు బ్రతికివుంటే ఈనాటికి యిరవైయేళ్ళు నిండేవి. తనుకూడా రాజు పెళ్ళిచేసి ఆనందించేవాడు.

రాజశేఖరంగారు ఊహాతరంగాలలో, రాజు సజీవంగా వున్నట్లు వూహించుకుని, అతనుకూడా పెళ్ళిచేసుకుని, సిగ్గుతో తల వంచుకున్న తన వధువును వెంటబెట్టుకుని, ఆశీర్వదించమని తన కాళ్ల వద్ద మోకరిల్లినట్లు వొక వింత అనుభూతిని పొందారు. కానీ అలాంటి అనుభూతిని ఆయన వొక క్షణంసేపుమాత్రమే అనుభవించకలిగారు. తర్వాత రాజునుగురించిన విషాదస్మృతులు మనస్సును కలచివేసినాయి.

ఆయన భార్యవంక చూశారు. ఆమెకు కూడా రాజు జ్ఞాపకం వచ్చినట్లున్నాడు. అందుకే, నిశ్శబ్దంగా ఏడుస్తూ కంట తడిపెట్టింది.

"నీకు రాజు జ్ఞాపకం వస్తున్నాడుకదూ!" అన్నారు శేఖరంగారు బరువుగా.

"అవునండి! ఎలా మరిచిపోతాను"

"నువ్వేమి అనుకోకుండావుంటే, వొక విషయం చెపుతాను" అన్నాడాయన ఆవేశంలో.

"ఏమిటది?" అంది ఆమె ఆదుర్దాగా.

"ఆనాడు రాజును దేశంకోసం త్యాగం చేయమని పురికొల్పింది నేనే!" అంటూ భోరున ఏడవటం మొదలుపెట్టారు. కౌ[illegible]మ్మగారు ఆశ్చర్యపోతూ అచేతనంగా వుండిపోయింది. ★ (ఒక ఆంగ్లకథ చదివాక)





కందుకూరి లింగరాజు

# సమస్య

ఓసారి కలయచూచినట్లు, భార్యవైపు చూస్తూ ఎవరు ప్రారంభించాలి అన్నది సందిగ్ధంగావుంటే, సవ్యంటే సవ్వనుకుని పాపల్ని త్రిప్పుకుంటూనే మానంలో పడిపోయేరు. కాంతమ్మ నీళ్ళ చెంబు గడపఅవతల పెట్టడం ఈమానానికి భంగం అన్నట్టే భావించి వీథిఅరుగుమీద కాళ్ళు కడుక్కున్నాడు గంగరాజు.

శ్యామల చీరచెంగున చెయ్యి తుడుచుకుంటూ వచ్చి "పిన్నీ! ఎన్నాళ్ళయింది నిన్ను చూచి. రా, లోపలికి రా. అదేమిటి కాంతీని తీసుకురాకుండా వచ్చేరేం?" అనీ ఆపేసింది.

బండిలో చూచి పట్టిచేతుల్తో వచ్చిన వెంకటస్వామి "అయ్యోర్రు సామాను లేకుండా కట్టుబట్టలతోనే వచ్చేరేం?" అని గంగరాజుని ప్రశ్నించేడు.

. ఘరుక్కుమంది శ్యామల గుండె. ఏదో చుట్టపుచూపు అన్న పతుగా రామలక్ష్మమ్మ తన ఎరుకవున్నంతవరకూ ఇలా కట్టుగుడ్డలతో రావడం అన్నది క్రొత్తగా కన్పించింది. ఏదో ఉప్పెన లోపల్లోపలే కుములుతోంది అనీ అనుకుంది.

"ఏం ముఖం పెట్టుకుని దాన్ని కూడా తీసుకురమ్మన్నావు? మేం సగంచచ్చి, కుమిలిపోతూ వచ్చేము! అదేచాలు మా బ్రతుక్కి"...అంది రామలక్ష్మమ్మ బుడి బుడి దీర్ఘాలుతీస్తూ.

అర్థంకాలేదు శ్యామలకు. కాంతమ్మ భర్తవైపు, అక్కగారివైపుచూచి కళ్ళు కుంచించుకుంది.

"అవునురా శ్రీపతీ! మేం మేనమామలమే కదా! మీ అమ్మకు ఒక్కనేను తప్ప తోడబుట్టినవాళ్ళు ఇంకెవ్వరున్నారు? కాంత పుట్టినప్పుడే మీ అమ్మ అన్నయ్యా అది నా కడుపటికోడలు అని అంది. ఆ మాట మీదనే ఆశపెట్టుకుని, పుస్తకట్టడం తర్వాయి ఒక్కటే అని వాణ్ని తీసుకువెళ్ళి చదువుచెప్పించి, పెద్దచేస్తే వాడు ఇదా మాకు చేసేది!" గంగరాజు గట్టిగానే అడిగేడు.

"పైగా ఒక్కదాన్ని గొంతుకకోయ్యడం కాకుండా, బ్రాహ్మడై వుండీ, రెండు యజ్ఞాలుచేసిన జయిన కొడుకై, అంత తలవంపు పని చేస్తాడా?" తందానతాన అన్నట్టు రామలక్ష్మమ్మ.

'శ్రుతి కలుపుతున్నాను' అన్న చూపుల్తో "మేం తలెత్తుకోలేకుండా, వీనుగంత గౌరవంతో బావపేరు చెప్పుకుని బ్రతుకుతున్న వాళ్ళం, ఆ లేచిపోయిన రెడ్డికూతుర్ని పెళ్ళిచేసుకుంటాడా? దాంతో ఆ వూళ్ళనే వుండి వీథుల్లో తలెత్తుకోలేకుండాచేస్తాడా? మమ్మల్ని బ్రతకనిస్తారా?"

"అది ఒక్కటే ఏమిటి, తనో మహాకార్యం చేసేస్తున్నట్టు, ఆయన్ని కూడా పెళ్ళికి పిల్చి, చెట్టంతమనిషి! పుట్టెడు అవమానంచేస్తాడా? వినుక్కు చచ్చిపోతున్నాం పిల్లా!"

"పైగా దీవించు మామయ్యా అని నన్ను.. నన్ను" మాటతడబడిపోయేడు గంగరాజు.

చిత్తరువులేనా గాలికి కదుల్తాయి. కాని శ్యామల, కాంతమ్మ, శ్రీపతి, వెంకటస్వామి, వీథిగుమ్మంలో నుంచున్న బండివాడుకూడా చైతన్యంలేకుండానే వుండిపోయేరు.

ఏమి సమాధానంచెప్పాలి, ఏవిధంగా అనునయం చెయ్యాలి వీళ్ళిద్దర్నీ అన్న ఆరాటంలో ఇంటివాళ్ళు సతమతమైపోయేరు. శ్రీపతీ తేరుకుని, ఒదినగారివైపు ఓసారి చూచి తల వంచేసుకున్నాడు.

అయిపోలేదు మేం చెప్పేది అన్నట్టుగా గంగరాజు "కొండంత ఆశతో వచ్చేం, బావ ఆ సభలకు వెళ్ళి వచ్చేడని. చెల్లాయి కూడా వచ్చే వుంటుందనుకున్నాం. వాడికి బుద్ధిచెప్పి, సంప్రోక్షణ చేయించి, మళ్ళీ ఓ పోగు వేయించేవరకూ బావ నిద్రపోడు అన్న ధీమాతో, అమీతుమీ తెగతెంపు చేసుకుందామనుకున్నా అయినా శ్రీపతీ! నాన్న ఎక్కడవున్నాడురా ఇప్పుడు?

"రథోత్సవాల సమయానికి పూరీ జగన్నాథం చేరతామని అన్నయ్య వ్రాసేడు."

"అయితే, ఇప్పుడప్పుడే రాడన్న మాట?"

"దాంతర్వాత పండరీపురం వెళుతారట."

"అక్కడ ఏం వుందీ?"

"వేదపండితులు తర్కవితర్క సభలట.".

ఉస్సురని పోయేడు గంగరాజు. అసలు రావడం ఎలాగనా బావగారిని తలక్రిందు చేసి, ఘటశ్రాద్ధంచేయించి చలపతిని నానా గడ్డి కరిపించేట్లు చేయ్యాలనే వచ్చేడు. అదంతా అడియాస అయిపోయింది. తీరా తను ఆ పూరీ జగన్నాథం వరకూ వెళ్ళి తేల్చుకుందామనుకున్నా అది సారథ్యంలేని బండి అయిపోతుందేమో, ఇంత డబ్బూ దండగ అయిపోతుందేమో అని తట్టింది.

"అయితే ఇంకెందుకే ఇక్కడ వుండడం? పద" అంటూ లేచేడు.

శ్యామల "అదేమిటి? ఈ రాత్రికి ఉండి రేపు ఉదయం వెళ్ళవచ్చు."

"ఉండడమా! ఇన్నాళ్ళూ ఇదీ నా ఇల్లే అనుకున్నా. ఇప్పుడు అదికాదేమో?" అంటూనే, బండికట్టమని, పురమాయించడం రెక్కపట్టుకుని లాగినట్లుగా దాన్ని తొందరపెట్టడం జరిగింది.

'ముత్తయిదువ కుంకమేనా, అనుకుంటూ ఇంట్లోవున్న రెండత్తాల అరటిపళ్ళు, పసుపు, కుంకుమ చేతుల్లోనే పెట్టింది శ్యామల.



# సమర్పణ



బండీ మలుపు తిరిగింది.

వెంకటస్వామి ఉండబట్టలేక "అయ్యగారూ!" అని పిల్చేడు కాని ఏమడగాలో, ఏమనాలో తెలియక తికమక పడ్డాడు.

భావి ఎల్లావుంది? ఏమవుతుంది? ఇంకా ఇల్లాంటివార్తలు ఎన్ని వినాలి? ఈ వూరు, ఈ సంసారం ఏ విధంగా ఇంకా ఛిన్నాభిన్నాలై, హృదయాల్ని కోసేస్తాయి? అన్న ఆలోచనల్లో పడిపోయేడు శ్రీపతి.

సంజచీకట్లు అలుముకుంటుంటే నే లేచేరు. వెంకటస్వామి కదల్లేక అక్కడే కూర్చున్నవాడల్లా తనూ లేచేడు.

అంతవరకూ, తననితాను సంబాళించుకో లేక శ్యామల నిరుత్తరురాలైపోయింది. అయినా, ఈ స్థితిలో, ఇంట్లో తనే బెంబేలు పడిపోతే, మరిదీ, చెల్లెలుకూడా దిగులు పడిపోతారన్న భావంతో "మరిదీ! రంగనాయకమ్మకోసం గది ఖాళీచెయించేవా?" అంది.

"మధ్యాహ్నమే అయిపోయింది. కాని ఒదినా! ఏమిటిదంతా!" అన్నాడు.

"ఏముంది మరిదీ! అప్పుడప్పుడు మామగారు చెప్పడం వినలేదూ? కర్మ పరిపక్వం అవ్వంగే ఎవరూ ఏమీ చెయ్యలేరు అన్న విషయం అదే."

"అయితే అన్నయ్యకి ఉత్తరం వ్రాయమంటావా?"

"ఒద్దు. వ్రాయడంవల్ల వాళ్ళిద్దరూ మనస్సు పాడుచేసుకుంటారు. అయినా వ్రాసి, చేసేంతరాచకార్యం ఇప్పుడేమీ లేదు."

"ఇంతకీ ఏమవుతుంది?"

"ఏమీఅవదు. అన్నీ మంచికే వస్తున్నాయేమో!"

"మంచా?"

"కాకపోతే ఏమిటి?"

ఈవిపరీతతర్కం అర్థంకాలేదు శ్రీపతికి. కాంతమ్మకి వెలక్కాయ అడ్డుపడ్డట్టే అయ్యింది.

భోజనాలయ్యేసరికి రంగనాయకీ వచ్చింది.

## 14

ఇంటిగొడవలు, మసకల్లోకి వెళ్ళిపోయి మనసుకు పట్టలేదు సోమయాజులికి ఆ రోజుల్లో. ఒక్కొక్క పక్షంలో ఒక్కొక్క పుణ్యక్షేత్రం దర్శించడం, స్నానాలు చెయ్యడం, అభిషేకాలు చేయించడం, ఊళ్ళుచూడడంలో, వయస్సు దాటిన ఆ వృద్ధదంపతులకు యవ్వనమూ వచ్చినట్లయ్యింది. ఏ ఆటవిడుపో అయి, బడివదిలినట్టుగా చిన్నపిల్లలే అయిపోయేరు వాళ్ళు. దాంతో యవ్వనమూ వచ్చేసింది.

వసుపతికూడా మొత్తంమీద తల్లి తండ్రుల్ని ఇంటికి వెళ్ళనివ్వకుండా రథాలు ఇటు త్రిప్పించినందుకు విచారించలేదు. దీనివల్ల ఓవిధంగా ఇంతవయస్సువరకూ ఆ పల్లె గ్రామంలో నివసించిన వాళ్ళకు, ఈ కాని దేశాలు, రాని భాషలు, క్రొత్త ఆచారాలు, వివిధాలైన కట్టడుల మధ్య కొన్నాళ్ళయినా తిరిగితే, ఆ దిగ్బంధనం చేసినట్లు వున్న పల్లె రాజకీయాలనుండి విముక్తి పొందడమే కాకుండా, జీవితంమీద ఓ విధమైన క్రొత్త దృక్పథం వస్తుందన్న వుద్దేశ్యంతోనే వుండి కార్యాచరణకు వుపక్రమించేడు.

రోజులు వారాలుగా, మాసాలుగా మారుతూంటే, వాళ్ళల్లోవచ్చిన మార్పులకు తానే తెల్లబోయేడు. తన ఎరుక ఉన్నంతవరకూ ఆ పూజా అనుష్ఠానాలకు ఏ రవ్వంత పరిసరాలు లోపంగా వున్నా మండిపడిపోయే తండ్రి, ఇప్పుడు నవ్వుతూనే 'సర్దుకోవాలి' అనుకుంటూ సరిపుచ్చుకోవడం, నిప్పుల్నే ముప్పై మూడుసార్లు కడిగే అమ్మ—అన్నిటికీ సర్దుకుపోవడం విచిత్రంగా తట్టింది. దాంతో ఈ మడి, ఆచారాలు, మతధర్మాలు అన్నీకూడా ఆత్మకా, శరీరానికా అన్న మీమాంసా వచ్చేది.

అర్సవిల్లిలో సూర్యనారాయణకు సూర్య నమస్కారాలు చేసేరు. శ్రీకూర్మంలో దేవదాసి ఆలయంలో దశావతారాలు పట్టడం చూచేరు. పూరీ జగన్నాథంలో విగ్రహాల అసంపూర్ణతని గురించి కథ విన్నారు. బొబ్బిలిలో బొబ్బిలి యుద్ధరంగం చూచేరు. జయపూరులో రాజావారి సంస్థానానికి వెళ్ళేరు. కటకంలో ధాన్యకటకాల్ని గూర్చి చరిత్రలు వూకొట్టేరు. ఇల్లా గుజలీపుస్తకాల్లో మజిలీల్లాగే ఆ ఫాల్గుణ మాసానికి పండరీపురం చేరిపోయేరు.

చంద్రభాగానది వడ్డాణంలా ఊరునుచుట్టి ప్రవహిస్తోంది. జఘనభారంలా ఉన్నాయి ఆలయాల సంపుటాలు. 'మహాతల్లి గుండెల మీదనే పాండురంగణ్ణి మోస్తోంది' అని సోమయాజులు మురిసిపోయి, చెయ్యెత్తి నమస్కరించేడు. పార్వతీ ఆనందంలో తల మునకలైంది.

సభలకు భారీఎత్తున పందిళ్ళు వేసేరు. ఒక్కొక్క దేశభాగాన్నుంచి వచ్చిన పండితులకు ఒక్కొక్క దిశలో విడిదులూ ఏర్పాటయ్యేయి. పండాలకు తీరుబడే లేదు. హేమాహేమీలు అందరూ వచ్చేరు. ఈ సభలు అత్యంతజయప్రదంగా జరిగిపోతాయి అన్నారు కార్యకర్తలు.

అతిథిమర్యాదలు సక్రమంగా వారి వారి ఆచారాలప్రకారం జరుగుతున్నాయో లేదో అని అంచీలమీద అన్నట్టే సకల సంభారాలు కూడా అందచేస్తూనేవున్నారు.

ఎంతో సంబరపడిపోయేడు. తన తెలుగునాడునుండి, రామశాస్త్రుల్లు, సుబ్రహ్మణ్యశర్మ, ముంగండ వేరావధానులు వగైరా చూడ్డానికి వచ్చేరంటే, 'తోడు' అని సంతోషపడి, పరిచయమూ చేసుకున్నాడు. దాంతో శంకరాచార్యపీఠంనుండి స్వాములవారూ వచ్చేరన్నవిషయం ఆశ్చర్యపరచింది యాజుల్ని.

ఆ త్రయోదశినాడు సభలు ప్రారంభమైనాయి. అన్ని అంశాలు తర్కించబడతాయి అన్నారు. వాటివాటికి న్యాయమూర్తుల నియామకాలూ జరిగేయి. అందులో అగ్రతాంబూలము సోమయాజులకే వచ్చింది.

ఆనాడు 'సాయన, నిరయన సిద్ధాంతాలు, ఆయనాంశ, వీటివల్ల పంచాంగ గుణకారాలు, జ్యోతిషశాస్త్ర విపులీకరణ' అన్న అంశంమీద చర్చ జరిగింది. అటు పక్షంవారు ఇటు పక్షంవారు వారి వారి అభిప్రాయాలు వెల్లడించేరు. తర్వాత ఖండనలూ జరిగేయి. తర్కమూ అయ్యింది.

ఈ ఖండనలోనే వసుపతి, యవ్వనంలోని ఉద్రేకంలో సభాతిక్రమణచేసి, వ్యక్తిగతంగా ప్రత్యర్థిని కేంద్రీకరించి, నోరు కట్టేసేడు. సోమయాజులు ఖంగారుపడి చెయ్యెత్తేడు. కాని అది గుర్తించనట్లుగా వసుపతి ధోరణి మానకపోవడం, లౌక్యం తెలియక అసభ్యం అవడం, వాళ్ళ మద్యలో లేచిపోవడం, అలజడి, ముసలం పుట్టినట్టే అయిపోయింది. వర్గాలు ఏర్పడి స్పర్థలకు బీజారోపణమూ అయ్యింది.

సభాపతి "వసుపతిగారూ! సభానియమాలను ఉల్లంఘించేరు. క్షమాపణలు చెప్పడం ఉచితం" అన్నాడు.

సోమయాజులూ తలూపేడు.

వసుపతికి ఇది నిజంగా తలతీసేసినట్టే అయ్యింది. తనతండ్రే తనకి న్యూనత, అవమానం కలగచెయ్యాలని ఇల్లా చేసేడు, దానికి ఒప్పుకున్నాడు అన్న ఉద్రేకంలో వెర్రి ఎత్తినట్టే అయ్యేడు. దాంతో "శాస్త్రం అంటే ఏమిటో తెలియని ఆ పండితుడు ముందు తన ప్రతిపాదనలు ఉపసంహరించుకుంటే, నాకేవిధమైన అభ్యంతరం లేదు" అనీ అనేసేడు,

చర్రున లేచి "నా పాదరక్షలకున్న వయస్సు లేదు నీకు. నువ్వా నన్ను అనేవాడవు. సరే చూస్తాలే," అని ఆ వయస్సు మళ్ళిన పండితుడు సిగముడి విడిపోతుండగా రౌద్రంలో వెళ్ళిన్నీపోయేడు.

ఆ వెళ్ళడం చూస్తుంటే క్షణంసేపు చాణుక్యుడు జ్ఞాపకంలో మసలగా ఒణికిపోయేడు సోమయాజులు. బెంబేలుపడిపోయేడు.

అంతే!

ఆ రాత్రికే విపరీతమైన జ్వరం, డోకులు, కీలు కీలు కదల్చలేని అశక్తతతో వసుపతి చాళు తుబ్రకుల సంధ్యాతిమిరం చూడవలసివచ్చింది. పార్వతి గగ్గోలుపడిపోయింది. గుండె చెరువే అయిపోయింది.

(ఇంకావుంది.)



# వనితాలోకం

## సమష్టి కుటుంబాలలో వ్యక్తుల బాధ్యతలు

కె. ఐ. ఎస్. అచ్యుతవల్లి
(కాకినాడ)

ఆరోజు భోగి పండుగ: మా చిట్టివచ్చి, "పిల్లడికి భోగిపళ్లు పోస్తాము. తప్పకుండా రమ్మ"ని మరీ మరీ చెప్పి వెళ్లింది. ఆ రోజున నాకూ చాలా పేరంటాలు తగిలాయ్. సాయంత్రం ఆరూ ఆరున్నర అయితేగాని వాళ్ళింటికి వెళ్ళటం కుదరలేదు. వాళ్లింట్లో ఎలక్ట్రిసిటీలేదు. కిరోసిన్ లాంపులే వెలిగించుకుంటారు. తీరా వెళ్ళి చూస్తే ఎక్కడా పేరంటం జరిగిన సూచనే లేదు. చిట్టి బావగారి కొడుకు లాంతరు ముందు కూర్చుని ఎక్కాలుబట్టీ వేస్తున్నాడు.

"బాబూ! మీ పిన్ని ఏదీ?" అన్నాను.

నా గొంతువిని చిట్టి వాళ్ళత్తగారు వంటింట్లోంచి వచ్చారు.

"కూర్చోవమ్మా! మీ చిట్టెమ్మగార్కి అలకొచ్చింది. చంటాడికి భోగిపళ్లు పొయ్యనేలేదు. ఇవ్వాళ—ఈ ఇంట్లో "రామరావణయుద్ధం" జరిగిపోయింది. నా రాత! నా ప్రాణం కుదురుగా వుంచే యోగం 'లేదు" అని కంట తడిపెట్టుకుంటుంటే నిర్ఘాంతపోయాను.

ఆవిడకు ఇద్దరు కూతుళ్ళూ ఇద్దరు కొడుకులూను. కూతుళ్ళ సంసారాలు బాగా పెద్దవి. అసలు ఎప్పుడోకాని పుట్టింటికి రానేరారు. ఇంక కోడళ్ళు అయినవాళ్ళే పెద్దావిడ ఆడబిడ్డ కూతురూ, చిన్నావిడ తమ్ముడూ కూతురూను. కొడుకులకు పెళ్ళి యినప్పుడు అందరూ "నీకేమమ్మా లక్ష్మి సరస్వతుల్లా ఇద్దరూ కోడళ్ళూ కలిసిన సంబంధాలు!" అని మెచ్చుకున్నారు. పెద్ద కొడుక్కి ఏదో బట్టలషాపులో 60 రూ జీతమ్మీద పని. చిన్నవాడు బి. ఎ. పాసై 100 రూపాయలు పై మాటగా ఏరుకుంటున్నాడు.

తండ్రికి పెన్షన్ 40 రూపాయలొస్తయ్. స్వంత యిల్లుంది. కొద్దిగా భూమి వుంది. బియ్యం కొనుక్కోనక్కరలేకుండా ధాన్యం తెచ్చుకుంటారు. అత్తగారు పెద్దావిడ. పైగా ఇద్దరు కోడళ్ళు వచ్చారాయె. ఏదో అంతా తలోపనీ చేసుకుంటూంటే కుటుంబం సుఖంగా వెళ్ళిపోతుందిగదా! అని అనుకుంటారు మగవాళ్ళు.

కాని మా చిట్టికి అదేం సరిపడదు. అది మాటకారి! పైగా అహంభావం! పెద్దావిడకు నలుగురు పిల్లలు. దీనికి ఒక్కడే వుంటాడు! పైగా దీని మొగుడు 100 రూపాయలు తెచ్చే మొగాడాయె!

పెద్దావిడకు ఏదన్నా పని తగిలితే "మా ఆయన తక్కువ సంపాదిస్తారు! నాకు పిల్లలెక్కువ! దరిద్ర మెక్కువ! ఆడబిడ్డ కూతుర్ని అని అప్పటివి ఇప్పటివి కలిపి సాధిస్తున్నారు నన్ను" అని రాగాలు మొదలెట్టుంది.

ఇంక చిన్నావిడ:—వెధవకొంప! ఆయన ఎంత తెచ్చిపోస్తే ఏం! నేనెంత చాకిరీచేస్తే ఏం? ప్రాణానికి సుఖమన్నమాట లేకపోయాక దిక్కుమాలిన సంతలన్నీ మా ప్రాణానికి రాసిపెట్టేఉన్న! ఒక్క పిల్లాడిక్కీ ముద్దు ముచ్చటలు జరిగేరాత కూడా లేదు!" అని మొదలెడుతుంది.. పోనీ రోజూ ఈ సంతగోడవలెందుకు విడిపోండి అంటే మగవాళ్ళు విన్పించుకోరు. ఆడవాళ్ళకి చూడబోతే అసంతృప్తి. అస్తమానూ కొట్లాటలూ, ఏడ్పులూ, రాగాలతో ఇల్లు దద్దరిల్లిపోతూంటుంది.

ముఖ్యంగా ఆడవాళ్ళలోగల ఎత్తిపొడుపులు, అసూయ, ఇంకొకళ్లని అనుమానించటం మొదలయిన అమూల్య లక్షణాలవల్ల సమిష్టి కుటుంబాలలో అశాంతి ప్రబలిపోతూ వుంటుంది. వీళ్ళల్లోగల ఈ లక్షణాలను ఆధారం చేసుకుని మగవాళ్లు "తెయ్"మని ఎగురుతూ వుంటారు.

"పండుక్కి మీ అక్కయ్యకి 40 రూ. జరీ అంచు చీర ఇచ్చి, నీకు ఈ చీరె ఇచ్చారేం? నీ మొహానికి ఇది చాల్దనా?...మీ తమ్ముడికి నువ్వు నీళ్లోశావే? మీ వదినేం చేస్తున్నదిటా" అనే మగవాళ్లను నేను చూశాను. సరే! పెళ్లికి ఇస్తానన్న వాచీ యివ్వలేదు. సూటు యివ్వలేదు—అనే దెప్పుళ్లు సాధారణంగా గృహస్థాశ్రమంలో అడుగుపెట్టిన ప్రతి ఆడదానికి పరిపాటే!

సమిష్టి కుటుంబంలో ప్రశాంతంగా వుండాలంటే ఎంతో మంచిమనస్సు వుండాలి! భేదాభిప్రాయాలున్నా సర్దుకుపోగలగాలి. సామరస్యం ఒక్కరివల్ల అయ్యేది గాదు. కాని పేచీలకు ఒకరు చాలు. ఎవరికో వుడుకుతుంది పురుగులాంటి నీచబుద్ధి! దానితో వాతావరణమంతా కలుషిత మయిపోతుంది. అందరి మనస్సు ఆకాశమువలె నిర్మలంగా వుండగలగాలి!

దాని భర్త పెద్ద వుద్యోగస్థుడు గదా! అని పెద్ద ఖరీదుగల చీర పెట్టారు. అనుకొనే ఆడవాళ్లూ—

"నేను 60 రూపాయలే సంపాయిస్తున్నాను గనుక నా భార్యకి పిల్లల్కి చాకిరీ అప్పగించారు. తమ్ముడు ఎక్కువ సంపాయిస్తున్నాడు కనుక వాడి సంసారాన్ని బాగా చూస్తున్నారు." అనుకొనే మగవాళ్లూ ఆ ధోరణిలో వున్నంతకాలం ఈ సమష్టికుటుంబాలలో అగ్ని అలా రాజుతోనేవుంటుంది. ఎవరిబాధ్యతలు వాళ్లు గుర్తెరిగి ప్రవర్తించాలి. లేకపోతే విడిపోవాలి. అంతేగాని ఏదో తప్పనిసరి అయినట్టుగా సమష్టిగా వుండి

# అలరుల అమరిక

డి. కోమలాదేవి
(కాకినాడ)

స్త్రీలకు పూలమొక్కలను, యితర మొక్కలను పెంచి, వాటిని పూలతొట్లలో లేక కూజాలలో అమర్చి యిళ్ళలో పెట్టుకోవడంలాంటి రమ్యమైన చక్కని కాలక్షేపం మరొకటి లేదు.

పశ్చిమ దేశాలలో కాంపౌండ్స్ వున్న యిళ్లలో పూలమొక్క లేని గృహంవుండదు. వారుపూలతో తలలు సింగారించుకోకపోయి నా వాటిని తమ గృహాలంకరణ కుపయోగిస్తారు. మనం సాధారణంగా "డ్రాయింగ్ రూమ్"లో పెడతాము గానీ వారు ప్రతిగదిలోనూ ఆకులు పూలు అమర్చుతారు. భోజనపు బల్లపై గూడ పెడతారు. చైనా, జపాన్ దేశీయులు ముఖ్యంగా హాలులో పూజ కుపయోగించే గూటిలో పెడతారు. వారిలో సామాన్య కుటుంబీకులుగూడ పూలకు ముఖ్యస్థానం కల్పించి అందంగా అమర్చుకుంటారు.

పురుషులలో అనేకుల హాబీ తోటపని (తూరుపు-దేశాలలో గూడా.) కానీ స్త్రీలకూ పూలకూ అతి సన్నిహిత సంబంధం వుండటంవలన మొత్తం మీద వాటిని అందంగా, ఏరి కోరి ఆకర్షణీయంగా అమర్చటంలో ఆమెదే పైచేయి అంటే, అతిశయోక్తి కాదు.

జపాన్ దేశీయులు పూల అమరికలో చాల శ్రద్ధ వహిస్తుంటారు. దాన్ని ఆకర్షణీయమైన వినోదం అంటూ గొప్పగా చెప్పుకుంటారు. ఏ కన్యకకుగాని యీ కళలో కొంచెమైనా ప్రవేశం లేకపోతే ఆమెను వనితనం పొందికగల పిల్లగా ఎంచరు. "గృహశాస్త్రం"లో యీ కళకు వారిలో ముఖ్యస్థానం వుంది.

ఈ పూల అమరికలోంచి ఒక విధమైన తత్త్వశాస్త్రంకూడా, ఉత్పన్నమైందంటారు పూలను వివిధ రకాలుగా తీగలతో, ఆకులతో, కొమ్మలతో, గడ్డి పోచలతో చేర్చి, కూర్చి అమర్చి మదుర భావాలను వ్యక్తపరుస్తుంటారు. గొప్ప ఆలోచనలను లేకెత్తిస్తారు. ఉత్తేజకరములైన ఉపమానాలకు ఈ పూలతో రూపకల్పన చేస్తారు.

స్వర్గము, భూమి, పుష్పములు
భగవంతుడు బుద్ధుడు పుష్పాలు
మానవుని ఆత్మ, పుష్పము ఒకటే.

ఈ మాటలలోని భావాన్ని వారు పూలను అమరికమో స్తర్లలో తెల్పుతారు.

వెదురుమొక్క (వేతది) స్వర్గానికి చిహ్నము. వెదురు మొక్కకంటె చిన్నదైన పైన్ కొమ్మ మానవునికి గుర్తు. ఈ రెంటిని చేర్చి వాటికి క్రిందుగా లేత రంగులు గల చిన్నపూలను (భూమికి గుర్తు) అమర్చాలి. ఈ విధంగా అమర్చినప్పుడు వెదురుమొక్క హెచ్చుగా, పైన్‌కొమ్మ కొద్దిగా తగ్గులో, యీ రెంటిక్రింద పూలూ వుంటాయి. అప్పుడే ప్రథమం భగవంతుడు, ద్వితీయస్థానం మానవుడు, తృతీయస్థానం భూమి—అని తేటతెల్లమౌతుంది.

దీని అందంతోపాటు, భావము, తత్త్వము యెక్కువగా మనల నాకర్షించి హృదయంలో ఉత్కృష్ట భావాల నుత్పన్నంచేసి అద్వితీయమైన ఆనందాన్ని మనలో పెంపొందింపజేస్తాయి.

మనకు 'పైన్' కొమ్మలు లభింపవు కాబట్టి ఆకుపచ్చ గడ్డిని (త్వరగా వాడనిది) వుపయోగింపవచ్చును. ఈ మూడు ప్రస్ఫుటంగా తెలిసేట్లు వుంచి నింపుదనం కోసం మధ్యమధ్యలో చిన్నపూలను, తీగలను అమర్చితే బావుంటుంది.

పై మూడూ మనకు దొరకకపోతే ఏదైన మూడు పువ్వులుగల ఒకే కొమ్మను తీసికొని వానిని మూడు మెట్లుగా హెచ్చు, తగ్గు, తగ్గుగా వేరువేరు కోణాలలో (మూడు ఒకే సరళరేఖలో వుండకుండా) వుండేలా వంచి వాని మధ్యలో ఆకుపచ్చటి సన్న గడ్డి పోచలను దూర్చితే సరిపోతుంది.

ఇలా అమర్చటానికి వెడల్పాటి ట్రే లాంటి పాత్రగాని, కూజాగాని అవసరం. సన్నమూతిగల కూజాలు వుపయోగిస్తే అందగించదు.

ఇంకొన్ని మోస్తర్లు యెక్కువ అందాన్ని కలిస్తాయి. గులాబిపూల గుత్తిపైన కొమ్మ ప్రణయాన్ని సూచిస్తుంది. పైన కొమ్మబదులు ఆకుపచ్చటి చిన్న ఆకులుగల గట్టి కొమ్మను త్వరగా వాడనిదాన్ని వాడవచ్చును. ఈ కొమ్మ పురుషుని శక్తిని బలాన్ని సూచిస్తుంది. గులాబిపూలు అందాలుచిందే సుకుమారకన్యకకు గుర్తు. ఈ కొమ్మ గులాబిపూలకు యెత్తుగా అమర్చాలి.

---

రోజు రోజుకీ గొడవలెందుకు? కానీ పరకాకల్పితస్తుందేమో అని ముందు అన్నలతోనూ అక్కలతోను సమష్టిగా వుండబోవటం తరువాత గొడవలెట్టుకుని వెళ్లి పోవడమెందుకు? అసలు పెళ్ళిళ్లు అవగానే ఎవరి సంసారం వాళ్లు చూసుకుంటే ఏ గొడవా వుండదు. శుభాలకైనా కల్సుకునే అవకాశం వుంటుంది. ఎప్పుడయినా వేరుపడక తప్పదు. అంచేత పెళ్లిళ్ళు అవగానే ఎవళ్లమటుకు వాళ్లు వేరు వెళ్లిపోతే చిన్నవాళ్ల సరదా తీరుతుంది. అంతఃకలహాలూ తప్పుతాయ్. కావల్సినప్పుడు. కళ్ల చూసుకునే అవకాశమూ వుంటుంది; ఆపేక్షా మిగులుతుంది.

ఇంక ఈ సమిష్టి కుటుంబాలలో పిల్లల పరిస్థితి దుర్భరంగావుంటుంది. అసలు సాధారణంగా ఈ గొడవలు కూడా పిల్లలగురించే వస్తూంటాయ్.

"మీ పిల్ల మావాడిని రక్కింది" అనో, "మీ పిల్లాడు మావాడి పలకపుల్ల దొంగిలించాడు" అనో పోట్లాటకు నాందీ వాక్యం పలుకుతారు. ఒకళ్లు పిల్లని కొడుతూంటే బామ్మ అయినా పెదతల్లి అయినా "ఎందుకు పిల్లని అంతలేటు కొట్టటం" అని అంటారు అనుకోండి! ఇంకా వేలెడంత పిల్లమీద తమ ప్రతాపం చూపెడతారు.

తర్వాత ఎదిగే పిల్లలు చెడిపోయే అవకాశములు కూడా ఈ సమష్టి కుటుంబాలలో ఎక్కువగా ఉంటున్నాయి. మగపిల్లలు అయితే జేబుదొంగతనాలు, చదువులు ఎగవేయటం, ఆడపిల్లలు అయితే వాళ్ల మీద వీళ్ల మీద చాడీలు చెప్పుతూ, పనీపాటా నేర్చుకోక బేఖాతరీగా తిరగటం అలవాటు అవుతాయ్. ఎంచేతనగా ఎవళ్ల పిల్లల తప్పుడుపనులను వాళ్ల తలితండ్రులు వెనక వేసుకుని పోట్లాడటం జరుగుతూ వుంటుంది. అందరూ అలాగే వున్నారా? నలుగురేసి కొడుకులూ కోడళ్లతో నిత్యకల్యాణం పచ్చతోరణంగా వున్న కుటుంబాలు లేవా? అని మీరనొచ్చును. ఉంటారు, మనస్సు పాలతో కడిగివేసుకున్న వాళ్ళు ఆర్థికంగా కక్కూర్తి లేనివాళ్ళూ వుండగలరు. భయపడి సర్దుకునే వాళ్ళూ ఉంటారు. మనం మనుష్యులం, మనలో ఎన్ని పొరపాట్లన్నా వుంటాయ్. మనం ఎదుటివాళ్ల పొరబాట్లని సానుభూతితో చూడగలగాలి. ఎదుటివాళ్లకి మన పొరబాట్లని సానుభూతితో చూడగల శక్తి వుండాలి. అలాంటప్పుడు ఒక్క కుటుంబంగా వుండొచ్చును. కాని ఆ సహనశక్తి యొక్క పట్టు ఎప్పుడయితే జారుతున్నట్లు తోస్తుందో, అప్పుడు ఎవరి దోవ వారు చూసుకున్నట్టయితే ఏ బాధా వుండదు.

# 'ఓయమ్మ నీకుమారుడు -'

సాధారణంగా పిల్లలుచేసే అల్లర మూలంగా పెద్దవాళ్ళు పోట్లాడుకోవడం చాలా చోట్ల మనం చూస్తూనే వుంటాము. అయితే దానికి కారణం పిల్లలు ఎంతమాత్రముకాదు. పెద్దవాళ్ళు పిల్లలపట్ల చూపే అశ్రద్ధ అని చెప్పవచ్చును. కొంతమంది స్త్రీలు తమ పిల్లలు ఇంట్లో అల్లరిచేయకుండా మాత్రమే చూసుకుంటారు కాని పొరుగిండ్లలో చేసే అల్లరి కొంచెముకూడా చూసుకోరు. పైగా ఎవరైనా మీ అబ్బాయి అల్లరిచేస్తున్నాడు, కొంచెము భయంచెప్పండి అని చెప్పబోతే వారితో పోట్లాటకు సిద్ధమౌతారు. అంతే కాని తమ పిల్లలు చేసే అల్లరిమూలంగా వారెంత బాధపడుతున్నారో కొంచెము కూడా ఆలోచించరు.

ఇదివరకు మేము హైదరాబాద్‌లో వుండగా మా ఇంటివారికి నాలుగు సంవత్సరాల అమ్మాయి వుండేది. ఆ అమ్మాయి విపరీతమైన అల్లరిచేస్తూవుండేది. ఆఅమ్మాయి తల్లి ఆ పిల్ల చేసే అల్లరి భరించలేక మధ్యాహ్నంపూట ఆ పిల్లను ప్రక్క వాటలోనే వుంటున్న మా యింటికి పంపేసి తలుపులు వేసుకొని నిద్రపోయేది. ఇంక ఆ పిల్ల మాయింట్లో చేసే అల్లరికి మితి వుండేదికాదు. పుస్తకాలు చింపటం నూనె సీసాలు పగలగొట్టటం దువ్వెనలు విరక్కొట్టటం మొదలైన అల్లరిపనులు చేస్తూ వుండేది. పోనీ ఆ అమ్మాయి లోపలకు రాకుండా తలుపులువేసుకొని లోపల కూర్చుందామంటే తలుపులు తీసేదాకా

**శ్రీమతి వారణాసి సుబ్బలక్ష్మి**
(అదిలాబాదు)

బాదేది ఆ అమ్మాయి. మీ ఇంటికి వెళ్ళి ఆడుకో అమ్మాయి అని చెప్పబోతే మా అమ్మ నిద్రపోతోంది సాయంత్రందాకా మీ యింట్లో ఆడుకోమంది అనేది! పోనీ ఇంకెవరింటికేనా వెళ్ళి ఆడుకోమంటే— ఇంకెవరింటికేనా వెడితే కాళ్ళు విరక్కొడతానంది మా అమ్మ అనేది.

## సన్మాన పాఠం

పోనీ మా పిల్లలతోబాటే ఆడుకుంటుం దేమోనని రానిస్తే రోజుకొక వస్తువు పాడు చేస్తూ వుండేది. మన పిల్లలనైతే కోప్పడతాము కాని పరాయి పిల్లల్ని ఎట్లా కోప్పడేది. కోప్పడితేమాత్రం వూరుకుంటారు కనుకనా! ఒకరోజయితే ఏమో అనుకోవచ్చు. నిత్యమూ అల్లరిచేస్తూవుంటే ఎవళ్ళు భరిస్తారు. ఈబాధ పడలేక ఒకరోజున నేను ఆ పిల్లతల్లితో ఏమండీ మీ అమ్మాయి మాయింట్లో చాలా అల్లరిచేస్తూంది. మొన్న నేమి కొబ్బరినూనె సీసా పగలకొట్టింది. నిన్న స్నో సీసా పగలకొట్టింది. మీ అమ్మాయికి కొంచెము భయంచెప్పాలి మీరు, అని మెల్లగా చెప్పాను. దానికి ఆవిడ నాకు చెప్పిన జవాబు ఏమిటంటే: "మొన్న కొబ్బరినూనె సీసా పగలకొట్టినపుడు నిన్న స్నో సీసా జాగ్రత్తగా దాచుకోవాలని తెలియదూ?" అని! ఈ జవాబు ఎంత సరసంగా వుందో చూడండి.

## ఇదో బెదిరింపు!

"దాచుకునే చోటువుంటే నీదాకా ఎందుకు వస్తానమ్మా ఐనా ఎవరింట్లో వాళు ఎవరిష్ట మొచ్చినచోట వారు పెట్టుకుంటారు. ఎవరిపిల్లల్ని వారు అల్లరిచేయకుండా జాగ్రత్తగా చూసుకోవాలి." అన్నాను.

"నీవు యిల్లు చూసుకోవడానికి వచ్చినపుడు. నాకు పిల్లలున్నారని చెప్పేసుకదా. అంత పిల్లలంటే కిట్టనిదానవు నా ఇంట్లో అద్దెకు ఎందుకు దిగావు" అంటూ జగడము ప్రారంభించింది ఆ ఇల్లాలు.

పట్నాలలో ఓ పట్టాన ఇళ్లు దొరకవు కాబట్టి, ఇల్లుగల్లవాళ్లంతా మాట్లాడితే ఇదో బెదిరింపు. అయినా ఇంట్లో అద్దెకు వుంటే మటుకు పిల్లల అల్లరి భరించాలని రూలు ఎక్కడవుంది? మళ్లీ అద్దెలకున్న వాళ్ళకు మాత్రం పిల్లలుండకూడదు. ఒకవేళ వున్నా ఇంటివారి గడప త్రొక్కకూడదు. పూర్తిగా తెలుసుకునే వారికి చెప్పవచ్చును. తెలియని వాళ్లకూ చెప్పవచ్చునుకాని ఇటువంటివారికి చెప్పే లాభంలేదు. అందుకనే అక్కడితో నోరు మూసుకొని వూరుకొన్నాను.

## 'ఓయమ్మ నీ కుమారుడు...

ఇంక మా ప్రక్క యింటి వారి సంగతి. లేక లేక పుట్టాడు ఒక దుడుకు అబ్బాయి మా పక్కింటావిడకు. ఆ అబ్బాయంటే వారికి అమిత గారాబం. ఒక్కడే పిల్లవాడవటం చేతను, చాలా రోజులకు పుట్టడం చేతను ఇంట్లో ఆ అబ్బాయి ఆడింది ఆటా, పాడింది

# అలరుల అమరిక

అప్పుడే ఆమె, ప్రేమతో అతన్ని ప్రేమ కోసం ధరవసాకోసం చూస్తున్నట్లవుతుంది.

నూతన వధూవరులున్న యిళ్ళలో, పెళ్ళి సమయాలలో, ఈ కలయికను ఉపయోగింపవచ్చును.

త్వరగా రేకులు రాలిపోయే పుష్పాలను శుభకార్యాలప్పుడు వాడరాదు. త్వరగా వాడని, యెక్కువసేపు పరిమళాన్ని కల్గి వుండే పూలనే వాడాలి.

ఋతువులను బట్టి పూలు మారుతాయి. గ్రీష్మంలో అంతగా పూలు మనకు దొరకవు. పూలు లేనంతమాత్రాన నిస్పృహ చెందనక్కరలేదు. చక్కని ఆకులు, చిన్న గడ్డికొమ్మలు, తీగలు, పని కొస్తాయి. వీటి అందమంతా చక్కగా వంచటంలోనూ, కత్తిరించటంలోను తీగను త్రిప్పటంలోను వుంది.

ఎండలుగా వున్నరోజుల్లో యిళ్ళలో ముదురరంగు పూల నమర్చకూడదు. ఈ ముదురరంగులు యెండలో తిరిగి వచ్చిన వారిపై బాగా పని చేయవు. వాని ప్రభావం ఆ వ్యక్తిపై వేరుగా వుంటుంది. ఈ రంగులు కళ్ళకు అలసటను కల్గిస్తాయి—ఉద్రేకాన్నీ కల్గిస్తాయి కాబట్టి లేతరంగు పూల నుపయోగించాలి. తెల్లటి పూలు ఫరవాలేదు. పసుపురంగు మంచిది. కళ్లకు చల్లదనాన్ని కల్గిస్తుంది. ఆకులూ మంచివే. ఈ లేతరంగులో కలకలలాడే పుష్పాలను చూడగానే చల్లటి ప్రశాంత వాతావరణంలో వున్నట్లు భావం కలిగి, వేళకి కొంచెం సేపు విశ్రాంతి అనుకోకుండనే పొందుతాము.

పూలు లేకపోతే యీతమట్టలాంటి చిన్న మట్టలు గల మొక్కలను తోట్లలో అందం కోసం వేస్తుంటాము. రోడ్ల ప్రక్కన వూరి బయట పెరిగే అనాసపండుపై నుండే ఆకుల లాంటి ఆకారంలో సన్నటి ఆకులు పెరుగుతుంటాయి. పెద్దతోటలైతే గోడవారగా పెరుగుతాయి. ఈ రెండు ఆకులను చేర్చి సన్నటి ఆకులు గల తీగను అల్లిబిల్లిగ వాటి చుట్టూ అల్లితే అందంగా వుంటుంది.

పూలు ఆనందం కలుగజేస్తాయి. యిళ్లలో వివిధ వర్ణాల పూలు ఆకులు చేర్చి అమర్చితే మరీఎక్కువ అందగిస్తాయి. అమరికలు గల భావాన్ని వ్యక్తీకరించితే తెలియని సంతోషాన్ని పొందుతాము.

పూలకొమ్మలుగాని, రెమ్మైనాసరే వాని మొదళ్ళు నీళ్ళలోగాని తడి మట్టిలుగాని వుంచితే త్వరగా వాడిపోవు. ★

పాటగా వుండేది. వయసుకు మించిన అల్లరి చేస్తూండేవాడు. పిల్లలను పెద్దలను చేతిలో ఏదివుంటే దానితో చచ్చేలా కొట్టడం. పెద్దవాళ్లను వెక్కిరించటం, తిట్టటం, అందరి ఇండ్లలోను అన్నీ ఎతుకపోవడం మొదలైన అల్లరిపనులు చేస్తూంటే ఆ అబ్బాయి తల్లి మటుకు, నాలుగుసంవత్సరాల వయసులోనే ఖా అబ్బాయి ఇంత చురుకుగా వున్నాడు, పెద్దయితే ఇంకా ఎంత తెలివిగలవాడవుతాడో అని మురిసిపోతూ వుండేది. పైగా వాళ్లబ్బాయి చేసే పనులన్నీ కృష్ణలీలలనీ, వాళ్లబ్బాయి కృష్ణుడనీ చెప్పుకుంటూ వుండేది. ఒకరోజున ఆ శ్రీకృష్ణుడు ఎదురింటి వారమ్మాయి బొమ్మలు దొంగతనంగా ఎతుకు పోతూంటే ఆ అమ్మాయి లాక్కోబోయిందట. అప్పుడా శ్రీకృష్ణుడు ఒక పెద్దరాయి తీసుకొని ఆ అమ్మాయి తలమీదకొట్టి పారిపోయాడట. అప్పుడు ఆఅమ్మాయి తల్లి ఈ 'యశోద' దగ్గర మనవి చేసుకోకపోతే ఆ అబ్బాయి మళ్లీ కొడతాడని తలచి వెళ్లి చెప్పిందట. "ఏమమ్మా మీ అబ్బాయి రాయి తీసుకొని మా అమ్మాయి తల పగలగొట్టాడు. మీరు కొంచెం భయం చెప్పకపోతే లాభం లేద"ని మనవి చేసుకుందట.

దానికి ఆ యశోదమ్మ యేమన్నదంటే, "పిల్లలు కొట్టుకుంటూ వుంటారు. మళ్ళీ ఆడుకుంటూనూవుంటారు. మధ్య పెద్దవాళ్ళు రిపోర్టుచేయడ మెందుకూ అందట తాపీగా.

"ఓమూల నెత్తురు కారుతూ వుంటే రిపోర్టుచేయడ మెందుకు అంటావేమిటమ్మా. ఇట్లాగే వూరుకుంటే రేపొద్దున్న ఏ కంటి మీదనో కొడతాడు. కన్ను పోతే అప్పుడు చేసేదేమిటి. పిల్లవాడికి కొంచెము భయం చెప్పుకోవాలి" అందట ఆ యిల్లాలు.

దానికి ఆ యశోదాదేవి, "అసలు నీ కూతురే రాళ్లు పుచ్చుకొని కొట్టడం నేర్పింది మా వాడికి. అప్పటినుండి అలవాటైపోయింది వాడికి. అదివరకు రాళ్లు చూసి ఎరుగునా మా వాడు" అందట. (అంటే దాని అర్థం ఏమిటంటే, మీ పిల్లే నేర్పింది కాబట్టి మీ పిల్ల కళ్లు పోయినా, కాళ్ళుపోయినా చచ్చినట్లు అని. అనుభవించాలి అంటే ఆ పిల్లదగ్గరనే నేర్చుకొన్నాడని ఋజువేమిటంటారేమో, వాళ్ళఇంటి ఎదురుగుండా వుండడమే దానికి ఋజువు.

పిల్లకు గాయంతగిలి నెత్తురు కారుతూంటే, పిల్లవాడికి భయం చెప్పుకోవడం లేకపోగా కలహానికి సిద్ధమయిందా యశోద.

ఇటువంటి కలహాలు మనం చాలాచోట్ల చూస్తూవుంటాము. కొంతమంది స్త్రీలు తమ పిల్లలమీద పెద్దవాళ్ళు ఫిర్యాదులు చేయడమేమిటి అని అపోహపడుతూ వుంటారు. అదే పొరపాటు. ఈ రోజుల్లో ఎవరి పిల్లల అల్లర్లు వారే భరించలేకుండా వున్నారు. అటువంటప్పుడు పరాయి పిల్లలు వచ్చి తగని అల్లరి చేస్తూవుంటే భరించే ఓపిక ఎవరికుంటుంది. పోనీ ఒక రోజు రెండు రోజులైతే ఏమో అనుకోవచ్చును. నిత్యమూ ఏదో ఒక వస్తువు పాడుచేస్తూవుంటే ఎవరు మాత్రం వూరుకుంటారు. మన పిల్లలనయితే తిట్టుకునో కొట్టుకునో పాడుచెయ్యకుండా చూసుకుంటాము. పరాయి పిల్లల్ని కొట్టలేము. ఒకవేళ కొట్టినా వూరుకోరు. అసలు కొట్టడానికి హక్కు లేదుకూడ. పిల్లలు అల్లరి చేయకుండా చూసుకొనే బాధ్యత తల్లి తండ్రులమీద వుంటుంది కాబట్టి పరాయి పిల్లలు తగని అల్లరి చేస్తూవుంటే తప్పనిసరిగా తల్లితండ్రులతో చెప్పవలసి వస్తుంది. అంతమాత్రానికే వారికి పిల్లలంటే కిట్టదనీ పిల్లలమీద పెద్దవాళ్లు రిపోర్టుచేయడ మేమిటనీ అనుకోవడం చాలా పొరపాటు. కొంత మంది స్త్రీలు తమ పిల్లలు అల్లరిపిల్లలు అని తెలుసుండీ కూడా, పొరుగిండ్లకు తోలేసి హాయిగా నిద్రపోతూవుంటారు మధ్యాహ్నం పూట. మరి వాళ్లుకూడా పడుకున్నంటారేమోనన్న సంగతి వారికి అవసరంలేదు. తమ పిల్లలమూలంగా ఇతరులు పడే బాధలు కొంచెముకూడా తెలుసుకోరు. అందరూ అల్లాగే వుంటారని నేననడంలేదు. కొంత మంది ఇండ్లలో ఎంతమంది పిల్లలు వున్నా అల్లరనేది కన్పడదు. ఒకవేళ పొరుగిండ్లలో అల్లరిచేసినప్పటికీ మీ అబ్బాయి ఫలానా వస్తువు పాడుచేశాడని ఎవరైనా చెప్పినా అయ్యో అలాగా నేను కోప్పడతాలెండి అని సరి చెప్పే తల్లులూ వున్నారు. అటువంటి వారినిగురించి కాదు నేను వ్రాసేది. పిల్లవాడు తెలియక పాడుచేస్తే పెద్దదానవు బుద్ధిలేక రిపోర్టు చేయడానికి వచ్చేవుటమ్మా అని కయ్యానికి కాలుదువ్వే అమ్మలను గురించే నేను వ్రాస్తా. అయితే పిల్లలకు తెలియదు కనుకనే పెద్దవాళ్లకు చెప్తే తమ పిల్లలకు భయం చెప్పుకుంటారని చెప్తున్నామన్న ఆలోచనఉండాలి. ఇంతకూ మాటలో వుంది మర్యాద అంతా. పిల్లలుగల తల్లులు ముఖ్యంగా ఇటువంటివి తెలుసుకోవాలి. కొంచెము అల్లరి పిల్లలుకనుక వుంటే ఒకంట కనిపెట్టి జాగ్రత్తగా చూసుకోవాలి. తమ పిల్లలమీద నేరాలు చెప్తున్నామనీ, తమ పిల్లలంటే ఇరుగు పొరుగువారికి కిట్టదని అపోహపడి ఇరుగుపొరుగువారిలో కలహాలు తెచ్చుకోవడం ఇల్లాళ్లకుమంచిపనికాదు.

# వనితా వాణి



ప్రభావతి వ్రాసిన ఎంతమంది ల్లలుపి మాకు అనే వ్యాసం చదివాను. చాల బాగుంది. ఆమె చెప్పినవిధంగా ఈరోజుల్లో చాలామంది దారిద్ర్యాలని జీతాలతో గంపెడు పిల్లలతో బ్రతుకుపై విరక్తిచెంది "సంసారం సాగరం దుఃఖం" అని అంటూండడం పరిపాటి. పదుసైదుగురు పిల్లల్ని కని స్వల్ప ఆదాయంతో పోషించలేక వాళ్లను పస్తుల తోను వచ్చి మంచిసిళ్ళతోను బాధించేకన్న కనకపోవడమే మంచిదని నా ఉద్దేశ్యం. మరి అలా బాధలు పెట్టడం మరింత పాపంకదా? దేశం సుభిక్షంగా ఉండాలంటే బర్త్ కంట్రోల్ అవసరం.

యం. పుష్పావతి.

* * *

శ్రీమతి విజయం వ్రాసిన "ముద్దుటగా ముగ్గురుపిల్లలతో" అను వ్యాసం ప్రతివారూ చదవదగ్గ విషయం. వ్యాసకర్తయిత్రికి నా అభినందనములు.

ఎస్. సునంద (పంటలపాక.)

* * *

కొందరు ఆపరేషన్‌వలన తమకు అపాయం కలుగుతుందని గాని ఇంట్లో పెద్దవాళ్ల భయంవలనగాని వెనుకాడుచున్నారు. ఆపరేషన్‌గాక సామాన్యమైన మందులయితే చాలామంది తీసుకొంటారనుకొంటాను. ప్రస్తుతం అట్లాటివి కనిపెట్టుచున్నారని వినికిడి. కనుక సోదరీమణులు భయమువీడి ముందడుగు వేస్తారనుకొంటాను. కనుక ఇంట్లో పెద్దవాళ్ళేమనుకొంటారో, ఇరుగమ్మ పొరుగమ్మ లేమనుకొంటారో అను సంశయాలు మానేసి వారి ఆరోగ్యం, సుఖం చూచుకుని ముందడుగు వేయాలి.

* * *

మా యింట్లో డ్రెసింగ్ టేబుల్ మీద అద్దము ముందుకు రోజూ పిచుక లువచ్చి అద్దమును పొడుస్తూ, పాడు చేయుచున్నవి. అవి చూచి నేను అద్దమునకు తెరకట్టించాను. పిచుకలు తెర తప్పించుకునిపోయి అద్దమును పాడుచేయుచున్నవి. పిచుకలను పారదోలడం ఎలాగకీ అద్దమును శుభ్రముగా ఉంచుకొనుట ఎటులనో వనితాలోకం పాఠకులు ఎవరైనా తెలుపుతారని ఆశిస్తున్నాను.

వి. ఎం. లక్ష్మి, (మద్రాసు)

* * *

జి. సూర్యకాంతగారు వ్రాసిన "బి. ఏ. పరీక్షకు మావారి చదువు" అన్న వ్యాసం మీద విమర్శ వ్రాస్తూ ఈవ్యాసం ఎందుకుపయోగిస్తుందో బోధపడలేదన్నారు ఒకరు. చదువుకోటానికి ఉపయోగిస్తుందని మర్చిపోగూడదు.

కె. బి. విమల (కొల్లూరు)

* * *

అడవికొలను పార్వతి గారు వనితా లోకంలో వ్రాసిన, వార్తేరులో వస్తుప్రదర్శనం వ్యాసం చదివినాను. వారికి నా కృతజ్ఞతాభివందనములు.

వి. హెచ్. సుబ్బారాయన్.వార్తేరు.)

* * *

## మహిళా సంఘాలు

చేటపాలెం-సారస్వత నికేతన మహిళా మండలి వార్షికోత్సవం ఫిబ్రవరి 21 న జరుపబడింది. ఈ సందర్భంలో విజయవాడనుండి డా॥ శ్రీమతి అచ్చమాంబగారు, చీరాలనుండి కుమారి డా॥ రంగమణి, కుమారి డాక్టర్ ఫ్రేజర్, కాలేజి ప్రిన్సిపాల్ గారి సతీమణి కొమ్మళ్ళ రుక్మిణమ్మగారు, ఆహ్వానింపబడ్డారు. వీరితోపాటు చీరాల మహిళా మండలినుండికొందరు వచ్చారు. ఆరోజు సాయంత్రం 4గం॥సుబ్బరాయ మహల్ నందు గ్రంథాలయ కార్యదర్శి శ్రీ శ్రీనివాసరావుగారి సతీమణి స్వాగతం చెప్పారు. మహిళా మండలి సభ్యులూ, ఆహ్వానితులూ కలసి-ఫోటో తీయించుకొన్న తర్వాత శ్రీమతి రుక్మిణమ్మగారి అధ్యక్షతన సభ జరిగింది. కార్యదర్శిని శ్రీమతి ఆదిశేషమ్మ మండలి వార్షిక నివేదిక చదివి కార్యకలాపాలను వివరించిన అనంతరం రంగమణిగారు ఉపన్యసించారు. మహిళా మండలి ఎందుకు పెట్టింది, స్త్రీలు ఈ అవకాశాన్ని ఎలా వినియోగించాలి, నేటి మన స్త్రీలపరిస్థితి, సంకుచిత స్వభావాలు, పురాణ స్త్రీల గొప్పతనం, దాని సందేశం, నేటిమన కర్తవ్యం—ఇలాటి అనేక విషయాలమీద చాల చక్కగా చెప్పారు. తర్వాత డా॥ ఫ్రేజర్ గారు, మండలి అధ్యక్షురాలు, ఎస్. ఇ. ఓ. గారుకూడా కొద్దిసేపు మాట్లాడారు. ఆరాత్రి ఆహ్వానితులకు శ్రీ శ్రీనివాసరావు గారింట్లో విందు జరిగింది.

6½ గం॥ గరల్సు మిడిల్ స్కూల్లో జరిగిన సభలో డా॥ అచ్చమాంబగారు మాట్లాడారు. తర్వాత బాలికలు రకరకాలు గానృత్యాలు చేశారు. అనంతరం "ఉత్తమ ఇల్లాలు" అనే నాటిక ప్రదర్శింపబడింది—ఇందులో ఇతర మహిళలతోపాటు మహిళా మండలి కార్యనిర్వాహకవర్గంవారు కూడా పాల్గొన్నారు. వీరికి స్టేజి అనుభవం అంతకెక్కగా లేకపోయినా తమ తమ పాత్రలను చక్కగా ప్రదర్శించారు. గయ్యాళి అత్తగారుగా కుమారి రమణమ్మగారు ప్రశంసలందుకొన్నారు.

ఆరోజు మధ్యాహ్నం 1 గం॥ నుండి 4 గం॥ దాకా ముగ్గులు, ఎంబ్రాయిడరీ, డ్రస్సు మేకింగ్, వక్తృత్వము, కావ్యపఠనము, సంగీతము—వీటిలో పోటీలు జరుపబడినాయి. అనేక మంది మహిళలు ఇందులో పాల్గొని తమ ప్రతిభావిశేషాలను ప్రదర్శించారు. ప్రత్యేక నైపుణ్యం చూపినవారికి నాటిక అనంతరం బహుమతులు పంచిపెట్టారు.

(జి. ఎస్. వాణి మహిళామండలి సభ్యురాలు, చేటపాలెం.)

కూడేరు మహిళామండలి సభ్యురాండ్రు ఫిబ్రవరి 22 న కస్తూరిబా గాంధీ వర్ధంతి జరిపారు. ఉదయం 8 గంటలకు, సమాజం సభ్యురాలైన శ్రీమతి బృందావనమ్మగారు పతాకావిష్కరణము జరిపారు. మధ్యాహ్నము సుమారు 500 మంది బీదలకు అన్నదానము చేశారు. అందుకై సభ్యురాండ్రంతా ధన ధాన్యరూపమున విరాళములు సేకరించి ఉంచారు. గ్రామ ప్రజలు ఇందుకు చాలా తోడ్పడ్డారు. సాయంత్రము 6 గంటలకు ప్రత్యేకముగా స్త్రీలే శ్రీమతి భాస్కరమ్మ గారి అధ్యక్షతన బహిరంగసభ జరిపారు. ప్రార్థనానంతరము శ్రీమతి కస్తూరిభా గాంధి, ఆమె ఉన్నత ఆశయాలు, ఆదర్శాలు, ప్రేమ, పతిభక్తి మొదలగువాటినిగూర్చి గ్రామసేవిక శ్రీమతి సుగుణవతి చక్కటి ఉపన్యాసమిచ్చారు. సభ తరువాత పిల్లల వినోద కార్యక్రమములు జరిగాయి. ఈ కార్యక్రమములో మహిళాసమాజ సభ్యురాండ్రెల్లరు అత్యుత్సాహముతో పాల్గొని కార్యక్రమమును దిగ్విజయముగా జరిపించారు.

బి. లక్ష్మీనరసమ్మ.
(మహిళామండలి అధ్యక్షురాలు,
కూడేరు, అనంతపురం తాలూకా.) ★

# ★ ప్రైవేటు మాష్టరు ★

(27-వ పేజీ తరువాయి)

కున్నాడు. అట్లా జరగొచ్చునని అనుకుంటూనే సూర్యనారాయణమూర్తి బజారు గాకిట్లో అడుగుపెట్టాడు.

ఇంటిముందు వాకిట్లో రాజ్యలక్ష్మి ఎవ్వరితోనో మాట్లాడుతూంది. సూర్యనారాయణమూర్తికి ఆశ్చర్యం వేసింది దూరంగా ఉండటంచాతా, చీకటివల్ల ఆ వ్యక్తిని పోల్చుకోలేక పోయాడు. సంకోచిస్తూనే మెల్లగా వెళ్ళాడు.

వాళ్ళు ఏం మాట్లాడుకుంటూన్నట్లు లేదు.

ఆ వ్యక్తి గాబరా పడినట్టుగా ఉలిక్కిపడ్డాడు.

"మాష్టరుగారు వొచ్చారు—" అన్నది రాజ్యలక్ష్మి నిశ్చలంగా

"ఆఁ! వొచ్చారా! నేనండీ!" అంటూ మాష్టరుగారివైపు తిరిగాడు చీకట్లో ఆ వ్యక్తి ఇంట్లోని లాంతరుకాంతి బయట నిలబడ్డ వ్యక్తులమీద ప్రసరించటంలేదు ఆ గొంతునుబట్టి ఆ వొచ్చిన వ్యక్తి ఎవరైందీ గ్రహించాడు సూర్యనారాయణమూర్తి. ఎందుకో ముఖం చిట్లించుకున్నాడు చీకట్లో.

"బాపినీడుగారూ "

"అవునండీ! తమ కోసమే వొచ్చాను మా పెదనాన్నగారిఅబ్బాయికి తమరు . ప్రైవేటు చెప్పాలండీ! అందుకోసమే తమతో మాట్లాడదామని వొచ్చాను. ప్రొద్దుటనించీ తీరిందికాదు ఇవాళ పంచాయితీబోర్డు ఆఫీసులో మీటింగు లెండి "బాపినీడు అంత తడబడుతూ ఎందుకు మాట్లాడాలో పంతులుగారికి అర్థం కాలేదు. అతను తను లేని సమయంలో తన కోసం కోరి వొచ్చినట్టుగానే తోచింది

"సరే! అల్లాగేలెండి" సూర్యనారాయణమూర్తి విసవిస ఇంట్లోకి నడిచివెళ్ళాడు.

ఆ వూరి పంచాయితీబోర్డు వైస్ ప్రెసిడెంటు బాపినీడు చీకట్లో రాజ్యలక్ష్మి వంక చూస్తూ చూస్తూ బజారు వాకిలి ఎక్కాడు

సూర్యనారాయణ మూర్తికి ఎందుకో ఇంట్లోకి వెళ్ళగానే స్వేదం వొంటినిండా కమ్ముకుంది. బాపినీడుని చూచినప్పట్నించీ—తెలియని అశాంతి అతనిలో బయలుదేరింది అతను ఆవేళప్పుడు, తను లేని సమయం చూసి ఎందుకు తన ఇంటికి రావాలి? పిల్లవాడి ప్రైవేటు విషయమైతే రేపు రావొచ్చునుగదా! అతను తన గడపలో అడుగు పెట్టడంలో ఏవో అంతర్యం ఉంది తను వొచ్చేముందు. రాజ్యలక్ష్మితో ఏమైనా మాట్లాడాడా! అతను వొచ్చి ఎంతసేపైంది? అతను తన ఇంట్లో అడుగు పెట్టడం ఎవరైనా చూశారేమో! . ఎంత అప్రతిష్ట?

సూర్యనారాయణమూర్తి అనాలోచితంగా వంటసామగ్రి దగ్గరకు వెళ్లాడు వంట చేసుకోనేందుకు అరసోలెడు బియ్యం గిన్నెలో పోశాడు పొయ్యిలో పేళ్ళూ, పిడకలూ అమర్చి కిరసనాయిల్ పోశాడు కొద్దిగా, త్వరగా రాజుకోనేందుకు. సరిగ్గా అదేసమయంలో రాజ్యలక్ష్మి వొచ్చింది

"అప్పుడే పొయ్యి వెలిగించారా!. ఆర్పివేయండి ఇప్పుడు ఇంత ప్రొద్దుపోయి వంట చేసుకుంటారా? ఇంకా నయం ఇవాళ మా ఇంట్లో భోంచేయవలసిందే—" అన్నది రాజ్యలక్ష్మి పొయ్యిదగ్గరకు వస్తూ.

వినిపించుకోకుండా సూర్యనారాయణమూర్తిగిన్నెలో నీళ్ళుపోసి పొయ్యిమీద పెట్టబోయాడు రాజ్యలక్ష్మి అతని చేతుల్ని మృదువుగా తాకి - అతని కళ్ళల్లోకి మోహముగా చూసింది. అప్రయత్నంగా అతని వేళ్ళు పట్టుదప్పిపోయినాయి. అతని చూపులు హఠాత్తుగాచల్లబడ్డాయి బియ్యపు గిన్నెను క్రిందబెట్టి, పొయ్యిలో నీళ్ళు పోసింది రాజ్యలక్ష్మి పొయ్యి చల్లారింది, సూర్యనారాయణమూర్తి హృదయం కూడా చల్లారింది

* * *

తాను ఎదురుచూస్తున్న ముహూర్తం ఆరాత్రి ఆమె భోజనానికి ఆహ్వానించడంతో వొచ్చిందని అనుకున్నాడు గానీ - సూర్యనారాయణమూర్తి ఆరాత్రి ఆశించినంత అనుభూతిని పొందలేదు. మనస్సంతా చీకాగ్గా వుండంవల్ల - ఆమె ఆప్యాయంగా అభిమానంగా అన్నమూ, కూరలు వడ్డించి, అన్నం తిన్నంతసేపూ దగ్గరకూర్చున్నా, నల్లదాలజోడు పెట్టుకొన్నవాడిలా ప్రవర్తించాడు ఆమె హృదయపు లోతుల్ని అర్థం చేసుకోలేక పోయాడు, ఆమె చూపుల భావాన్ని, గ్రహింపలేకపోయాడు. ఆమె చేష్టల పరిభాషను అవగాహన చేసుకోలేక పోయాడు

మరునాడు బాపినీడు తన పెద్దనాన్నగారి కుమారుణ్ణి ప్రైవేటు స్కూలుకు పంపించలేదు అసలు అతని పెదనాన్నకు ప్రైవేటు స్కూల్లో చేరే కొమారుడు ఉన్నాడో, లేదో కూడా తెలియదు.

సూర్యనారాయణమూర్తిహృదయంలోని కల్లోలం తగ్గలేదు ఆరాత్రేమిటో బాపినీడుగారు ఏం మాట్లాడారు?, అని ఆమెను అడుగుదామనుకున్నాడు గానీ - తనకి ఆ అధికారంలేదన్నట్లు 'ఫీ'లయ్యాడు. ఆరోజు అతను పిల్లలకు పాఠాలు సక్రమంగా చెప్పలేకపోయాడు. జవాబు చెప్పలేని ఇద్దరు ముగ్గురు పిల్లల్ని - విసుక్కుని కొట్టాడు. తరువాత అనవసరంగా కొట్టానని పశ్చాత్తాపపడ్డాడు.

ఆరోజు సాయంత్రం బడి వొదిలిపెట్టగానే సూర్యనారాయణమూర్తి మామూలుగా బకింగ్‌హామ్ కెనాల్‌కు వెళ్ళేందుకు బయల్దేరాడు కాని ఆరోజు కొంచెం ఆలస్యం జరిగింది - వెళదామా, ఒద్దా అని మథనపడేప్పటికి అతను బయలుదేరేటప్పుడు రాజ్యలక్ష్మి ఇల్లు వూడ్చ్తోంది అతను అట్లా బజారు వాకిలి దాటాడో లేదో, బాపినీడుగారి జతగాడు చిన్న సంచీతో ఇంట్లోకి వెళ్ళాడు సూర్యనారాయణమూర్తి గుండె వొణికింది అడుగు ముందుకు పడలేదు. ఆ సంచీలో ఏమున్నాయి? చీరెలా, జాకెట్లా డబ్బా, మరి ఇంకేమైనా? బాపినీడే పంపాడా? ఎందుకు? వెనక్కు మళ్ళి ఇంట్లోకి వెళదామా? అనిపించింది సూర్యనారాయణమూర్తికి. కాని ఆత్మ అంగీకరించలేదు కాళ్ళీడ్చుకుంటూ కాలవకట్ట ఎక్కాడు తీరిగ్గా ఆలోచించుకోవటానికి.

బాగా పొద్దుపోయింది, సూర్యనారాయణమూర్తి ఇంటకి తిరిగి వొచ్చేటప్పటికి. రాజ్యలక్ష్మి లైటు బయటపెట్టుకుని పేపరు చదువుకుంటోంది ఆమె దగ్గరకు రాగానే సువాసన 'గుఫ్'న కొట్టింది కుసేగా పరిమళమా? మనోరంజనియా? ఈవెనింగ్ ఇన్ ప్యారిసా? కొత్తచీర ధరించింది మైసూరు సిల్కుచీర తలలో మల్లెపూలు!—ఈ అలంకరణంతా బాపినీడు చేయించిందే! ఎవరికోసం? ఎందుకు?

—ఇంటిగడప ఎక్కుతూ తూలి పడబోయాడుసూర్యనారాయణమూర్తి. తుణాల మీద కోపం శరీరాన్నంతటినీ ప్రాకింది.

# ★ ప్రైవేటుమాష్టరు ★

ఇంట్లోకి వెళ్ళగానే మంచం మీద వాలబడ్డాడు. వంటప్రయత్నం లేదు ఆకలిగా లేదు.

అరగంట తర్వాత రాజ్యలక్ష్మి అతని గదిలోకి వొచ్చింది వంట చేసుకోకుండా పడుకుంటే ఏమైనా తలనొప్పి కామోసు అనుకున్నది.

"తలనొప్పిగా వున్నదాండీ?" అన్నది రాజ్యలక్ష్మి ఆమె దగ్గరగా వొచ్చి నిలబడింది.

ఆసువాసన లేదు ఆచీర తళుకు లేదు.

సూర్యనారాయణమూర్తి దిగ్భ్రాంతి చెందాడు తను వస్తూ వస్తూ చూచింది ఆమెను కాదా? కలేమైనా కన్నాడా? ఆ అలంకరణా, అందం, కీవి—ఇప్పుడు లేవే! తనగదిలోకి వస్తూ—మామూలు వేషం వేసిందా? ఆ కొత్తచీరెలో, సువాసనలో సౌందర్యంలో—తను ఆమెను చూడరాదా? ఆఅందమూ, అలంకరణా, అనురాగమూ, అభిమానమూ—బాపినీడుకోసమా?

దిండుమీద తల నిర్లక్ష్యంగా వ్రేళ్ళాడవేశాడు.

"తలనొప్పిగా ఉన్నదా?" అంటూ రాజ్యలక్ష్మి తలగడప్రక్కన కూర్చొని అతని నుదురుమీద మెత్తగా చేయివేసింది

ఆమె చేతిని కర్కశంగా తొలగించాడు అతను. ముఖం తిప్పి పడుకున్నాడు. అతనికి కోపంవచ్చినట్టు గ్రహించింది. కాని ఆ కోపానికి కారణం ఏమిటో ఆమెకు అర్థం కాలేదు. అమృతాంజనం తెచ్చి అతని నుదురుకు వ్రాసేందుకు ప్రయత్నించింది కానీ అతను "అక్కర్లేదు" అని గర్జించాడు. ఆమె మారుమాట్లాడకుండా తనఇంట్లోకి వెళ్ళింది. సూర్యనారాయణమూర్తి దిండుమీద మూగగా కన్నీళ్ళు కార్చాడు.

ఎప్పుడు కునుకుపట్టిందో ఎప్పుడు మెలకువ వచ్చిందో తెలీదు సూర్యనారాయణమూర్తికి. మెలకువ వచ్చేటప్పటికి నడిఝాము వుంటుందనుకున్నాడు. బద్ధకంగా లేచాడు. ఆకలైనట్టుగావుంది. ఆవేళప్పుడు వంట ఎలా చేసుకోవడం? ఏమీ తోచక, తలుపు తెరచుకుని బయటికొచ్చాడు.



నిర్ఘాంతపోయాడు ఆ నిద్రమత్తులోనే ఆదృశ్యం చూసి బాపినీడు గబగబా ఆమె ఇంట్లో ప్రవేశించాడు. ఆమె తలుపు తెరిచే వుంచినట్టుంది గట్టులేని ప్రవాహంలాగ—లోపల జొరబడ్డాడు కొలది క్షణాల్లోనే తలుపులు మూసుకోవడంగూడా చెవులారా విన్నాడు.

అతని తల దిమ్మెక్కిపోయింది వొళ్ళంతా పామును చలిచీమలు పీకుతున్నట్టుగా వుంది

పరిస్థితులు ఎంత త్వరగా విషమించాయి 'కనకపు సింహాసనమున ' అన్నట్టు తాను ఎడారిలోపడ్డ ఆమె జీవితానికి నీటివసతి కల్పిస్తే—ఆ నీరును పాడుచేసింది. ఎండిమోడైన ఆమె జీవితానికి ఆకుల్ని చిగిరింపజేస్తే-ఆ ఆకుల్ని రాల్చుకొనేందుకు ప్రయత్నిస్తోంది. తను చేసిన సహాయం, చూపిన అభిమానం, ఆదరణ-అంతా దుర్వినియోగపరుస్తోంది ఆమె జీవితానికి గౌరవప్రదమైన బ్రతుకుతెరువును కల్పిస్తే-తప్పుదారిలో నీచంగా, అవినీతిగా బ్రతకాలని చూస్తోంది! ఆమె జీవితదృక్పథమే అంతేనేమో. తనుపొరపాటుబడ్డాడు ఆమె విషయంలో. రాజ్యలక్ష్మి నిజాయితీపరురాలనుకున్నాడు హృదయంకల వ్యక్తి అనుకున్నాడు సాంఘిక విలువలకు తన జీవితాన్ని లయపర్చే మణిపూస అనుకున్నాడు; ఇంకా ఏమేమో అనుకున్నాడు కాని ఆమె అట్లాంటిది కాదు మోసంతో లోకంలో స్థానాన్ని ఏర్పరచుకోవాలని తహతహలాడే వ్యక్తి. తన అంతస్తూ గతించిన జీవితపు ప్రమాణమూ, సంఘం కట్టబెట్టిన స్థానమూ మర్చి-అవినీతిద్వారా జీవితంలో ఆనందాన్ని పొందుదామనుకునే నీతిలేని మనిషి. మనస్సును పరిస్థితులపరంగా మళ్ళించుకొని హృదయాన్ని అవకాశాల కనుగుణంగా తిప్పకొని, బ్రతుకుదెరువుకోసం - నీతిని, న్యాయాన్నీ, లక్ష్యంచేయని స్త్రీ రాజ్యలక్ష్మి. ఆమెను జీవితంలో అర్ధాంగిగా పొంది-జీవితాన్ని మధురతరం చేసుకుందామనుకున్నాడు. ఎటువంటి దురాలోచన? ఏం చేస్తాడు? మోసగింపబడ్డాడు. ఆమె నవ్వే ప్రతినవ్వు వెనుకా సముద్రపు కెరటాల సౌందర్యం తొణికిసలాడుతుందనీ, ఆమె చూసే ప్రతిచూపు వెనుకా అంతులేని అనురాగం పుట్టిపడుతుందనీ, ఆమె మాట్లాడే ప్రతిమాటలో ఎంతో వాస్తవమూ, న్యాయమూ, నీతీ పెనవేసికొని వున్నాయనీ,-ఆమె మనస్సు వెన్నపూస మెత్తదనాన్ని కలిగి వున్నదనీ, ఆమె హృదయం హిమగిరి శిఖరంలాంటిదనీ, ఆమె అనుభవాలు కాచి వడబోసిన సత్యాలనీ తను మూన్మగు. కాని నిలకడమీదనైనా నిజం బయటపడింది తక్షణం ఆమెను తన బ్రతుకు చూసుకోమనటమే-తన కర్తవ్యం. ఆమె జీవితం ఎంత క్రిందకు దిగజారినా, ఆమె బ్రతుకు ఎన్ని కష్టాల్లో యిరుక్కున్నా, ఆమెకు ఈ లోకంలో ఎట్లాంటి గతి పట్టినా తనకు అక్కర్లేదు! ఆమెకూ తనకూ ఏం సంబంధం? రైల్లో ప్రయాణికులు-పెట్టెలో ఉన్నంతసేపూ కులాసాగా కాలక్షేపం చేస్తారు ఆమెతో తనో,తనతో ఆమో ఇంకా ఆ పెట్టెలోనే ప్రయాణంచేసి గమ్యస్థానం జేరుకోవాలనుకున్నాడు కాని ఆమె గమ్యస్థానం త్వరగానే వొచ్చింది పెట్టెలోంచి దిగిపోతుంది; తను పెట్టెలో ప్రయాణిస్తాడు ఒంటరిగా అంతే తమ సంబంధం! ఆమె బాపినీడుతో సంబంధం పెట్టుకుంటే తనకేం, ఇంకా ఎవరితో సంబంధం పెట్టుకుంటే తనకేం? ఆమె బ్రతుకూ, బుద్ధీ, జీవితపంథా-తెలిసివొచ్చింది తనకు తను జాగ్రత్తపడటం మంచిది ఆమె జీవితం తాలూకు చెడు, బ్రతుకులో అవినీతి, అపఖ్యాతి-తన జీవితంమీద ఎట్లాంటి ప్రభావమూ చూపకముందే మేల్కొవటం మంచిది! ఆమెకోసం తను బాధపడటం, ఆమె బ్రతుకు అట్లా అన్యాయంగా పాడైపోతుందేనని తను ఆవేదన పడటం — అవివేకం; ఆమెమీద తనకు అధికారం లేదు; ఆమె జీవితానికి తను హామీ కాదు, ఆమె బ్రతుకులోని మంచీ-చెడులకు తను గీటురాయి కాదు దేశంలో ఎంతమంది ఆడవాళ్ళు జీవనాధారం లేకనో, వయస్సు పెట్టే గిలిగింతలకు తట్టుకోలేకనో, మగవాళ్ళ ప్రలాపాలకు మోసపోయో, అవినీతితో కూడుకున్న జీవితంలో అమరానందం ఉన్నదని విశ్వసించో—లేచిపోవడం లేదు? బ్రతుకుల్ని పాడుచేసుగోవడం లేదు? అపఖ్యాతి పాలుగావడం లేదు? రాజ్యలక్ష్మి అంతే! ఆమె భూతభవిష్యద్వర్తమానాలతో తనకు ఏలాంటి సంబంధమూ లేదు, ఈ గ్రామంలో తనపరువు నిలబడాలంటే, తన జీవనాధారం క్షేమంగా వుండాలంటే, తనకి సాంఘిక గౌరవం వుండాలంటే—రేపు ఉదయమే రాజ్యలక్ష్మిని ఇంటినించి బయటికి పంపించాలి. 'నీ పాట్లు నువ్వు పడు పొట్టకూటికి' అని నిష్కర్షగా చెప్పివేయాలి అంతకంటె శ్రేయస్కరమైన మార్గం లేదు. ఆమె కన్నీరు జల్లు కురిపించి, కాళ్ళమీదపడి క్షమించమని క్షోభపెట్టినా-కించిత్తుగూడా కరుణ చూపరాదు. బెదిరించినా పట్టు జారవిడువరాదు.

ఆ తెల్లవారుఝామున ప్రైవేటుమాష్టరు సూర్యనారాయణమూర్తి ఆ విధంగా దృఢంగా ఒక నిశ్చయానికి వొచ్చాడు. ఆ పైన రెండు గంటలసేపు నిశ్చింతగా నిద్రించాడు. (మిగతా వచ్చేవారం)

# సినిమా

## ఉత్సవాలలో యుద్ధాలు

ఉత్సవాలకూ యుద్ధాలకూ అమోఘంగా బోలెడు అన్యోన్యత ఉండేలా కనిపించదు గాని ఉంటుంది. ఉత్సవంలో ఉండుండి యుద్ధం వస్తుంది. యుద్ధం అవుతూనే ఉత్సవం జరుగుతుంది. కాగా, సినిమానాట కొత్సవాలలో బహుమతులకై భీకరనిర్బద్ధ సంగ్రామాలు జరుగుతూ ఉంటాయి. అంతర్జాతీయస్థాయి వ్యవహారాలలో దాదాపు అంతటా ఏదో ఒక ఫ్యాన్సీ డ్రెస్సులో 'శీతలయుద్ధం' అను కోల్డ్‌వార్ తిరుగుతూనే ఉంటుంది. అది మా టిక్కెట్టులో వచ్చింది మీరే తీసుకొచ్చారు అని ఇటువారూ పడమటి వారూ ఆరోపించుకొంటూ ఉంటారు. మొత్తానికి ఎలాగో అలా ఈ కోల్డ్‌వార్, జలుబులాగే సర్వత్రా వ్యాపిస్తోందిట. ఇది జొరబడకుండా ఉన్న వాటిల్లో అంతర్జాతీయ చలన చిత్రోత్సవం ఒకటి అని మొన్నటి దాకా అనుకుంటూ వచ్చారు; ఈమధ్య మానేస్తున్నారు.

కారణం: కోల్డ్‌వారు వీరులు, అటూ ఇటూ చెందని వారిని తమవేపు తిప్పుకోవడానికి చేసే ప్రచారంలో, ఉపచారంలో అంతర్జాతీయ ఉత్సవాలలో బహుమతులను కూడా పావులుగా వాడుతున్నారని వారూ వీరూ కూడా ఒకరిమీద ఒకరు ఆరోపణలు వేసుకోవడం జరుగుతోంది. ఇందులో నిజానిజాలు ఎలా ఉన్నా, కొన్ని కొన్ని బహుమతుల అర్హతానర్హతలను నిర్వికార దృష్టితో పరిశీలిస్తే, ఇవి "శీతలయుద్ధ ప్రచారాలే" నని అనుమానం కలుగుతున్నట్లు బాధ్యతగల కొందరు విశేషజ్ఞులు అమధ్య అన్నారు...

దీనికి తరువాతభాగం అన్నట్టుగా ఇపుడు అంతర్జాతీయ చలనచిత్ర నిర్మాతల సమాఖ్య వారు ఇటీవల సమావేశమై కార్లవివారీ (జెకోస్లావాకియా), మాస్కో చలన చిత్రోత్సవాలను ఇటుపై గుర్తించకూడదని నిశ్చయించారు.

కార్లవీవారీని అసలు వీరు గుర్తించి రెండేళ్ళు అయింది. (అక్కడే జాగ్‌తే రహో చిత్రం బహుమతిపొందింది.) ఇంత

పొన్నలూరి బ్రదర్స్‌వారి "దైవబలం" చిత్రంలో గుమ్మడి, రామారావు, జయశ్రీ, మాలతి.



# ★ సంగీత వార్తలు ★

సంగీతరసిక ప్రధానచిత్రం శారదావారి 'జయభేరి' ఉగాదికానుకగా ఏప్రిల్ 9న విడుదలవుతోంది గీతరచయితలు మల్లాదిరామకృష్ణశాస్త్రిఆరుద్ర.సంగీతరచయిత పెండ్యాల

* * *

ఇటీవలి పాటలలో విశేష జనాదరణ పొందిన వాటిలో "షిరో అరబ్ హమారా, హిందూస్తాఁ హమారా" ఒకటి. "ఫిర్ సుబాహోగి" చిత్రంలోని ఈ పాటలో సంగీతం సాహిత్యం సుశ్రావ్యగానం మూడూ మనోహరంగా కుదిరాయి; సాహిర్ లుధియాం.

మనదేశంలో అద్భుతమైన 'ఐస్ బాల్లెట్' (ఐస్ షో) ప్రదర్శనాలు ఇస్తున్న సోవియట్ బృందంవారు చాల మంది ఈ పాట విని మెచ్చుకున్నారు. నేర్చుకొని, పాడుకోవడం ద్వారా పాటకి, గీతసంగీతకారులకు జోహారు అర్పించారు.

* * *

"ఎవరది! ఎవరుకావాలండీ?"

"అబ్బే ఎవరూవద్దండి. ఊరికనే."

"ఊ?"

"రాజేశ్వరరావు పాట వస్తోందికదా విందామని ఆగానండి"

"అలాగా లోపలికిరండి కూర్చోండి"

* * *

"థాంక్స్. ఈపాటవిని మూడేళ్లయింది"

"మీకు రాజేశ్వరరావు చాలా యిష్టమా"

"పిచ్చి"

"నాకూ అంతే. కూర్చోండి. మీరు కొత్త రికార్డు విన్నారా?"

చాలా మందికి జీవితాంతం వర్తించే స్నేహాలకు నాంది వాక్యాలు ఇలాంటివే.

ఈ మధ్య ఒక సంగీత గోష్ఠిలో ఒక పెద్ద మనిషి లలిత సంగీతం గురించి మాట్లాడుతూ తన అనుభవాలు ప్రస్తావించి ఇటువంటి సందర్భం ఒకటి ఉదహరించారు.

సభకు వచ్చినవారిలో కొందరికి శాస్త్రీయ సంగీతం అంటే ఎంతకోపమో, "సినిమామ్యూజిక్" అన్నా అంతలా కసి.

లలిత సంగీతమే నికార్సయిన బాపతు అని దానికి అటూ ఇటూ రెండు గోడలుకట్టి, వ్యక్తులమధ్య దేశాలమధ్య స్నేహం పెంపొందించేది ఇదేనని వారు అన్నారు.

కూర్చున్న పదిమందిలో ఐదుగురు పాడారు.

చివరికి అంతా అయిపోయాక, మిగతా ఐదుగురిలో ఇద్దరు పాడినవాళ్లదగ్గ "—పిక్చర్లో సాంగు మీకు వచ్చా" అని అడిగి పాడించుకున్నారు!

సినీ. కొన్ని ఫిల్మ్ గీతాలు బాగుండనంత మాత్రాన సినీ సంగీతాన్ని చులకన చేయడం భావ్యం కాదు అని మొదటిపెద్ద మనిషి హెచ్చరించారు.

* * *

ప్రసిద్ధ సరోద్ విద్వాంసుడు, అలీ అక్బర్ ఖాఁ మార్చి 15 నుండి తూర్పు ఆఫ్రికాలో పర్యటించి గాన సభలు చేయడానికి వెళ్లారు.

కొంతకాలం క్రితం గాయకుడు తలత్ మహమూద్ అక్కడ పర్యటించి అక్కడివారి గౌరవాభిమానాలు గడించుకురావడం విదితమే. ❖

## ఉత్సవాలలో యుద్ధం

లోనే జారిపోతారు. ఉదారంగా వ్యవహరించాలి తప్ప, రాజకీయాల క్రీనీడ ఉత్సవాలమీద పడనీయరాదన్న నీతిని ఈ 'గుర్తింపు రద్దు' తీర్మానంలో వ్రాశారు.

'ఈ సమాఖ్య'లాగే ఉత్సవాలు కూడా రాజకీయ ప్రభావానికి అతీతంగా ఉండాలని ఉద్ఘాటించారు

ఏకారణంవల్ల వీరు ఇలా చేస్తున్నారో తెలియదుగాని, ఆరోపణలు అంటూ ఆరంభిస్తే దానికి అంతుఉండదనిమాత్రం చెప్పకోవాలి. ప్రతీక్రియకూ ప్రతిక్రియ ఉంటుందని న్యూటన్ వాక్కు.

ఇలాంటి 'క్రియలు'లకు తప్పక ఉంటాయి అప్పుడు అవాంఛనీయ పర్యవసానాలు ఏర్పడతాయి ఇటువంటి సమస్యలను సంప్రదింపుల ద్వారా, ప్రమాణాలు కట్టుదిట్టం చేసుకోడం ద్వారా సరుకోవడం బదులుగా ఇలా వ్యవహరిస్తే ఉత్పత్తి చేసి ఆనక దానిని ఎదు[illegible]



పద్మశ్రీ వారి 'శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం'లో సావిత్రి.

# చిత్ర లేఖలు

అయ్యా,

ఉత్తమచిత్రాలు తీసి బహుమతులు సంపాదించటం పోటీగా పెట్టుకున్న సత్యజిత్ రాయ్ 'భారతం' తీస్తాడనే వార్త మాకు చాలా సంతోషం కలిగించింది. కొన్ని మంచి చిత్రాలు తీశాడనే పేరు పొందివున్న బిమల్ రాయ్ 'రామాయణం' తీస్తాడనే వార్తకూడా వినటానికి బాగుంది "ఏరాయైతేనేం మంచికథలు చెపగొట్టటానికి?" అని ఈసారి ఎవరూ విమర్శించటానికి ఆస్కారం లేనివిధంగా వీరు ఈ చిత్రాలు తీయగలరని ఆశిస్తున్నాము.

ఇట్లు,
సత్యజిత్ రాయిస్టు.
బిమల్ రాయిస్టు.

అయ్యా,

అశాశ్వతమైన ఈ ప్రపంచంలో శాశ్వతమైన పొంగరాలు పొయ్యడం అసాధ్యమని, 'పలుకు'- బడి పంతులు (శ్రీ శ్రీ) ఒకప్పుడు అన్నమాటని సినిమాకథల పొంగరాలకీ, సినిమా బాక్సాఫీసు సూత్రాలకీ పట్టించవలసిన సమయం వచ్చిందని గిట్టని వాళ్లు కొందరనుకోగా విన్నాను. పొంగరాలు పొయ్యడం లాగే, సినిమా కథలు అల్లడం, సినీ భవాను భవాల ఖనిజంలో విజంతీసి పొగుచేసి బాక్సాఫీ సూత్రంగా పోవడం మజాకా కాదు. దానికెంత పెనం పేడితనం, పనిపాడితనం కావాలో దీనికీ అంతా కావాలి. ఊహలూ మోస్తర్లు మార్చెయ్యమనడంతో సరికాదు. అయినప్పటికీ పైనపేర్కొన్న గిట్టనివాళ్లు,విజయవంతంగా దెబ్బతింటున్న "పాప్యులర్" చిత్రాలను దృష్టాంతాలుగా చూపించి "ఇదిగో, వీరు డబ్బు గడిస్తాయమనుకున్న ఫలానా ఫలానా మాత్రాలన్నీ దెబ్బతిన్నాయిగనక,మరికొన్ని కొత్త సూత్రాలైనా వెదకండి." అంటున్నారు. కొత్తకథలూ, కొత్తపద్ధతులూ, రొమాన్సులూ కొత్తపోకడలూ పట్టుకు రమ్మంటున్నారు. ఈ విప్లవం తేలిక పని కాదు, ఒక పక్కనించి (పడమటనించి) అలా అలా బొంబాయి కలకత్తా (కథలకు)ల మీదుగా రావాలి. అదే పదేళ్లకో.

ఈలోగా తొందరపడి కొత్తసూత్రాలు లేవాలంటే కుదరదు ఇప్పుడున్న సూత్రాల వల్ల డబ్బువస్తే అది సూత్రబలం. రాకపోతే అదికర్మఫలం. అంతేతప్ప తప్పు మాదిగాదు. అయినా కొన్నాళ్ళకి మళ్ళీ ఇవే కొత్త సూత్రాలు కావచ్చు కొండపల్లి బొమ్మలు, కూచిపూడి నృత్యం, చేతినిండా గాజులు, రూపొందుతుంత బొట్టూ, పతివ్రతల సినిమాలూ, చేనేతబట్టలూ ఫాషనులోకి మళ్ళీ ఎక్కటంలేదా? పొంగరాలు పోతమీరి దోసెలు అయి, తిరిగి ఉత్తప్పం రూపంలో మళ్ళీ అవతరించలేదా. ఇవీ అలాగే మారవచ్చును.

ఇట్లు,
బాక్సాఫీసుమాత్రకారులు



ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి 'ఇల్లరికం' చిత్రంలో గిరిజ.

## వార్తలు

విజయ (వద్దంటే పెళ్ళి) ప్రొడక్షన్స వారి జానపద చిత్రం 'జయ విజయ' ఉగాదికి విడుదల. కాంతారావు, కృష్ణకుమారి, రాజనాల, ముక్కామల మిక్కిలినేని, బాలకృష్ణ, ఆచార్య మొదలైన వారు పాల్గొన్నారు రచయిత కృష్ణమూర్తి. దర్శకుడు విఠలాచార్య.

* * *

రిపబ్లిక్ పిక్చర్స్ వారి 'పెళ్ళి సందడి' ఈ 27 న అవుతుంది. నాగేశ్వరరావు, అంజలీదేవి, సరోజాదేవి, చలం, గుమ్మడి, సి. ఎస్. ఆర్., రమణారెడ్డి మొదలగువారు, పాల్గొన్నారు రచయిత సముద్రాల జూనియర్. సంగీతం ఘంటసాల. దర్శకత్వం యోగానంద్. నిర్మాత చోడవరపు సీతారాం.

* * *

# వార్తావరణం

పబ్లిసిటీ ఆర్టిస్టు. విడుదల కాబోతున్న చిత్రంమీద ఒక లేఅౌట్ తయారుచేసి తీసుకొచ్చాడు. అంతా చూసి, నిర్మాత 'ఎబ్బె' లా మొహంపెట్టి — "నేడే చూడండి" అని రాయలేదేం?" అని అడిగాడు.

"ఎందుకూ?" అన్నాడు ఆర్టిస్టు.

"ఆఁ మరేంలేదు లెండి— రేపటికి వుంటుందో వుండదో అని వారి అనుమానం!" అని నెమ్మదిగా జవాబిచ్చాడు పక్కనున్న నవ రచయిత.

—ఆర్కె.

## 'ఛోటీ బహన్'

డైరెక్టర్ ఎల్. వి. ప్రసాద్ గారి రెండవ హిందీ చిత్రం 'ఛోటీ బహన్' ఈ వారం ఉత్తరాదిన విడుదల అవుతోంది. బల్‌రాజ్ సాహ్నీ, శ్యామ, కుమారినంద, శుభా ఖోటే, రెహమాన్ మహమూద్, బద్రీ ప్రసాద్, ధుమల్, రాధాకిషన్ మొదలగు వారంతా ఇందులో పాల్గొన్నారు. సంగీత దర్శకత్వం శంకర్ జైకిషన్‌లు.

## న్యూయార్కులో 'అపరాజిత'

న్యూయార్కు ఫిఫ్త్ ఎవెన్యూ సినిమాలో మార్చి 1 న, సత్యజిత్ రాయ్ చిత్రం 'అపరాజిత' ప్రత్యేక ప్రదర్శనం జరిగింది. ఐక్యరాజ్య సమితిలోని దేశ దేశాల ప్రతినిధులూ, న్యూయార్కు నగర ప్రముఖులూ దీనికి హాజరయ్యారు. సమితిలో భారత ప్రతినిధి శ్రీ చంద్రశేఖర ఝా స్వాగతం చెబుతూ ఈ ప్రదర్శనం వసూళ్ళను భారత ప్రధాన మంత్రి పేరిట మన దేశంలోగల శిశు సంక్షేమ సహాయ నిధికి పంపుతున్నట్లు వెల్లడించారు.

ఫిఫ్త్ ఎవెన్యూ సినిమాలో 'పథేర్ పాంచాలీ' ఆర్నెల్లనించి ఆడుతోంది. మార్చి 1 న అపరాజిత ఆరంభించాలనుకున్నారు. గాని, ఇంకా మొదటి చిత్రాన్ని చూసేవారు చాలామంది ఉండటంవల్ల మరి కొన్ని వారాలు దీన్ని వాయిదా వేశారు.

ఇలా ఒక విదేశీయ చిత్రం ఇన్నాళ్ళు న్యూయార్కులో ఆడడమే కాక ఇంత డబ్బు వసూలుచేయడం కూడా అపూర్వమని ఈ చిత్రం అమెరికన్ డిస్ట్రిబ్యూటరు ఎడ్వర్డ్ హారిసన్ అన్నారు.



బసంత్ పిక్చర్స్‌వారి హిందీ చిత్రంలో నటిస్తున్న గిరిజ, దర్శకుడు బాబు భాయ్‌మిస్త్రీ.

## లైమ్ లైట్

చార్లీచాప్లిన్ సరికొత్త చిత్రం (మన దేశానికి), ఇతర దేశాలలో ఏడేళ్ళు విహరించిన తరువాత ఇన్నాళ్ళకి ఈ దేశం వచ్చింది. మద్రాసు ఎల్ఫిన్‌స్టన్ సినిమాలో మార్చి 27 న విడుదల అవుతుంది.

## 'ది టెన్ కమాండ్‌మెంట్స్' శతదినోత్సవం

చిరకీర్తి శేషుడు సిసిల్ బి. డిమిల్ చివరి చిత్రం 'ది టెన్ కమాండ్‌మెంట్స్' మద్రాసు ఓడియన్ సినిమాలో మార్చి 14 న శత దినోత్సవం జరుపుకొన్నది.

మద్రాసులో ఒక విదేశీ చిత్రం ఇలా 100 రోజులు నిరాఘాటంగా ఆడడానికి ఇదే మొదటిసారి. పోతే డిసెంబరు 5 నుండి



శ్రీ శారదాఫిలింస్ వారి 'జయభేరి'లో నాగేశ్వరరావు, రాజసులోచన.

# ఇల్లాలి అదృష్టమే ఇంటికి భాగ్యం

అమాయకులకూ, మంచివాళ్ళకీ, భయస్థులకూ, "అదృష్టశక్తులు ఆదుకుంటాయ"ని ధైర్యం చెప్పే చక్కని కలలాంటి కథను "ఇల్లాలి అదృష్టమే ఇంటికి భాగ్యం' (రామచంద్రా ప్రొడక్షన్స్) చిత్రంలో రక్తికట్టేలా చెప్పుకొచ్చారు. కొలంనాడు ప్రఖ్యాత వేదాంతి, వ్యంగ్యరచయిత అయిన వోల్టయిర్ చెప్పిన కథలో అదృష్టవంతుడి పోలికలుగల పాత్రను (అనుకరణ అని దురభిప్రాయపడరాదు) మనోవాక్కాయాలా దేశీయమైనరీతిని రూపొందించి ఇందులో నిలిపారు. దేశవాళీ సినిమాలన్నిటిలోని సన్నివేశాల సారాంశాన్ని సేకరించి కాచి వడబోసి ఇందులో పోశారు. అన్నిరకాల సినీదుష్టులనూ—పెద్దమనిషిలా కనిపించే దుష్టులూ దుష్టులలా కనిపించే దుష్టులూ, ఆడవాళ్ళలా కనిపించే దుష్టులూ, సినిమాలలో దుష్టులలా కనిపించే దుష్టులూ, హాబీకోసం నేరంచేసే దుష్టులు, ఎవరూ చూట్టంలేదని కక్కుర్తిపడే దుష్టులూ, ఒక్కసారేగదా అని ఓఘా

జరసగా ఎనిమిది వారాలపాటు హాలు పూర్తిగా నిండుతూ రావడం అనేది భారతదేశం మొత్తంమీద విదేశీ చిత్రాలకు కొత్త రికార్డు. (మూడువందల మందికి చోటుగల చిన్న సినిమా మినర్వాలో ఫాబ్యులస్ సెనోర్యరిటా వంటి చిత్రాలు ఆడినా, పెద్ద థియేటర్లలో ఇదే తొలి ప్రమాణం.)

14 డి - మిలియన్ డాలర్ల ఖర్చుతో తయారైన ఈ చిత్రం ప్రపంచంలో ఏదేశమేగినా ఘన విజయం సాధిస్తూనే వచ్చింది. స్వదేశం అమెరికాలో అన్నిటిలోనూ ఎక్కువ మొత్తాలు వసూలు చేసిన పది చిత్రాలలో ఇది ఒకటి అయింది.

మూడువేల ఏళ్ళనాడు ఈజిప్టులో బానిసలుగా బతుకుతున్న ఇస్రేలీ ప్రజలకు స్వేచ్ఛను, అది మనడానికి ఈశ్వర ప్రసాదితాలైన దశా దేశాల పేరిట క్రమశిక్షణనూ నవజీవ విధానాన్నీ, ఆరాధనకో దైవాన్ని అనుసరణకో మతాన్ని సంపాదించిపెట్టి, వారి స్వప్నసీమకు మహాప్రస్థానం నడిపించిన ప్రవక్త, ధర్మ ప్రవర్తకుడు అయిన మోసెస్ కథను (ఆంధ్ర వార పత్రిక డిసెంబరు 19 సంచిక) బ్రహ్మాండమైన సెట్ల మీద అంతకన్న గొప్పదైన నిజ కథా స్థలాల మీద పాతికవేలమంది నటులతో చెప్పిన ఈ చిత్రంలో ముఖ్య పాత్రలను చార్ల్టన్ హెస్టన్, యుల్ బ్రైనర్, ఎడ్వర్డ్ జి. రాబిన్సన్, సర్ సెడరిక్ హార్డ్విక్, విన్సెంట్ ప్రైస్, జాన్ డెరిక్, అన్ బాక్స్టర్, వైవన్ డికార్లో, డెబ్రా పాజెట్, నినాఫోక్, మార్తా స్కాట్ మొదలగువారు ధరించారు. సంగీతం, విక్టర్ యంగ్. (శామ్సన్ అండ్ డిలైలా). పారమౌంట్ పిక్చర్స్ వారుదీన్ని విడుదలచేశారు.❀

యిత్యానికి పడిగట్టేదుష్టులూ, వృత్తిచేత దుష్టులూ తప్పలేదనుకునేవాళ్ళూ, కోదను కునే బాపతూ వీళ్ళందర్నీ ఇందులో సినీదుష్ట మహాసభకు పోగేసుకొచ్చారు. ప్రమాదాలూ, భ్రమాదాలూ వగైరా సినిమా హంగులన్నీ రంగరించి గరంగరం పోశారు. ఫెయిరీటేల్ లాటి ఈ కథల పొంగరం బాగుండడానికి కారణం ఇందులో ముఖ్యపాత్ర మీనాక్షి సర్వజనమనోహరంగా ప్రకాశించడమే. ఈ అమ్మాయి పల్లెపిల్ల. లోకరీతి బొత్తిగా ఎరగనిది. రైలుబండీ, చూడనిది. ఎవర్నిపెడితే వాళ్ళని నమ్మేపేది ప్రమాదం మూసుకొస్తున్నా గుర్తించలేనిది. పాముదగ్గిర పసిపాపలా తిరిగి ప్రమాదం వాటిల్లకుండానే గండం దాటిపోయింది. ఆ అమ్మాయి కలవారింటికోడలు కాబోతోంది. ముహూర్తం 6 రోజులదూరం. పెళ్ళిపీటలు 60 మైళ్ళదూరం. ఆ పిల్లా, ఆమె అన్నగారూ కలిసి బయలుదేరుతారు. రైలుదగ్గర అన్నగారు పెట్టి మరచిపోయి వెనక్కి వెళ్ళి వచ్చేలోగా రైలు వెళ్ళిపోతుంది. అందువల్ల ఆ చిన్నది 6 రోజుల 60 మైళ్లూ ఒంటరిగా ప్రయాణం చేయవలసివస్తుంది. రైల్వే రాక్షసులాటివాడొకడు, ఆమెకు చోటిచ్చి, టికెట్ కలెక్టరు వచ్చినప్పుడు ఆమెను ఆదుకొని, దరిమిలా అనుకోబోతాడు. అతను కల్లబొల్లి కబుర్లు చెప్పి ఆ పిల్లను తన వంటయింటికి తీసుకెళ్ళేసరికి, ఇంటాయన, ఈ వంటాయన వద్ద ధార్జీ పుచ్చుకుంటాడు. అతడు దుష్కార్యానికి పడిగట్టేలోగా భార్య రావడంతో, ఒక డాక్టరు అతనిచేతిలోంచి ఈ పిల్లని ఎగరేసుకుపోతాడు. అలాపోతూపోతూవుండగా దారిలో ఒక వకీలుతటస్థపడిడాక్టర్ని మాయచేసి పిల్లనితన్నుకుపోతాడు. అక్కణ్ణించి మరో చోటుకు. ఇలాఆటలో బంతిలాగాలిలో ఆకులా ఆ అమ్మాయి దారీ తెన్నూ తెలియకుండా లోకంమీద యాత్రచేస్తుంది. ఒక మజిలీలో తనకాబోయే భర్తని కాటేయాలని చూసే మరో అమ్మాయి పన్నాగానికి గురి అవుతుంది. ఎన్ని వచ్చినా, తనచుట్టూరా పన్నాగాలున్నాయనిగాని, కాటువేసేందుకు పన్నాగాలు వెంటవస్తున్నాయనిగాని తెలియకుండానే ఆమె సురక్షితంగా వెళ్తూ, చివరికి తెల్లనివన్నీ పాలుకావని తెలుసుకునేసరికి గమ్యస్థానం చేరుకుంటుంది. సరిగా ముహూర్తంవేళకువెళ్ళి పెళ్ళిపీటల మీద కూర్చుంటుంది.

పీడకలలవంటి ఈ అనుభవాలను గుదిగుచ్చి, లోకంమీది వాస్తవాలను భూతద్దం కిందపెట్టి చూపెట్టే శిల్పంద్వారా వాటి మీద వ్యాఖ్యానిస్తూ తరువాత ఏమవుతుందీ అన్నప్రశ్నను కళ్ళముందు వ్రేలాడదీసి ప్రేక్షకులను పరవశులను చేసివేసి ఈ చిత్రాన్ని తీసిన తమిళ దర్శకుడు దొరై రాణ్ అనే ఆయన. చక్కని ఈ బొమ్మకి ఈయన కట్టిన చట్రం మటుకు పాతది. తాలాకొంగా వాడ



మద్రాసులో కీలుబొమ్మలాట ప్రదర్శనాలు ఇచ్చిన మాస్కో స్టేట్ సెంట్రల్ పపెట్ థియేటర్ నిర్వాహకుడు శ్రీ అబ్రాట్‌సోవ్‌ను దక్షిణభారత కళాకారుల సంఘంవారు మార్చి 10 న సత్కరించి, తమ సంఘంలో గౌరవసభ్యునిగా చేర్చుకొన్నారు. ఎడమనుండి: శ్రీ అబ్రాట్‌సోవ్, ఆయనకు రజతఫలకం అందించి అభినందించిన మద్రాసు మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం కళాకారుల సంఘం అధ్యక్షురాలు శ్రీమతి అంజలీదేవి.

## ఇల్లాలే అదృష్టమే

కంలో ఉన్న సినిమా చట్రమే. అందువల్ల మామూలుగా చూట్టానికి యీ చిత్రం, దీని తరహా, సగటూ చిత్రాలలాగే ఉంటాయి ఇందులో కథ, ముఖ్యపాత్ర నిర్వహణలో సావిత్రి ప్రదర్శించిన మనోహరమైన హావభావాలూ దీనికి విశిష్టతను చేకూర్చాయి. ఆమె అన్నగా దొరైరాజ్ కూడా బాగానే నటించాడు. ఇతర నటులు ఆర్. నాగేశ్వరరావు, వీరప్ప, బాలాజీ, అంగముత్తు, ముత్తులక్ష్మి మొదలగువారు. తమిళంలో విజయవంతంగా సాగిన యీ చిత్రాన్ని (పేరు: పానై పిడిత్తవళ్ భాగ్యశాలి) తెలుగులోకి గబ్బిట వెంకటరావు, కె. వి. ఎస్. ఆచార్య తర్జుమా చేశారు. తెలుగు కేవలం తర్జుమా తెలుగుగా వినబడినందువల్ల, పాత్రధారుల పెదాల్నూ, గాత్రధారుల పదాలూ అద్భుతంగా కలిసిపోతాయని ఆరంభంలో దురాశ కలిగినా అది సాగిరాలేదు. 'లిప్‌సర్వీస్' అసంతృప్తికరంగా ఉంది.

సంతృప్తి కలిగించిన మరొకఅంశం సంగీతం. ఎస్. రాజేశ్వరరావు, సుబ్బరామన్ తరువాత అంతటివాడనిపించుకున్న ఏస్. వి. వెంకటరామన్ పాటలుచేశారు. దాదాపు అన్నీ విన సొంపుగానే ఉన్నాయి. చెల్లెలుకు అన్నగారు హితబోధచేసే సందర్భంలో ఘంటసాలపాడిన పాటవరస, మాటవరసలూ బాగున్నాయి. ఆ పాటని ఆయన హృదయంగమంగా పాడారు. బాగున్న మరోపాట సినీయుగళ గీతం. సుశీల, పి. బి. శ్రీనివాస్‌లు హాయిగా పాడారు. పిఠాపురం నాగేశ్వరరావు పాడినపాట ఒకటి హుషారుగా ఉంది. కొన్ని తమిళ జానపద నృత్యాలుకూడా ఉన్నాయి.

మంచికథను చూడాలంటే వెళ్ళి చూడతగ్గ చిత్రం. ❀

## ఢిల్లీ కా ఠగ్

దొంగతనంగా నకిలీమందులుచేసి అమ్ముకునే ముఠాని బయటపెడుతూ, పనిలో పనిగా ఆడుతూ పాడుతూ ఒకవంక నూతన్‌నూ, మరోవంక హంతకులనూ తరిమికొడుతూ అమ్మాయి మనసునూ, హంతకుడి ప్రాణాన్ని కిశోర కుమార్ అపహరించడం 'ఢిల్లీ కా ఠగ్' లో ఉదంతం. ఈలోగా కాట్ మానే ఖిల్లీ, మాడ్ మానే పాగల్, బాయ్ మానే లడకాలాంటి పాటలు విని తెలుసుకోవడం, లక్షరూపాయలతో నిర్మించిన ఈతకొలను సెట్‌మీద, నూతను తనూ సౌందర్యాన్ని, ఒకటి రెండు బేతింగ్ బ్యూటీల మోస్తర్లను గేవాకలర్‌లో చూసి ఆనందించడం ప్రేక్షకులకు కాలక్షేపం. ఇవే కాక, కిశోరకుమార్ మాటలూ చేష్టలూ కూడా కథసాగుతుండా మంచి కాలక్షేపం. దేని కేదీ అడ్డురాకుండా సర్దుకుని చిత్రాన్ని హాయిగా పోనిచ్చాయి. దర్శకుడు ఎస్. డి. నరాంగ్ ఇలాంటి సదుపాయం చేసాడని పనిగట్టలేక కిశోర్ కథారంభంలో కొత్త తికమకపడ్డాడు. సరూజ్‌నీ, ధరమ్‌నీ కొప్పడబోయాడు.

అతని తండ్రి పత్రికాధిపతి. ఆయన దొంగమందుల ముఠా గుట్టు బయటపెడుతున్నందువల్ల, ఆముఠా నాయకుడు ఆయన్ని ఖర్చురాయించేస్తాడు. అందువల్ల కిశోర్ చదువు ఆగిపోతుంది. దారిద్రం వరిస్తుంది. రెండుమూడు షాట్‌లలో ఉద్యోగాలకై ప్రయత్నిస్తాడు. తరువాత జూదరి అవుతాడు. పాకెట్ మార్ గాంగ్‌నుకూడా ఏర్పాటుచేసుకుంటాడు. దొంగ సొమ్మును తల్లి హర్షించదు. అపుడు సమాజంలో అన్యాయం ఎక్కువగా ఉందనీ, అన్యాయంగాగడించినవాడి డబ్బునే తాను తెచ్చాడనీ మళ్లీ ఓ బొంబాయివాలీ డైలాగు వర్ణించబోతాడు. కాని తల్లి కోపం తగ్గనందువల్ల ఆ ఊహలు చెరిపేసుకుంటాడు. అంతలోకి నూతన్‌ను చూడడం, చిన్నపుడు తనతో నూతనుకు ప్రధానం జరిగిన వైనాన్ని ఆపిల్ల మరచిపోయిందని గ్రహించి ఆమె వెంట పడడం, ఆపైన తన తండ్రిని ఎవరో హత్యచేశాడు కాబట్టి వాణ్ని పట్టుకోవాలనుకోవడం జరుగుతాయి అదృష్టవశాత్తు. అందువల్ల కథ పైన చెప్పినవిధంగా హుషారైన దారిలో వెళ్ళింది. (లేకపోతే ఇంకో మెలొడ్రామా తయారయేది.) చివర, కిశోర్‌కీ, హంతకుడికీ భేటీ అయినచోటు ఎగురుతున్న విమానంలో. అపుడు ఇద్దరూ పోట్లాడుకొనడం, దుష్టుడు చనిపోవడం పైలట్ గాయపడడం, ఏమీతెలీని కిశోర ఏరోడ్రోమ్‌నించి వచ్చే రేడియో సలహాలతో విమానాన్ని జాగ్రత్తగా దించడం ఈ చిత్రంలో పతాక సన్నివేశంలో భాగాలు, ఈ భాగాన్ని చాలా కట్టుదిట్టంగా ప్రేక్షకులు పదినిముషాలపాటు ఊపిరి ఉగ్గబెట్టుకు చూసేటంత ఉద్రిక్తంగా చిత్రించారు.

పాటలలో, బాగున్న రెండూ ఇదివరకే బహుళజనాదరణపొందాయి. కిశోర్, ఆశాభోస్లే, గీతాదత్ పాడారు. సంగీత దర్శకుడు రవి.

* * *

కల్పన్ పిక్చర్స్‌వారి 'మంజిల్' చాలవరకు పూర్తిఅయింది. దేవానంద్, నూతన పాల్గొంటున్న ఈ చిత్రానికి దర్శకుడు మండీబర్మన్. సంగీతం ఎస్. డి. బర్మన్.

# ★ వికారాలూ, మమకారాలూ ★

[12-వ పేజీ తరువాయి]

చూడదలచుకుంటే థియేటరు లోపలికే వెళ్ళొచ్చుగదా! వెనుక వైపున ఈయన కేం పని?" అన్నాను.

"మాట్లాడితే 'ప్లాటు, ప్లాటు' అంటారు. మన మాట చెవిలో బడదు"

నా కాశ్చర్యం కలిగింది. మామయ్య అక్కడెక్కడైనా ఏకాంత ప్రదేశంలో కూచుని ఏకథకో, కావ్యానికో ప్లాటు అల్లుకుంటున్నారేమిటి?— అత్తయ్య ఎదుట ఈ సందేహాన్నే ప్రకటించాను.

"అయ్యో, అలాంటి ప్లాటు కాదు బాబూ! ఇంటి కోసం ఆయన కొన్న జాగా సంగతి చెబుతున్నాను. నా పైను బ్యాంకులో వుంచి అయిదొందలు తెచ్చి పదిరోజుల క్రిందట ఓ ప్లాటు కొనేశారు. చుట్టూరా కట్టడాలు పెకి లేసుంటే తను ఆ ప్లాటులో కూచుని వాటివైపు వెర్రిగా చూస్తుంటారు."

వందరూపాయల జీతం తీస్తున్న ఉపాధ్యాయ మాత్రుడు భారీఎత్తున భవన నిర్మాణానికి పూనుకోడం లేని చిక్కుల్ని కొని తెచ్చుకోడమేనేమో ననిపించింది. కానీ నిశ్చితార్థాన్ని వదలని నిపుణత్వం మామగారిలో వుందన్న విషయం గూడా నాకు తెలియందిగాదు. కాబట్టే ఆయన ప్రస్తుతం కాపురముంటున్న యింటి గోడలు పాతబడి పుప్పి రాలిపోతుండగా కొత్త కట్టడానికి యిటుకలు కొనగలిగారు. మాసికల చీరతో అత్తయ్య ముఖాన్ని బయటికి చూపడానికి కించపడుతుండగా, పోస్టు బాక్సు ట్రౌజరుతో కుర్రాడు బడికిపోతుండగా ఈయన కొత్తయింటికి దూలాలు వాసాలు కొన్నారు.

కానీ మామయ్య తొందరకు తగినట్టుగా ఆయన చేతిలో డబ్బు మెదిలేది గాదేమో! పని కాస్తా మంద కొడిగానే కొనసాగింది. ఆయన పాలిటి కార్యక్రమం పంచవర్ష ప్రణాళికే అయిపోయింది. ఆకట్టడం హీరాకుడ్ ప్రాజెక్టే అయిపోయింది.

ఇంట్లో నిప్పచ్చరం సంగతలా వుండగా మానసికంగా మామయ్యలో వచ్చినమార్పుకు మేమందరమూ దిగ్భ్రాంత చేతస్కులమై పోవలసి వచ్చింది.

ఓ రోజు అత్తయ్య అంది గదా—"ఐనా యింత విపరీతమా బాబూ! ఆకులో అన్నం వడ్డించి, కట్టడం సంగతి ప్రస్తావిస్తే చాలు. ఇక ఆయనకు కూరా చారూ మజ్జిగ ఇవన్నీ అనవసరం. వట్టి అన్నం తినంతటదే దిగిపోతుంది."

దొరకవచ్చుననుకున్న అప్పు సమయానికి దొరక్కపోవడం, మేస్త్రీల వల్ల జరిగే జాప్యం, మార్కెట్టులో సిమెంటుకు లాటరీ -అంతెందుకూ, ఏ ఒక్క పరిస్థితీ గృహనిర్మాణానికి అనుకూలించని రోజులు. మామయ్య 'గోల్' చేయదలచుకున్న బాలుకు అడుగడుగునా అడ్డంకులే! సంపాదనకూ, జీవితావసరాలకూ బొటాబొటిగా సరిపెట్టుకోడంతో సతమతమై పోయే వ్యక్తికి అయిదు వేల రూపాయల కట్టడం కలలో తప్పా యిలలో సాధ్యమయ్యే పనిగాదు. ఐతేనేం, ఎక్కడైతే 'దిల్' అనేది వుందో అక్కడ 'వే' గూడా వుండి తీరుతుందని మామయ్య ఋజువుచేశారు.

ప్రాకారకుడ్యం దాటగానే చిన్న పూలతోట, సోపానా లెక్కగానే వరాండా, వరాండాకు కుడివైపున ఆఫీసు రూము. ఇంకా హాలు, వంటగదీ, పెరడు, చేదబావి, సమస్త సదుపాయాలతో చిన్న బంగళా లాంటి యిల్లు రూపొందింది.

"ఏమండీ మాష్టారూ! గృహప్రవేశం గూడా చేశేశారటగా! చూచిపోదామని వచ్చాను" అంటూ మేడల్లో నివసిస్తున్న వాళ్ళతోబాటు, నివసించాలని కలగంటున్న వాళ్లు సైతం వచ్చి, క్రొత్తయింటిని చూచి, మామగారి పట్టుదలను ప్రశంసించి, అత్తయ్య చేతి కాఫీని స్వీకరించి వెళ్ళిపోసాగారు.

కానీ భూమిలో ఏడు నిలువుల లోతున కదిలే నీటివూటలా ఈ మహాత్కార్యానికి అట్టడుగున వున్న కారణం అదొక తీరని ఆకాంక్షలా ఆ భార్యాభర్తల మనసుల్లో మెదిలేదేమో! కావచ్చు. ఇలాంటి విషయాల్లో ఆడవాళ్ళు మరీ బేలతనంగా వ్యవహరించేస్తారు. "ఇల్లేమో కట్టేశారండీ! కానీ ఏం లాభం? మీ తమ్ముడు గృహప్రవేశానికి గూడా రాకపోయాడు" అని ఓ రోజు అత్తయ్య చెబుతుంటగా విన్నాను.

"వాడొస్తే ఎంత! రాకపోతే ఎంత! ఆ దొర వచ్చి చూడాలనే నేమిటి నేనుకట్టింది యిల్లు! వాడు నా గుమ్మం తొక్కనూవద్దు—నేను వాడి ముఖం చూడనూవద్దు" అన్నారు మామయ్య.

మామయ్యకూ, అత్తయ్యకూ ఈ సంభాషణ జరిగిన తర్వాత మూడు మాసాలకు నేనొకసారి తలవని తలంపుగా అక్కడికి వెళ్ళి రావలసి వచ్చింది. వీధిలో వుండగానే మామగారి మాటలు వినిపించాయి. ఆయన మహోత్సాహంతో గృహనిర్మాణ కథాకథనాన్ని కొనసాగిస్తున్నారు. "అబ్బబ్బ, ఇవేం గడ్డురోజులురా బాబూ! ఈ ఒక్క ఆలమారా తలుపుకే యాభైరూపాయలు కావలసి వచ్చాయంటే నువ్వు నమ్మతావా? పోనీ, ఈ కిటికీ చూచావూ—కొయ్యలూ, కమ్ములూ, కూలీ వరకీ దీనికిమ్మత్తు సరిగ్గా వందరూపాయలు..."

నేను హాల్లో అడుగు పెట్టగానే ప్రసంగము ఆగిపోయింది.

నిట్టనిలువునా కొయ్యబారి పోయానేమో! నాలుగైదు క్షణాలు అలాగే నిల్చుండిపోయాను. శ్రోత మరొకరూ, మరొకరూ కాదు—సాక్షాత్తు మా చిన్నమామయ్య.

గొంతుకలో వెలక్కాయ పడ్డట్టుంది చిన్న మామయ్యకు! ఆయన పెదవులు కదిలాయి గానీ మాటలుమాత్రం వెలువడ్డాయి కావు.

మా ముగ్గురిలో ముందుగా తేరుకున్న మా పెద్ద మామయ్య "ఎప్పుడొచ్చావు నాయనా! ఊళ్లో అందరూ బాగున్నారు కదా?" అన్నారు.

ఉన్నారున్నారని ముక్తసరిగా జవాబు చెప్పి సరాసరి వంట గదిలోకి వెళ్ళాను.

అత్తయ్య కాఫీయిస్తూ, "కూతురికి పెళ్ళి తలపెట్టుకున్నాడట బాబూ! పిలిచి పోదామని వచ్చాడు. ఏ ముఖం పెట్టుకునివచ్చావని మీ మామయ్య అడగలేక పోయారు. నువ్వయినా కుంప గొట్టినట్టు అడిగేయాలి" అంది.

"అడిగేం లాభం అత్తయ్యా! ఆముఖాన్ని చూస్తే తెలియడంలేదా? శుభ్రంగా తారుతో అలంకరించి నట్టుంది. మానవుడు ఒకప్పుడు బంధు ప్రేమనీ చంపుకోవచ్చు. మరొకప్పుడు అవసరం తనది గదా అనీ అభిమానాన్ని చంపుకోవచ్చు. కానీ మానవుడెప్పుడూ చంపుకోలేనిది ఒకటి వుంది. దాని పేరు అంతరాత్మ, అన్నాను.

ఆ రోజు సాయంత్రం చిన్నమామయ్య వెళ్ళిపోయాడు. పోతూపోతూ "మీ చెల్లెల్ని గూడా పంపిస్తాను వదినా! మీరందరూ పది రోజులు ముందుగానే వచ్చేయాలి" అని మరి మరీ చెప్పిపోయాడు.

"ఏమండీ! వెళ్ళేటట్టే వుండే మీ పోజు!" అంది అత్తయ్య.

"ఏం! ఇతగాడొచ్చి పిలవగానే వెళ్ళాలేమిటి? వీడుగాదు, వీడి జేజినాయన దిగిరావాలి నేను వెళ్ళడానికి" అన్నారు మామయ్య.

"వాళ్ల జేజినాయన దిగివస్తే మీ జేజినాయనా దిగివచ్చినట్టేగదా" అంది అత్తయ్య.

అవి దసరా సెలవులు. అలాగే ఒక స్నేహితుడి ఊరికి వెళ్లి నాలుగైదు రోజుల తర్వాత ఇంటికి తిరిగి వెళ్ళాను. ఎలా తెలిసిందోగానీ శుభవర్తమానం అప్పటికి మా వాళ్లకు తెలిసిపోయింది. వెళ్ళగానే అడిగింది మా ఆవిడ—

"ఏమండీ! మాచిన్నాన్న వచ్చిపోయాడటగా! రాజేశ్వరికి పెళ్ళటనే! మన వాళ్ళు వెళ్ళాలనుకుంటున్నారేమిటి?"

"ఇంకా నిర్ణయానికి రాలేదనుకో! కాని మీ సుందరమ్మపిన్ని ఓసారి వచ్చి ప్రత్యేకంగా వున్న బాత్ రూమ్‌లో స్నానం



# రాజధాని కబుర్లు



(5-వ పేజీ తరువాయి)

ఇటువంటి విందులను హాజరుకావడంలో ఔచిత్యమేదో బోధ పడదు.

* * * *

## అభిమన్యుడు తిమ్మారెడ్డి

గతవారం శాసనసభలో శ్రీ సంజీవరెడ్డి చేసిన ఉపన్యాసం ఎంత గంభీరమైనదో, ఈ వారం వ్యవసాయశాఖామంత్రి శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి ఉపన్యాసం అంత గంభీరమైనది, రోజుకి ఒక పూట తిండితినే చిన్న ఉద్యోగులుకూడా, 'ఆహారధాన్యాల ధరలు ఎంత తక్కువున్నాయి!' అనిపించే ఉపన్యాసం అది.

శ్రీ తిమ్మారెడ్డికి కొన్ని నిశ్చితమైన అభిప్రాయా లున్నాయి. మీరు వారిని కలిసినా, వారు మిమ్మల్ని కలిసినా, సంభాషణ ఈ అభిప్రాయాల ప్రాతిపదికపై జరగవలసిందే. 'ఆహారధాన్యాల ఉత్పత్తి ధరలు పెరిగినప్పుడు, ఆహారధాన్యాల ధరలు పెరగకపోతే ఎలా?' అంటారు. శ్రీ తిమ్మారెడ్డి ఉద్దేశ్యంలో పల్లెల్లో ఉండే వారందరూ కష్టించేవారు. పట్టణాల్లో ఉండేవారంతా సుఖంగా బ్రతికేవారు.

వ్యవసాయశాఖామంత్రి వాదనలో లోపాలు లేకపోలేదు. రైతులు కష్టపడుతూన్నమాట వాస్తవమే. కాని ఆ కష్టాలు తొలగించవలసిన బాధ్యత ప్రభుత్వానిది. కష్టాలకు బాధ్యులు పట్టణవాసులు కాదు. వేసవికాలంలో అగ్నిమాపకదళాలు లేని కారణంగా పూరిగుడిసెలు తగలడిపోతే, అగ్నిమాపకదళాలను ఏర్పరచవలసింది ప్రభుత్వం. "పట్టణాల్లో మీ ఇళ్ళకు నిప్పంటుకుంటే ఒక గది కాలేసరికి ఫైరింజన్లు వచ్చేస్తాయ్" అనడం సత్యదూరమైన విషయం. పైగా—వచ్చినా, పల్లెల్లో పూరిగుడిసెలు అంటుకోడానికి కారణం అదికాదు.

నగరవాసులకు సౌకర్యాలున్నాయనే భ్రమ ఒకటి అధికారులకు ఉన్నట్టు కనిపిస్తోంది. కుంభకర్ణుడి అవతారంగా హైదరాబాదు నగర పురపాలకసంఘం కొన్ని సంవత్సరాలనుండి నిద్రపోతూంది. లక్షలకొలది రూపాయలు ప్రభుత్వం మంజూరుచేసినా అవి ఎటు మటుమాయమైపోతున్నాయో తెలపడం కష్టం. రాష్ట్రంలో మిగిలిన నగరాల పరిస్థితీ ఏమంత తృప్తికరంగాలేదు.

శ్రీ తిమ్మారెడ్డి వాదనలో లోపాలు లేకపోలేదు. కాని ఆయన అభిప్రాయాల పరిశుద్ధతను శంకించడం కష్టం. ముందొకమాటచెప్పి, వెనుక వేరొకమాటచెప్పే స్వభావానికి ఆయనకి చాలాదూరం. 302 సభ్యుల్లో మనస్సులో అభిప్రాయం బల్లగుద్ది చెప్పగల సభ్యుడి పేరు చెప్పమంటే—శ్రీ తిమ్మారెడ్డి పేరు పెర్కొంటాను నేను.

* * * *

శాసనసభలో జరిగిన చర్చ సందర్భంలో ఒక సభ్యుడు శ్రీ తిమ్మారెడ్డిని పద్మవ్యూహంలో చిక్కుకున్న అభిమన్యుడితో పోల్చాడు. దానికి శ్రీ తిమ్మారెడ్డి సమాధానం: 'ఇప్పుడు జరిగే భారత యుద్ధంలో దుర్మార్గులంతా నశించిపోయే పరిస్థితుల్లో అభిమన్యుడనై సమసిపోడానికి అభ్యంతరం లేదు' అని!

## 'బారన్ యెస్టర్డే!'

మార్చి ఏడెనిమిది తేదీల్లో బాంబే నాట్యసంఘం అధ్వర్యాన ఒక ఉత్తమోత్తమమైన ప్రదర్శన ఎగ్జిబిషన్ థియేటర్‌లో ఏర్పాటు చేయబడింది. సినీతారలు దేవిద్, కామినీ కౌశల్ పాల్గొన్నారు. శ్రీ హెర్బర్ట్ మార్షల్ ప్రొడ్యూసర్.

ఏ మనిషినైనా ఏ వస్తువునైనా కొనెయ్యగలనన్న ధీమాతో ఢిల్లీ చేరతాడు ఒక వ్యాపారి. అతనితోపాటు అతని ప్రియురాలు 'బేబీ,' త్రాగుబోతు లాయర్ ప్రకాశ్ ఉంటారు. ఒక పార్లమెంటు మెంబర్ని కొనేస్తాడు వ్యాపారి. కాని తన 'బేబీ' తెలివి తక్కువతనం, అజ్ఞానం అడ్డొస్తూ ఉంటుంది క్షణక్షణానికి. ఆమె అజ్ఞానాన్ని రూపుమాపడానికి, ఆమెకి ఒక పత్రికా రచయిత సహకారంతో చదువుచెప్ప యత్నిస్తాడు. కాని ఆమె చదువు అతనికి సంబంధించినంతవరకు విషపరిణామాలకు దారితీస్తుంది.

ఒక అమెరికన్ నాటకాన్ని భారతీయ వాతావరణానికి అనువుగా మార్చి, ఖ్వాజా అహ్మద్ అబ్బాస్ వ్రాసిన నాటకం ఇది. అబ్బాస్ కలంపదును ప్రతీ అక్షరంలోను ప్రతీ వాక్యంలోను కన్పడుతుంది. రంగస్థలంపైన, తెరవెనుక పాత్రధారులందరూ అత్యద్భుతంగా నటించిన నాటకం ఇది.



# వికారాలూ, మమకారాలూ



శోయసం జరిగితే అంతటితో మీ వాళ్ళ దీక్షావిధి పరిపూర్తి అయ్యేటట్టుంది! ఆ తరువాత శుభకార్యానికి హాజరుకావడానికి మీవాళ్ళ కెలాటి ఆక్షేపణా వుండబోదు" అన్నాను.

"ఐతే మనమూ వెళ్దామండీ!" అనునయంగా సాగదీసింది. మా ఆవిడ.

"వెళ్ళువెళ్ళు. పదిమందిలో తలెత్తుకుని తిరగడానికి మీ అమ్మకో క్రొత్తమేడయినా వుంది. నీకదీలేదు. వాళ్ళనీ, వీళ్లనీ అడిగి ఏడెనిమిది మంచి చీరలు ఎరువు దెచ్చుకో! ఎందుకైనా మంచిది. పొరుగింటి పంకజమ్మ నెక్లెసును యిప్పుడే 'బుక్' చేసివుంచు. కానీ ఓ హెచ్చరిక! ఇక్కడెలాగూ ఒకటి రెండు ట్రంకులు ఖాళీ అవుతాయి. వాటిల్లో నీ అభిమానాన్ని భద్రపరచి గట్టిగా తాళంవేసి మరీవెళ్ళు లేకుంటే దాని కక్కడ చావుదెబ్బలు తగలొచ్చు" అన్నాను.

కానీ నా హెచ్చరికను వినడానికి ఇంకా మా ఆవిడ ఎక్కడుంది? తను పెళ్ళికి వెళ్ళబోతున్న శుభవార్తను పదిమంది చెవిలో వేసి రావడానికికాబోలు, ఎప్పుడో తుర్రుమని తూనీగలా బయటికి జారిపోయింది.

 

(23 వ పేజీ తరువాయి)

చెయ్యి. ఆదిలక్ష్మి ఇంట్లో రంగారావు
గాడు. పోలీసులు కాపలావేశారు. ఆ
ంట్లోనుంచి ఓ వందరూపాయల నోటు
ట్లాయినా సంపాదించావా, రాముడికీ
కూ నేనే పెళ్ళి చేస్తా పో...జాగ్రత్త.
ట్లా సాధించుకువస్తావో మరి."

"అంత అజాగ్రత్తగా ఆళ్ళు ఇస్తారా
బూ."

"ఇయ్యరు. మరి అందుకే నీకు చెప్పింది.
ళ్ళు నీకు కొంత బాకీ ఉన్నారుగా.
ప్పుడు అవసరంగా కావాలని అడుగు."

"పోలీసులు కాపలా ఉన్నారన్నా
గా. ఆ సంగతి తెలిసిఉండికూడా వాళ్ళు
డబ్బులో నోటు ఇస్తారా?"

"కాపలావేశారని ఆదిలక్ష్మికి తెలియదు.
నినే నిఘా అంటారు మీ భాషలో.
ట్లాయినా నువ్వు ఈ పనిని సాధించాలి
రి. వెళ్ళు."

తినుంచి సి. ఐ. డి అబ్దుల్లా
రికి వెళ్ళింది ఖాజా. వాడు 'మొదట్లో
డు. హాయిగా కులంవాణ్ణి చేసుకోక
మి రోగం అన్నాడు. కానీ, ఆశ్చర్యం
సుదేవరావు పేరు చెప్పగానే చేతనైన,
యం చేస్తానన్నాడు. ఆదిలక్ష్మి
ట్లోనే రంగారావు ఉన్నాడని పోలీసు
తెలుసునన్నాడు. వారి ఎందురని
కోలేదంటేని అడిగితే నవ్వాడు. నీకు
కం సంగతి తెలియదన్నాడు. ఇంత
య్యము అని ఖాజా ఆక్రోశించింది.
అన్యాయం లోకంలో ఉన్నది కను
ఇంతమంది తనవంటివాళ్ళకు ఉద్యో
దొరికిన వన్నాడు అబ్దుల్లా. మరి
తే నాకు సహాయం చెయ్యవా? అన్నది
. అని ఏడ్చింది. అబ్దుల్లాకు ఏమ్మా
నంత పని అయింది. ఇది ఫత్తి అమా
రాలు. ఆ బాపనాయనను విడిపిస్తే తన
వరుగుతుందని ఆశపడుతోంది. సుబ్బయ్య
సంగతి తనకు తెలుసు. ఇటువంటి
లు అయనముందు సాగవు. అయినా అసలు
హరావుమీద కేసునిలుస్తుందని ఎవరు అను
టున్నారూ? పోలీసులందరికీ తెలుసు.
నా నేరానికి సంబంధించిన వాళ్ళంద
ఓరకం భయం కలిగించటం పోలీసుల
తి. కొంచెం నిదానిస్తే సంగతంతా
సుస్తుంది. దోషులు బయటపడ్తారు.
నా ఈ నేరంలో ముద్దాయిలందరూ
ళ్లు. వీళ్ళమీద కేసు బనాయించినా
వరకూ నిలుస్తుందో యేమో! 'బాగా
లోచించి, "రామారావును రేపు వదలి
స్టేటు చేస్తా. మరి నువ్వు ఒకపని
చెయ్యాలి" అన్నాడు అబ్దుల్లా.

"ఏమిటది?"

"రంగారావును ఆదిలక్ష్మి ఇంట్లో
చూచినట్టు సాక్ష్యం చెప్పాలి."

"చూచానుగా మరి."

"ఎప్పుడో కాదు. ఈ నేరం జరిగిన
తరువాత చూచానని చెప్పాలి."

"మరి చూడలేదుగా."

"చూడలేదు. ఆనాడు మాటలు
విన్నావ్ గా"

"విన్నాను."

"చాలు. అమాత్రంచాలు. మిగతా సంగతి
నేను చూస్తా. నీకోసం, ఆ అమాయకుడు
రామారావుకోసం. ఇక ఆ తరువాత నీ
అదృష్టం" అన్నాడు అబ్దుల్లా.

ఎవరిని అడిగినా ఒకటేమాటా. ఆదిలక్ష్మి
ఇంట్లోంచి వందరూపాయల నోటొకటి
సంపాదించమని చెపుతారు.
ఆదిలక్ష్మి తనకు రెండువందలు
ఇవ్వవలసినమాట నిజమే. ఇప్పుడు అడిగితే
ఇస్తుందా? ఇచ్చినా దొంగసొమ్ములో నోటే
ఇస్తుందా? రామారావు తనఇంటికి వస్తూం
టాడని ఆదిలక్ష్మికి తెలుసా? తెలియదా?
యేమో మరి. తను చూడలేదు కనుక తను
ఇద్దరినీ అదికూడా చూడలేదని ఎట్లా చెప్ప
గలదూ? ఆదిలక్ష్మిలో తనకు తగాదా లేదు.
అంతఎక్కువ స్నేహంకూడా లేదు. అయినా
ప్రయత్నించి చూద్దామని అయిదోరోజు
సాయంకాలం ఆదిలక్ష్మికోసం వెళ్ళింది.
ఆదిలక్ష్మి ఇంట్లో లేదు. ఎక్కడికో పాట
కచ్చేరికి వెళ్ళిందట. ముసల్ది శ్రీదేవి ఉన్నది.
ఇంటి పెత్తనం ఇంకా దానిదే. సామెత
చెప్పినట్టు, ముసలితనంలో అది చాలా మాత
పోయింది. కళ్ళు సరిగ్గా కనిపించవు. ఖాజా
వెళ్ళగానే గొంతు గుర్తుపట్టింది. "రావే...
ఖాజా రా. ఈమధ్య కనిపించడం లేదేం?"

"వంట్లో బాగుండడంలేదు పిన్నీ."

"డబ్బుకోసం వచ్చావా ఖాజా."

"ఉంటే ఇవ్వు పిన్నీ కొంచెం ఇబ్బం
దిగా ఉన్నది."

"అట్లాగే ... కూర్చో" అని తడుముకు
కొంటూ పడకగదిలోకి వెళ్ళింది శ్రీదేవి.

కొంచెం సేపటికి శ్రీదేవి బయటికివచ్చి
"ఇదిగోనే రెండువందలు" అని ఖాజాతో
అనే సమయానికి ఇద్దరు పోలీసులు గబా
గబా ఇంట్లోకొచ్చారు. శ్రీదేవిచేతులోంచి
ఖాజా ఇంకా నోట్లు తీసుకోనే తీసుకోనే
లేదు. ముసలిదాన్నీ ఆరెండు వంద రూపా
యల నోట్లుతోసహా స్టేషనుకు తీసుకు
వెళ్ళారు పోలీసులు. ఖాజాకు భయం వెయ్య
లేదు. కానీ జాలికలిగింది. ఆఇద్దరు పోలీసు
లలో అబ్దుల్లా ఎవరో ఖాజా గుర్తుపట్టలేక
పోయింది.

మర్నాడు ఇంకొక ఆశ్చర్యం. రంగా
రావూ ఆదిలక్ష్మికూడా స్టేషనులో నిర్బం
ధంలో ఉన్నారు. రామారావు స్టేషనులో
లేడు. ఇంట్లో లేడు. ఊళ్ళో నేలేడు. ఖాజా
బీబీకూడా లేదు. ఊరంతా వెదికినా ఇద్దరూ
కనిపించలేదు.

లల్లూరామ్-సుధారామ్ కంపెనీలో
పోయిన నాలుగువేల రూపాయలూ దొరికి
వయ్; కళ్ళు కనిపించని వృద్ధవేశ్య శ్రీదేవి
కారణంగా. శ్రీదేవినీ ఆదిలక్ష్మినీ కొన్ని
ప్రశ్నలడిగి ఇంటికి పంపించారు. నేరసుడు
రంగారావు దొరికాడు కానీ
రామారావూ, ఖాజా బీబీ



అభిసారిక

—చిత్రం : శీలా వీర్రాజు.

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.